ప్రచురణ : నెం. 2.

# రైతు సమస్యలు

## (1వ భాగం)



ఎండవానలకోర్చి - బండచాకిరిచేసి
పండించి ధాన్యాన్ని - పరులపాలొనరించి
పొట్టకన్నములేక - కట్టగుడ్డయులేక
కష్టించు రైతుల - కడగండ్లు పోగొట్ట
సతతంబు పనిచేయు - స్వచ్ఛంద సేవకా!
ఈ పొత్తముననున్న - దెల్లనుగ్రహియించి
రైతు కూలీ శక్తి - రగులుకొల్పుచువేగ
ఎర్రజెండా మింటి - కెగురవేయగదోయి!



ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం
బెజవాడ.

సెప్టెంబరు : 1943. వెల : రు. 1—8—0.

# విషయసూచిక.


| పరుస నం॥ | విషయము | పు॥ మొ॥ పుట వ॥ |
|---|---|---|
| 1 | ఎస్టేట్సులాండు ఆక్టు | 1 — 32 |
| 2 | అధికాహారోత్పత్తి | 33 — 42 |
| 3 | ఫారెస్టు చట్టం | 42 — 53 |
| 4 | కరువు చట్టం | 53 — 65 |
| 5 | రైతు కూలీ సామరస్యం | 65 — 76 |
| 6 | రిజిస్ట్రేషను | 76 — 87 |
| 7 | భూమిశిస్తు విధానం | 87 — 99 |
| 8 | గ్రామోద్యోగుల మాన్యూయల్ | 99 — 118 |
| 9 | పుగ్గావుపైరు - చట్టాలు | 119 — 133 |
| 10 | ప్రభుత్వశాఖలు : వాటితో వ్యవహరించేవిధానము | 134 — 141 |
| 11 | నిర్మాణ సమస్యలు | 142 — 158 |
| 12 | ఇరిగేషన్ | 158 — 173 |
| 13 | సహకార సంఘములు | 174 — 190 |

# ఉపోద్ఘాతము.

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘముచే యీ పుస్తకం ప్రచురించబడింది. రైతు సంఘాల్లో పనిజేసే వర్కర్లకు ఇది ఒక మార్గదర్శినిగా పనిజేయగలదు. రైతులను సంబంధించిన ప్రధానమైన సమస్యలన్నిటిపై యింత సమగ్రమైన సమాచారాన్ని యిచ్చే పుస్తకం తెలుగులో యింతవరకెన్నడూ ప్రచురించబడలేదు. యిందు రైతులను సంబంధించిన ప్రభుత్వ ముఖ్యచట్టాలైన ఎస్టేట్సులాండు ఆక్టు, ఫారెస్టుచట్టం, రిజిస్ట్రేషన్ చట్టం, భూమిశిస్తు విధానం, గ్రామోద్యోగుల మాన్యుయల్, ఇరిగేషన్, సహకార సంఘాల గూర్చిన చట్టం యిందులో చాల చక్కగా విశదీకరింపబడ్డాయి; అందు గల ముఖ్య లోపాలుగూడ యెత్తి చూపబడ్డాయి. సామాన్య వ్యవహారజ్ఞానాన్ని యిచ్చేటట్టి 'ప్రభుత్వశాఖలు - వాటితో వ్యవహరించే విధానం' లాంటి విషయాలుగూడ విపులంగా చెప్పబడ్డాయి. కేవలం ప్రభుత్వ చట్టాలగూర్చి వ్రాయబడడమేగాక రైతు ఉద్యమాన్ని నేటి పరిస్థితులలో యెలా అభివృద్ధిచేయాలో ఆ విషయాలుగూడ యిందులో చెప్పబడ్డాయి. 'అధిక ఆహారోత్పత్తి', 'రైతు కూలీ సామరస్యం' 'నిర్మాణ సమస్యలు' - యివి రైతు వుద్యమాన్ని నేడు యెలా అభివృద్ధిజేయాలో స్పష్టంగా తెల్పుతున్నాయి. అందుచేత 'రైతు సమస్యలు' అనే ఈ పుస్తకం ఆంధ్రరాష్ట్రంలో రైతు వుద్యమాన్ని పెంపొందించడానికి యెంతేని తోడ్పడుతుందనడానికి సందేహంలేదు.

ఆంధ్రరాష్ట్ర రైతు వుద్యమములో నూతన అధ్యాయము ప్రారంభమైనది. రైతు వుద్యమము ఆందోళనాదశనుండి క్రమేపీ నిర్మాణదశలోకి ప్రవేశించుతోంది; ప్రాథమిక రైతుసంఘాలు తమ ప్రాంతాల రైతుల యిబ్బందులను తీసుకొని వాటిని తొలగించడానికి కిందామీదా పడుతు

న్నాయి. కొన్ని ప్రాంతాలల్లో రైతు ప్రజానీకానికి [illegible] అవి నాయకత్వం వహించుతున్నాయి.

నేడు రైతు వుద్యమమున్న యీ పరిస్థితుల్లో యీ పుస్తకం ఒక నూతన యుగాన్ని తీసుకొస్తుందని చెప్పడానికి సందేహమేమీ లేదు. రైతు వర్కర్లు తమతమ ప్రాంతాల్లో రైతు సమస్యలను ఏలాగో ఓలాగు పరిష్కరించడానికి పోరాటంజేస్తూ చీకట్లో తడుముకుంటూ వున్నప్పుడు యీ పుస్తకం వారికి యెంతో సహాయపడగలదు. తమ స్థానిక సమస్యలను జయప్రదంగా పరిష్కరించడానికి తగిన దృష్టిపథం వారికి కల్గుతుంది; ఆందోళన గావించే శక్తే మన వర్కర్స్కు యిదివరలో వుండిగాని సమస్యలను పరిష్కరించుటకు తగిన వ్యవహారజ్ఞానం, నిర్మాణశక్తి యింకా కలుగలేదు. అవి అలవర్చుకోవడానికి యిప్పుడిప్పుడే తంటాలు పడుతున్నారు. అలాంటి మన రైతువర్కర్స్కు, యింకా అనేకమందిని పైవారిలాగ తయారుజేయుటకు యీ పుస్తకం చాల తోడ్పడుతుంది. ఎప్పుడైతే రాష్ట్రమంతటా స్థానిక సమస్యలను సమర్థతతో పరిష్కరించే వ్యవహారజ్ఞానం, నిర్మాణశక్తిగల రైతువర్కర్లు తయారవుతారో అప్పుడు రైతు వుద్యమము అభేద్యమౌతుంది. అనివార్యంగా కొనసాగింపబడుతుంది.

రైతు వుద్యమములో నేడున్న ప్రధాన లోటు రైతు వర్కర్లకు రైతు సమస్యలనుగూర్చి సమగ్రంగా తెలియకపోవడం, వాటిని పరిష్కరించడానికి కావలసిన వ్యవహారజ్ఞానం లేకపోవడం. ఈ లోటువల్ల గ్రామాలలో ప్రజలనందరిని సమీకరించలేకపోతున్నారు. రైతువర్కర్లు వారి సానుభూతిపరులు ఒక ముఠాగావుండి పోతున్నారు. చెట్టుక్రిందప్లీడర్లలాంటి సంస్కరణవాదులచుట్టూ మూగినంతమంది ప్రజలుగూడ రైతు సంఘాలలోకి ఆకర్షింపబడుటలేదు. వారి పలుకుబడినుండి ప్రజలను పూర్తిగా లాగలేకపోతున్నారు. దీనికి ప్రధానలోపం మన రైతు వర్కర్లకు అవసరమైనంతే

వ్యవహారజ్ఞానంగూడ లేకపోవడం. దాన్ని తీర్చడానికి యీ పుస్తకం బాగా ఉపయోగపడుతుంది. తద్వారా ఆందోళనాదశ దాటి నిర్మాణదశకు పోవడానికి ప్రస్తుతంలో చేస్తున్న ప్రయత్నాలు యెంతో ముందుకు పోవడానికి అవకాశముంటుంది. ఇది ఒక అడుగు ముందుకువేయడం. కాని యిచ్చట ఒక ముఖ్యవిషయాన్ని గ్రహించాలి.

రైతు సమస్యలకు సంబంధించిన వ్యవహారజ్ఞానం మనవర్కర్సు సంపాదించడముతోనే సరిపోదు. ఇలాంటి వ్యవహారజ్ఞానం సంస్కరణవాదులకు గూడ వుంటుంది. వారికీ మనకూ దాన్ని రైతుఉద్యమాన్ని అభివృద్ధి జేయడానికి వుపయోగించే విధానంలో భేదముంది. సంస్కరణవాదులు ప్రభుత్వ చట్టాలను అనుసరించి పనిజేయడమే పరమావధిగా యెంచుతారు. వాటి హద్దులనుదాటి రైతు వుద్యమాన్ని అభివృద్ధి జేయరు. రైతు వుద్యమాభివృద్ధిని ప్రభుత్వ చట్టాలపై ఆధారపర్చుతారు. మనపంథా విప్లవపంథా. ప్రభుత్వ చట్టాలవలనవుండే అవకాశములను ప్రజలను సమీకరించడానికి వుపయోగపర్చుతాము. ప్రజాసమీకరణే మన ఆశయము. ప్రభుత్వ చట్టాలవలనగల్గే అవకాశాలను ప్రజాసమీకరణ చేయడానికి వుపయోగించడం చేతగాకపోతే సంస్కరణ వాదులవలె తయారౌతాము; ఇంతవరకు అభివృద్ధి అయిన వుద్యమాన్ని అరికట్టడానికి వుపయోగపడుతాముగాని ముందుకు తీసుకుపోవడానికి కృషి చేయజాలము. కాన ముఖ్యవిషయమేమంటే ప్రజలకు సంబంధించిన సమస్యలగూర్చిన వ్యవహారజ్ఞానం తెలుసుకోవడం ప్రజాసమీకరణ జేయడానికేగాని, సంస్కరణవాదులవలె ప్రజాసమీకరణ లేకుండా ప్రభుత్వ చట్టాలు పెట్టే హద్దులననుసరించే పనిచేయుటకుగాదు.

ప్రతి రైతువర్కరు, పైదృక్పథంతో యీ పుస్తకాన్ని 'అధ్యయనం' గావించాలి. తమతమ ప్రాంతాలలోని రైతుసమస్యలను సంపూర్తిగా తెలుసుకోవాలి. ఆజ్ఞానంతో తమప్రాంతాల రైతులలో పనిచేయడానికి, సమస్యలు

పరిష్కరించడానికి, తద్వారా ప్రజలందరిని సమీకరించడానికి పూనుకోవాలి. అప్పుడే ఆందోళన దశనుండి దాటి రైతువుద్యమాన్ని నిర్మించగల్గుతాము. ఈ కర్తవ్యాన్ని నిర్వహించడానికి రైతువర్కర్లు యీ "రైతుసమస్యలు"ను బాగా వుపయోగించుకోవాలి. దీన్ని యెంతవరకు రైతువర్కర్లు వుపయోగించుకొంటారో దాన్నిబట్టి, నిర్మాణరీత్యా ప్రజాపలుకుబడిని సంపాదించడంలో రైతువుద్యమము ముందుకు పోయేదీ లేనిదీ ఆధారపడి వుంటుంది.

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం తరఫున, రైతు వర్కర్లను తర్ఫీదుగావించడానికి నడుపబడుచున్న స్కూళ్ళలో విద్యార్థుల కివ్వబడిన పాఠాలు ఈవిధంగా పుస్తకం రూపేణా ప్రకటించబడ్డాయి. అందుచే అన్ని సమస్యల గూర్చి సమగ్రమైన సమాచారం పూర్తిగా యివ్వబడకపోవచ్చు. రైతు సమస్యలనుగూర్చిన సమాచారాన్ని సేకరించడానికీ, అదీ కేవలం సంస్కరణవాద దృక్పథంతోగాకుండా, రైతు వుద్యమాభివృద్ధి దృష్టితో ప్రయత్నించడం, యిదే ప్రథమ ప్రయత్నమగుటవలన సహజంగా ఈ పుస్తకంలో యివ్వబడ్డ సమాచారం పూర్తిగాను, సమగ్రంగాను వుండజాలదు. యీ లోపాన్ని పునర్ముద్రణములో తీర్చడానికి ప్రయత్నించబడుతుంది.

బెజవాడ,
8—9—1943.

ఇట్లు,
చలసాని వాసుదేవరావు.

# ఎస్టేట్సులాండు ఆక్టు

## I

### ఎందుకు చదవాలి?

జమీందారీ పద్ధతి నశించాలి అనేది ప్రాథమిక కోర్కె. ఇందుకు రైతులను సమీకరించాలంటే వారి దైనందిన కష్టాలనివారణకై కృషిచేసి వారిని ఉద్యమంలోకి తేవాలి. ఇందుకు లీగల్ అవకాశాలను వినియోగించు కోవాలి.

### జమీందారీ పద్ధతి ఎందుకు ఏర్పడింది?

1. ఈస్టిండియా కంపెనీ పరిపాలన ప్రథమదినాలలో భారతీయులలో కొందరిని తమకు తైనాతీలుగా సృష్టించుటకూ,

2. అంతకుపూర్వమున్న చిన్న చిన్న సంస్థానాధిపులకున్న పటాలములు; అధికారములు తగ్గించి వారిని కేవలం తమ ఆధారంవల్లనే బ్రతుకు నట్లు చేయుటకూ,

3. కంపెనీకి పన్నులను సాఫీగా రాబట్టుకొనుటకూ.

మద్రాసురాజధానిలో ఈ పద్ధతి 1802 సం॥ లో ప్రవేశపెట్ట బడింది. ఇందుకు సంబంధించిన చట్టాలలో పట్టా రెగ్యులేషను, శాశ్వత ఫైసలా రెగ్యులేషను, కరణము రెగ్యులేషను, 1865 సం॥ రెంటురికవరీ ఆక్టు, 1908 సం॥ ము ఎస్టేట్సులాండుఆక్టు (సవరణలతో సహా) ముఖ్య మైనవి. ఇప్పుడు అమలులోనున్నది ఎస్టేట్సులాండు ఆక్టు.

### ఆక్టు పూర్వచరిత్ర.

రెగ్యులేషన్సును అన్వయించుటలో జడ్జీలలో అభిప్రాయభేదము వస్తూవుండేవి. ఇంగ్లీషు జడ్జీలు (కాలెటు) బ్రిటిషు న్యాయశాస్త్రాల ప్రకారం రైతును "టెనెంటు" (కౌలుదారు) అని, జమీందారును

"ప్రొప్రయిటర్" (భూస్వామి) అని, పన్నును "రెంటు" అని వ్యవహరిస్తూ అనాది సిద్ధంగావున్న రైతుల హక్కులకు భంగం కలిగిస్తూ వచ్చేవారు. భారతీయ జడ్జీలు (ముత్తుస్వామి అయ్యర్, సుబ్రహ్మణ్య అయ్యర్) కొంతవరకు రైతుల కనుకూలంగా తీర్పులిచ్చేవారు. కాబట్టి రైతుల, జమీందార్ల హక్కులను స్పష్టీకరిస్తూ చట్టాన్ని చేయవలసి వచ్చింది. కాని 1865 సం॥ రెంటు రికవరీ ఆక్టు రైతులకున్న హక్కులను మరికొన్నిటిని ఊడగొట్టింది. పైగా రైత్వారీ పట్టాదార్లనుకూడా జమీందార్లనుగా చేసివేసింది. ఇందుచే ఈ తప్పులను దిద్దుటకై 1908 లో ఇప్పుడములులోవున్న ఎస్టేట్సులాండు ఆక్టు అసెంబ్లీచే ప్యాసుచేయబడినది. కాని ఆనాడు అసెంబ్లీలో జమీందార్లు వారి అనుచరులూ ఎక్కువమంది ఉండుటచే జమీందార్లకే అనుకూలంగా చట్టం చేయబడింది. పాత చట్టాలు, రెగ్యులేషన్లు, అన్నీ దీనితో రద్దు అయినాయి. 1936 లో ఈనాములకుకూడా ఎస్టేట్సులాండు ఆక్టు వర్తింప చేయబడింది.

శాశ్వత ఫైసలా నిర్ణయం లార్డు కారన్వాలీసు గవర్నరు జనరలుగా వున్నప్పుడు జరిగినది. ఎస్టేట్సు లాండు ఆక్టును ప్రవేశపెట్టింది 1908 లో రెవిన్యూ మెంబరుగావున్న మిస్టర్ ఫోర్బ్సు.

1936 లో ఈనాములకు ఆక్టును వర్తింపజేసింది బొబ్బిలి మంత్రివర్గం.

జమీందారీ రైతుల పరిస్థితులను విచారించి, తగిన మార్పులను చట్టంలో చేయుటకు ప్రకాశం కమిటీ నియమింపబడ్డది 25-9-37 న.

## II

## ఇబ్బందులు – నివారణోపాయాలు.

### భూముల స్వభావం:

ఎస్టేటులో వుండే భూములన్నీ 3 తరహాలకింద విభజింపబడ్డాయి. (1) సాముదాయకభూములు, (2) స్వంతకమతాలు, (3) రైతీభూములు.

సాముదాయిక భూములంటే? గ్రామ సమిష్టి వినియోగార్థం నిర్దేశింపబడ్డ భూములు. పంటకల్లాలు, గోభూములు, గ్రామకంఠాలు, శ్మశానాలు, డొంకలు, పుంతలువగైరాలు వస్తాయి.

చెర్వుతోట్లు (చెరువులో భాగము లేకా పడకలు) కట్టలు మొదలగు సాముదాయిక భూములు కావని జమీందార్ల వాదన.

ఒక భూమి సాముదాయిక భూమి అవునా కాదా అని నిర్ణయించేది కలెక్టరు (సె 20)

సాముదాయికభూమి నిరుపయోగమైనప్పుడు కలెక్టరు దాని స్వభావమును మార్చి రైతీభూమిగా చేయవచ్చును. (సె 20 A)

సాముదాయిక వుపయోగములకుగాను భూమి కావలసివచ్చినచో, అనగా క్రొత్తగా డొంకలు మొ॥ ఏర్పరుచ్చుటకు కావలసివచ్చినచో, కలెక్టరు 1894 లాండు అక్విజిషన్ ఆక్టుక్రింద భూమిని తీసుకొని సాముదాయిక భూమిని ఏర్పర్చవచ్చును. (సె 20 B)

సాముదాయికభూమిని ఎవరైనను ఆక్రమించుకుంటే, 30 సం॥ల లోగా 1905 లాండు ఎంక్రోచిమెంటు ఆక్టుప్రకారం కలెక్టరు అట్టి ఆక్రమణదారును వెళ్ళగొట్టవచ్చును. అందలి పంటలు మొ॥ వాటిని సమిష్టి వినియోగార్థం ఉపయోగించవచ్చును. (సె 21)

సాధారణంగా గ్రామాలలో శ్మశానాలనూ, డొంకలనూ కలుపుకొనుట వుంటుంది. గోభూములు, మందబయళ్ళు మొ॥ వాటిని జమీందారు గుత్తచేసుకోవటం వుంటుంది. ఇట్టివాటికి వెంటనే రైతులు కలెక్టరుకు పిటిషనులు పెట్టుకోవాలి.

చాలా గ్రామాలలో శ్మశానాలుండవు. ఇతర గ్రామాలకు డొంకలు వుండవు. ఇట్టి సందర్భాలలో అట్టి శ్మశానాలు, డొంకలూ ఏర్పర్చమని కలెక్టరుకు పిటీషనులు పెట్టాలి.

సాముదాయిక భూముల సద్వినియోగానికి గ్రామ రైతుసంఘాలు తగు జాగ్రత్త తీసుకోవాలి.

స్వంతకమతాలంటే? జమీందారు స్వయంగాగాని, కూలీలచేతగాని సాగుజేయించుకొను భూములు ఎస్టేట్లలో 1908 కి పూర్వం 12 సం॥ జమీందారే ఈ విధంగా సాగుజేయించుకున్నట్టిన్ని ఈనాములలో 1934-36 లకు పూర్వం 12 సం॥ లు వరుసగా ఈనాందార్లచే సాగుజేయబడి, జిరాయితీ హక్కు కూడా (మేడివరం హక్కు) వారికే వున్నట్టి భూములు స్వంతకమతాలనబడుతాయి. ఎస్టేట్లుగాని, ఈనాములుగాని గవర్నమెంటు సర్వే జరిగియుంటే ఈ స్వంతకమతాలు ఆవిధంగా నమోదు చేయబడివుంటాయి.

కమతం భూముల నెప్పుడైనా జమీందారు రిజిష్టరు చేసికోవచ్చును. (సె 183)

కమతం భూములను జిరాయితీభూములుగా (రైతిభూములుగా) జమీందారు మార్చవచ్చును (సె 181)

కమతం భూములవునా, కాదా, అని తగాదావచ్చినప్పుడు నిర్ణయించేది. కలెక్టరు.

ఈనాములలోని భూములకు రైతు 1 సం॥పు శిస్తుకు ఒకనంగా పరిహారం ఇచ్చినచో, అతనికి జిరాయితీహక్కును ఈనాందారు కల్గజేయాలి. (సె 185 B. ఈ సెక్షను 1936 సవరణగా జేర్చబడినది.)

స్వంత కమతాలను సాగుజేయు రైతుకు జిరాయితీహక్కు సంక్రమించదు. ఈ కవులుదార్లకూ జమీందార్లకూ ఉండు సంబంధాలు రైత్వారీ రైతుకూ కవులుదారుకు వుండు సంబంధాలవలెనే ఉండును.

స్వంత కమతాల తాలూకు బకాయి కవులును (బకాయి శిస్తును) సివిల్ కోర్టులో దావావేయుట ద్వారానే జమీందారు తీసుకోగలడు. ఎస్టేట్సు లాండు ఆక్టు కమతం భూములకు వర్తించదు. (సె 18)

రైతీభూములంటే? పై జెప్పబడిన సాముదాయిక భూములున్నా, స్వంత కమతాలున్నూ కాకనూ, చాకిరి ఈనాములూ, చెరువుపశికలు, కాలవతోట్లు, కట్టలు కాకనూ మిగిలివున్న సాగుకు లాయకైన యావత్తు భూములున్నా, రైతీభూములే. ఈ భూములిప్పుడు సాగు అవుతున్నా, బంజర్లుగావున్నా, తరంకట్టబడినా, కట్టబడకపోయినా రైతీభూములే. (సె 3 లో 16)

బంజర్లన్నీ తమవేనని జమీందార్లు వాదిస్తారు. అది మోసం. స్వంత కమతాలు కాని భూములేవీ జమీందారు స్వంతం కావు.

బంజర్లను జరాయితీహక్కు కల్గజేయకుండా టెంపరరీ కాంట్రాక్టులు వ్రాసుకొని తోటలు వేయుటకు జమీందారు రైతులకు ఇవ్వవచ్చును. అట్టి వాటిలో జిరాయితీహక్కు కల్గదు. (సె 6)

జమీందారు స్వయంగాగాని, తన కూలీలచేగాని సాగుచేసినప్పుడు, అప్పటినుండి 30 ఏండ్లవరకూ జిరాయితీ హక్కులే సంక్రమించకుండునట్లు రైతులచే కాంట్రాక్టు వ్రాయించుకొనవచ్చును. (సె 6)

పశువుల మేతకు బంజర్లు ఇవ్వబడటంవల్ల జిరాయితీ హక్కు కలగదు (సె 6)

అనుమతిలేకుండా రైతీభూముల నాక్రమించుకున్న మనిషిని 12 సం॥ల లోగాగాని, లేక అట్టిభూమిపై ప్రతిఫలం పుచ్చుకొన్నచో, అట్లు పుచ్చుకొన్న 2 సం॥ల లోపుగాగాని, దావావేసి ఆక్రమణదారును వెళ్ళగొట్టవచ్చును. ప్రతిఫలం పుచ్చుకున్న 2 సం॥లలో జమీందారు దావా వేయనిచో రైతుకు జిరాయితీహక్కు కల్గుతుంది. లేక ఏవిధమైనశిస్తులూ చెల్లించకుండా వరుసగా 12 సం॥లు ఆక్రమించుకున్నచో అట్టి భూములలో జిరాయితీ హక్కు సంక్రమిస్తుంది. (సె 6)

ఏవిధంగానైనా రైతీ భూములపైవున్న జిరాయితీహక్కు జమీందారుకు సంక్రమించుచో (అనగా కొనుటవల్ల, విడుదలపెట్టడంవల్ల, దానంగా పొందుటవల్ల మొ॥) ఆ భూమి రైతీభూమిగానే వుంటుంది. దానిని తిరుగ రైతులకు సాగుకిస్తే ఆ రైతులకు జిరాయితీ హక్కు కూడా సంక్రమిస్తుంది. తాత్కాలికంగా జిరాయితీహక్కు జమీందారుకు సంక్రమించినంత మాత్రాన ఆభూమి స్వంత కమతంక్రిందకు మార్చవీలులేదు. (సె 8)

చట్టప్రకారంగా తప్ప రైతీ భూములనుండి రైతులను వెళ్లగొట్టుటకు వీలులేదు. (సె 9)

ఎస్టేట్లలో అనేక భూములు శిస్తు బకాయీలక్రింద వేలం వేయబడి జమీందారుచేతనే కొనబడుతాయి. అట్టివాటిని జమీందార్లు తిరిగి సాగుకివ్వనప్పుడు స్వంత కమతాలుగా చూపెడుతారు. కాని అట్టి భూములలో ప్రవేశించు రైతులకు జిరాయితీ హక్కుంటుంది. కాబట్టి ఈవిషయమై శ్రద్ధగా పరిశీలించవలసి యుంటుంది.

ఇట్టి భూములను సాధారణంగా జమీందార్లు, తమ బంధువులు, ఉద్యోగులు మొ॥ వారిపేర ప్రధమంలో ఇచ్చి, వారిచే రైతులకు కవులు కిప్పించినట్లు దస్తావేజులు సృష్టిస్తారు. అట్లు అయినచో వారి బంధువులకే జిరాయితీ హక్కు కల్గుతుంది.

కొత్త భూములను రైతులకు పట్టాపై సాగుకిచ్చునప్పుడు జమీందారు నజరానా కోరవచ్చును. ఈ నజరానా వసూలు పట్టా యివ్వకపూర్వమే జరగాలి. (సె 25)

ఈ పైజెప్పబడ్డ భూములుకాక మైనరు ఈనాములూ, చెరువుతోట్లూ (పడకలు) మొ॥ వున్నవి. చెరువుతోట్లను చెరువులో నీరు లేనప్పుడు జమీందారు కవులుకీయవచ్చును. అవి స్వంత కమతాలు మాత్రం కాదు. సాగుకిచ్చినప్పుడు బంజరు భూములవలెనే వ్యవహరింపబడుతాయి.

పైన ఈనాములనగా సర్వదుంబాలా యినాములూ, చాకిరి ఈనాములు ముll సర్వదుంబాలా ఈనాముల్లైే జమీందారుకిట్టి హంకా, శేరు. చాకిరి ఈనాములను, జమీందార్లు తమ స్వంత నౌకరి నిమిత్తం చాకలి, మంగలి ముll వృత్తులవారికిచ్చిన ఈనాములు. ఆ నౌకరీ చేస్తున్నంత కాలం వారు ఆభూముల ననుభవించవచ్చును. వారి నౌకరితో నిమిత్తం లేకపోయినా, వారు నౌకరీ చేయుట మానుకున్నా అవి ఈనాముల స్వభావాన్ని కోల్పోతాయి. ఈభూములను జమీందారు స్వాధీన పర్చుకొన వచ్చును. (రిజ్యూము)

1860 లో ఏర్పడ్డ ఈనాము కమిషనువారు ఈ యినాములను సర్వే చేసినప్పుడు ఆట్టి సర్వేలో అనేక లోపాలు జరిగినాయి. ఈనాందార్లు క్విట్ రెంటు తక్కువ చెల్లించాలనే ఉద్దేశంతో తక్కువ విస్తీర్ణాన్ని చెప్పుటచే కమీషను తక్కువవిస్తీర్ణాన్ని నమోదుచేసింది. కాని ఈనాము రీసర్వేలో ఆనాడు చూపబడ్డ సరిహద్దులలోనే హెచ్చు విస్తీర్ణం తేలింది. ఈ హెచ్చు భూమి ఆక్రమణయని జమీందార్ల వాదన. కాని అది తప్పు; పూర్వం సర్వేలో జరిగిన లోపంఅది.

మరొక మోసం. జమీందార్లు ఈహెచ్చుభూమి అన్నదానిని స్వాధీన పర్చుకొంటున్నారు. అందుకు వారికి అధికారంలేదు. ఈనాందారు ఆక్రమణదారు అని నిర్ణయింపబడ్డా సె 6 ప్రకారం అతనికి జిరాయితీ హక్కు సంక్రమిస్తుంది. ఇది ప్రీవీకౌన్సిలులో చేయబడ్డ నిర్ణయం. అంతవరకూ పోలేని రైతులకు అన్యాయం జరిగింది.

ఈనాము కొద్దిదైనా, వారసత్వరీత్యా దానిని ఈనాందార్లు పంచుకున్నప్పుడు ఆ ఈనాందార్లందరూ జమీందారుకు నౌకరీచేయాలి. ఇది అన్యాయం. ఒక్క ఈనాందారే చేయుటకు బాధ్యుడు; లేదా అందరూ వంతుల ప్రకారం మాత్రమే చేయ బాధ్యులు.

ఈ ఈనాముల నన్నిటిని రద్దుపర్చి, ఆ ఈనాందార్లకే జిరాయితీ పట్టా లివ్వమని కోరాలి.

# III

## రైతీభూములపై హక్కులు.

భూమియొక్క విలువ చెడకుండాను, లేక వ్యవసాయోపయోగానికి చెరుపు కలిగకుండాను, రైతు తన భూమిని ఏవిధంగానైనా వుపయోగించు కొనవచ్చును. (సె 11)

ఈ క్రిందివి వ్యవసాయానికి చెరుపు కలిగించవని హైకోర్టు తీర్పులు చెప్పుతున్నాయి:

(1) పశువులకు కొట్టాలు కట్టించటం

(2) కాపురముండే ఇల్లు కట్టించటం

(3) బంగాళాదుంపలు, కూరలు వగైరా పండించటం

(4) నీలితోట వేయాటం; కొబ్బరితోట వేయటం

ఈ క్రిందివి చెరుపు కలిస్తాయి.

(1) తోట భూములలో అనేకయిండ్లు కట్టించటం

(2) నీలి తొట్టెలను కట్టించటం

సాధారణంగా ఎస్టేట్లలో భూములలో ఏవికట్టినా, వ్యవసాయానికి చెరుపు కలిస్తాయని అభ్యంతరాలు చెప్పుతారు గాని వ్యవసాయాభివృద్ధికి తోడ్పడే పనులుచేస్తే ఈ అభ్యంతరాలుచెల్లవు. వ్యవసాయాభివృద్ధికై భావులు తవ్వించవచ్చును.

వ్యవసాయానికి పనికిరాని ఉపయోగాలకై అనగా పాఠశాలలు, దేవాలయాలు కట్టించటం, దిబ్బలుపోయటం, గోతులు త్రవ్వటం చేయ కూడదు. అట్లు చేయవలసినచో జమీందారు యొక్క లిఖితపూర్వకమైన అనుమతిని పొందాలి.

వ్యవసాయానికి చెరుపు కలిగించే పనులు చేస్తే ఆ భూమిపై నుండి రైతును వెళ్ళగొట్టి జమీందారు నష్టపరిహారం కోరవచ్చును. (సె 151)

రైతు జిరాయితీ భూమిలోవున్న రాళ్లు, బండలు ము॥ వాటిని తొలగించవచ్చును. జమీందారు అనుమతిలేకుండా తొలగిస్తే జమీందారు కొంత పరిహారం కోరవచ్చునేగాని రాళ్లు ము॥ తొలగించుట మాత్రం అభ్యంతరగా పెట్టకూడదు. (మద్రాసు హైకోర్టు తీర్పు 525)

భూమి అంతర్భాగానవున్న రాళ్లు, ఖనిజాలు, నిధి నిక్షేపాలు ము॥ వాటిపై అనగా గనులపై జమీందారుకే హక్కున్నది. రైతుకెట్టి హక్కున్నూ లేదు. (సె 7)

పైనున్న రాళ్లు, బండలు వగైరా తొలగించుట వ్యవసాయాభివృద్ధికి అని భావించాలి. సాధారణంగా జమీందార్లు ఇందుకు అంగీకరించరుగాని, వారి అభ్యంతరం చెల్లదు. వారు ఏమైనా పెద్దబండలైతే ఫీజు మాత్రం అడుగవచ్చును.

జిరాయితీ భూములలో 1908 నాటికి, అనగా ఈ ఆక్టు ప్యాసగు నాటికి, జమీందారువిగా నమోదుకాబడ్డ చెట్లుమాత్రం జమీందారువి. మిగతావి 1908 కి పిమ్మట పుట్టిన చెట్లుఅన్నీ రైతులవే. (సె 12)

జమీందారు చెట్లా, రైతు చెట్లా అని తెల్పుటకు 1908 నాటి పట్టాలు చూడవలెను. లేక చెట్లపట్టాలు వేరుగావున్నచో, వాటిని చూడవలెను. అట్టివేవీ లేనిచో సుమారు వయస్సునుబట్టి నిర్ణయించాలి. 1908 అటుపిమ్మట ఇవ్వబడ్డ పట్టాలలో జమీందారువిగా నమోదు కాబడ్డవే జమీందారువి. లేనిచో అన్ని చెట్లూ రైతులవే.

జమీందారు చెట్లనుకూడ రైతులు కొద్ది మామూలు ఫీజునిచ్చి పొందవచ్చును. (సె 12)

జమీందార్లు తమ చెట్లను కొట్టివేసుకుంటారు. పిమ్మట పుట్టిన చెట్లను కూడా తమ చెట్ల సంఖ్యవరకూ తమవేనంటారు. కొత్త జమీందారు జిరాయితీ భూములలోని తన చెట్లను కొట్టుకుంటున్నప్పుడు రైతుదాఖలా చీటిని కోరాలి. లేనిచో వెంటనే కలెక్టరుకు రిపోర్టు చేయాలి.

జమీందారు చెట్లను జమీందారూ, రైతు చెట్లను రైతూ అనుభవించుటకూ కొట్టుకొనుటకూ హక్కుగలవారై యున్నారు. తాటి, ఈత చెట్లను కల్లుగీతకు ఇచ్చునప్పుడు ఎవరి ఫీజును వారే తీసుకోవాలి. కల్లుంగడి ఇజారాదారు చెట్లకు నంబర్లు వేయకపూర్వమే, రైతు మొదళ్ళ పన్నును (కల్లు గీసుకొనుటకై కలాలీలు చెట్లుగల రైతులకిచ్చు మామూలు ఫీజు) వసూలు చేయాలి. ఇవ్వనిచో నంబర్లు వేయనీయకుండా అభ్యంతరం పెట్టాలి. నంబర్లు వేసిన పిమ్మట చేసేదేమీలేదు.

రైతుభూమిని అభివృద్ధి పర్చుటకై చెరువులను, బావులను పంట కాల్వలను, మురుగుకాల్వలను, బోదెలను త్రవ్వించవచ్చును. లేక పొదు గొట్టవచ్చును; భూమిని చదునుచేయవచ్చును. ఈవిధంగా అభివృద్ధిపర్చుటకు జమీందారు ఆటంకపర్చలేదు. (సె 13)

జమీందారూ, రైతూ ఇర్వురూ అభివృద్ధి చేయగల్గుచుంటే రైతుకే ముందుహక్కు చెల్లుతుంది. రైతు అభివృద్ధి చేసుకుంటే జమీందారు శిస్తును హెచ్చించుటకు వీలులేదు. జమీందారు అభివృద్ధిచేస్తే హెచ్చుశిస్తును కోరవచ్చును. రైతు చేసుకున్న అభివృద్ధి జమీందారు ఇతర భూములకు చెరుపు కల్గించకూడదు. రైతు భూములకు ఉపయోగపడే బావులు వగైరా జమీందారు పోరంబోకలలో త్రవ్వితే అట్టివాటికి జమీందారు అనుమతిపొందాలి. అట్టి సందర్భాలలో కూడా జమీందారు అభివృద్ధికి తోడ్పడ్డట్లే అవుతుంది. (సె 13)

జమీందారు చేసిన అభివృద్ధిని ఆపని పూర్తి అయిన 12 నెలలలోగా కలెక్టరువద్ద రిజిష్టరు చేయించాలి. అట్లు చేయించనిచో ఆ అభివృద్ధి జమీందారు చేసినదేనని రుజువు చేయవీలులేదు. (సె 16).

రైతుచేసిన అభివృద్ధినికూడా రికార్డుచేయమని కలెక్టరును కోరవచ్చును (సె 17).

సాధారణంగా ఎస్టేట్లలో రైతులు తమ పొరకలలో భావులు తీయించుకొని మాగాణి, లేక తోట సాగులు చేస్తూ వుంటారు. అట్టివాటిపై జమీందారు మాగాణి లేక తోటరేట్లు వసూలు చేస్తూ వుంటాడు. ఇది చట్ట విరుద్ధం. ఇట్టి అక్రమశిస్తులను రైతులు చెల్లించనవసరంలేదు. అట్లు అక్రమశిస్తులకు డిమెండు పంపినచో మెట్టుశిస్తును మాత్రంకట్టి జమీందారు దావా చేసినచో కోర్టులో కంటెస్టుచేయాలి. ఆభావులు తాము తవ్వించినవేయని రుజువుచేయాలి. ముఖ్యంగా జమీందారు ఆభావులను తవ్వించినట్లు రిజిష్టరు చేశాడాఅని ప్రశ్నించాలి. ఎస్టేట్లలో ఇట్టి అక్రమాలు జరగటం సర్వ సాధారణం.

పాతభావులను తాము తవ్వించినట్లుగానే జమీందార్లు పట్టాలలో వ్రాయించుకుంటారు. ఎస్టేట్సు లాండుఆక్టుకు పూర్వమే తవ్వబడిన భావులైతే రైతులేమీ చేయలేరు. అటుపిమ్మటవైతే, అనగా అప్పటి పాత పట్టాలలో భావులను చూపకపోతేను, ఆభావులను దర్మిలా తవ్వించినట్లు జమీందారు రిజిష్టరు చేయించకపోతేనూ, ఆభావులు రైతులవేనని ధృవపడుతాయి.

టెంపరరీ భావులు, కాల్వలు తవ్వించటం, కట్టలు పోయించటం ముll రైతు చేసుకోవచ్చును (సె 18)

## IV
## శిస్తులు.

జమీందారుకు ప్రథమ ఛార్జిహక్కు వున్నది. కాని ప్రభుత్వ హక్కుకు ఇది భంగం కల్గించదు. (సె 4)

అట్టివి పిమ్మట సాగులోనికివచ్చు భూములపై అనేకం భూములపై లేక అట్టివే వనరు, సౌకర్యాలుకలిగిన భూములపై చెల్లింపబడు శిస్తులనే విధించాలి. అట్టివి తెలియనిచో కలెక్టరు ఆ శిస్తురేటును నిర్ణయించును.

తరంగట్టబడిన భూములపై ఆ రేట్లే విధించాలి.

క్రొత్తగా సాగుజేయు బంజర్ల విషయంలో మొదట్లో కొన్ని సంవత్సరాలవరకూ తక్కువ శిస్తురేటు మాత్రమే వసూలు చేయవచ్చును. కాని అట్లు తక్కువరేటే వసూలు చేయాలని నిర్బంధంలేదు.

శిస్తులు రెండురకాలు : ఒకటి నగదుశిస్తు. రెండవది ధాన్యపుశిస్తు.

ధాన్యపుశిస్తులు రెండురకాలు : (1) పాలిపద్ధతి. అనగా పండిన పంటలో ఇన్నవవంతు అనేది. (2) కవులుపద్ధతి. అనగా ఎకరంకు ఇంత ధాన్యం అనేది.

ధాన్యపుశిస్తు రేటును హెచ్చించుటకు ఏవిధంగాను జమీందారుకు హక్కులేదు. (సె 29)

ధాన్యపుశిస్తును నగదురేట్లలోనికి మార్చుకొనవచ్చును. (సె 40) దీనికై కలెక్టరుకు పిటీషను పెట్టుకోవాలి. ఈవిధంగా మార్చునపుడు కలెక్టరు ఈక్రింది విషయాలు గుర్తిస్తాడు.

(1) గత 10 సం॥లలో జమీందారుకు వచ్చిన సగటు శిస్తు వెల.

(2) అదేమోస్తరు భూములలోని నగదురేటు (ఆ ఎస్టేటులో లేకపోతే పక్క తాలూకాలోని భూములపై చెల్లబడే నగదురేట్లు)

(3) జమీందారుగాని, రైతుగాని భూమికిచేసిన అభివృద్ధులు.

ధాన్యపుశిస్తు చెల్లించు భూములలోకూడా కోత కోయించువరకూ రైతు జమీందారుకు తెలియబర్చ నక్కరలేదు.

భూమి పెచ్చు తేలినపక్షంలో శిస్తుమొత్తాన్ని హెచ్చించవలసి వస్తుం దిగా, కమ్మీ తేలినపక్షంలో తగ్గించి చెల్లించవలసి వస్తు న్నది (సె 42)

20 సం॥ల కొకపర్యాయం జమీందారు శిస్తురేటును హెచ్చుజేయు టకై కలెక్టరుకు పిటీషను పెట్టవచ్చును ఈ క్రింది కారణములున్ననే శిస్తు రేటు హెచ్చించుటకు వీలుంది. (సె 30)

(1) గత 20 సం॥లల్లోనూ ధాన్యపు ధరలు పెరుగుట.

(2) జమీందారుచేసిన అభివృద్ధివల్ల భూమియొక్క ఫలసాయం హెచ్చుట.

(3) ప్రభుత్వం జలాధారాల నేర్పాటువల్ల జమీందారుపై శిస్తు ఛార్జి చేయుట.

(4) నదీప్రవాహం మారుట ము॥ కారణాలవల్ల ఒండు పేరు కొని భూమి ఫలసాయం హెచ్చుట.

మొదటికారణంవల్ల హెచ్చించితే ఇదివరకున్న శిస్తు రేటుపై రు 1 కి 0-2-0 కు మించకుండా శిస్తురేటు హెచ్చించవచ్చును. ఇతర కార ణాలవల్లనైతే, కొత్తగాకల్గు నికరమైన లాభంలో సగంవిలువకు మించ కుండా శిస్తురేటును హెచ్చించవచ్చును.

జమీందార్లు సాధారణంగా ఈకారణాలను చూపకుండగనే శిస్తులను కలెక్టరు అనుమతితో హెచ్చుచేస్తారు. ఆక్టు వస్తోందని భయపడి 1906 ప్రాంతాలలో శిస్తులను బాగా పెంచారు. ఆక్టు వచ్చిన పిమ్మట ఆక్టు ననుసరించి హెచ్చిస్తూ వచ్చారు. ఈ విధంగా 1802 నాటి రేట్లను ఎన్నో రెట్లు పెంచివేశారు.

20 ఏండ్ల కొకపర్యాయం శిస్తులు తగ్గించమని రైతులు కలెక్టరును కోరవచ్చును. (సె 38) అందుకు ఈక్రిందికారణాలు గావాలి.

(1) రైతు నుస్తీనల్లగాక ప్రకృతి కారణాల వల్ల భూమి చవుడు పారుట.

(2) జలాధారాలు శాశ్వతంగా నీటిని సప్లయి చేయకుండా పోవుట

(3) గత 20 సం॥లలోనూ ధాన్యపు సగటు ధరలు తగ్గుట

మామూలు భూమిశిస్తుగాక, జమీందార్లు, ఆచారసిద్ధంగావచ్చు కొన్ని పన్నులను వసూలుచేస్తూ వుంటారు. నీరు సప్లయిచేస్తే నీటిపన్నును జమీందార్లు వసూలుచేయవచ్చును. ఇవిగాక ఆచారసిద్ధంగావచ్చే చేపల పన్ను, బీటిపన్ను ము॥ వసూలు చేయవచ్చును. కాని పురోహితుడి పన్ను, పెళ్ళి పన్ను ము॥ అక్రమపు పన్నులు. అట్టిపన్నులను వసూలుచేసినట్లు రుజువైనచో జమీందారు శిక్షార్హుడౌతాడు.

## V

## శిస్తులు చెల్లించుట.

పట్టాలలో వుదహరింపబడిన శిస్తును మాత్రమే రైతు చెల్లింప బాధ్యుడు.

భూమినుండి 5 మైళ్ళ లోపున ఎక్కడ ఎస్టేటుఉద్యోగివున్నా, రైతు అక్కడికిపోయి శిస్తులు చెల్లించాలి. (సె 66) అంతకుపైబడినదూరం పోనక్కరలేదు.

ధాన్యంశిస్తు చెల్లించవలసివుంటే, 10 మైళ్ళ లోపునవున్న జామీందారు ధాన్యపు కొట్లకు రైతే స్వయంగా తోలుకపోయి అప్పగించాలి. కాని 3 మైళ్ళకు పైబడ్డ దూరానికి జమీందారు కిరాయి ఇచ్చుకోవాలి. (సె 66)

జమీందారుగాని, ఆయనచే అధికారముండిన ఏజంటుగాని శిస్తును వసూలు చేయవచ్చును.

ఏకిస్తీశిస్తు ఆకిస్తీకి కట్టకపోతే వాయిదా దాటిన మరునాటినుండి బకాయిగా ఎంచబడుతుంది. (సె 60)

రైతు చెల్లించే సొమ్మును ఏకిస్తీకి కట్టుకోమంటే జమీందారు ఆకిస్తీక్రిందనే చెల్లువేసుకోవాలి. లేదా రెట్టింపు పరిహారాన్ని రైతుకోరవచ్చును. ఏకిస్తీక్రింద కట్టుకోమన్నదీ రైతు చెప్పకపోతే జమీందారు తన యిష్టంవచ్చిన కిస్తీకి కట్టుకోవచ్చు. (సె 64, 65)

సాధారణంగా జమీందార్లు ఇందులో మోసంచేస్తూ వుంటారు. ఈసంవత్సరం కిస్తీక్రింద యిచ్చిన సొమ్మును, బకాయీల చెల్లుక్రిందనో, లిమిటేషను పట్టిన శిస్తుబకాయి చెల్లుక్రిందనో జమ కట్టుకుంటారు. కాబట్టి రైతు లీ విషయంలో జాగ్రత్తగా వుండాలి.

రైతు చెల్లించు శిస్తుకు రశీదు పొందుటకు అర్హుడు. గశీదులో ఈ క్రింది వివరాలు ఉండితీరాలి.

(1) చెల్లించువాని పేరు; తీసుకొనువాని పేరు.

(2) ఏ వూరిలో భూమివున్నది.

(3) చెల్లింపబడ్డ మొత్తం.

(4) ఏభూమికిగాను శిస్తు చెల్లింపబడ్డదో దానివర్ణన.

(5) ఏ సం॥ ఏకిస్తీకిగాను చెల్లింపబడ్డది.

(6) చెల్లించబడ్డది పూరాపరిష్కారానికా? కొరతగానా?

(7) తేది.

ఈ వివరములలో ఏదిసరిగా లేకపోయినా అంతవరకూవున్న శిస్తు బకాయీలన్నీ పూర్తిగా చెల్లింపబడ్డట్లే లెక్క. (సె 62, 63)

సాధారణంగాపూరా కొర్తయున్నది పూర్తిచేయక. లేదా పూర్తిగా ఇచ్చినా, కొర్తయని వ్రాస్తారు. వీటివిషయాలలో జాగ్రత్తగా వుండాలి. ఏకిస్తీకి చెల్లించామో అది సరిగా వ్రాయునట్లుకూడా జాగ్రత్తతీసుకోవాలి. ముఖ్యంగా ఏభూమికిగాను చెల్లిస్తున్నామో ఆభూమి వర్ణన ఉండాలి. అనగా ఆభూమి పేరుగాని, సర్వే నెంబరుగాని ఉండాలి. కాని జమీందార్లు ఈ వర్ణన యివ్వక పట్టానంబరు వేస్తారు. జాయింటుపట్టాలో ఎవరు చెల్లించారో, ఎవరివాటాకుగాను చెల్లించారో తెలియకపోతే, వాటాదార్లకు కష్టం. కాబట్టి ఏభూమికిగాను చెల్లించారో వివరించ్రాసి యిమ్మని డిమాండు చేయాలి.

రశీదు యివ్వకపోతే చెల్లించిన మొత్తానికి రెట్టింపు ముదరా కోర వచ్చును.

రైతులిచ్చిన మొత్తాలకు సరిగా రశీదులివ్వక లేక జమకట్టుకొనక అనేక ఇతరవిధాలుగా జమీందార్లు మోసంచేస్తారు. లేక ఒకరికన్న ఎక్కువమంది జమీందార్లు వుండవచ్చును. కాబట్టి ఇట్టి సందర్భాలలో రైతుకు కొన్ని వీళ్ళువున్నాయి.

(1) శిస్తు మొత్తాన్ని మనియార్డరు చేయవచ్చు. ఇట్టిపక్షంలో ఎవరు, ఎవరికిక్రింద ఏభూమికిగాను ఏకిస్తీకిగాను చెల్లిస్తున్నారో వివరాలు తెలియజేస్తూ రిజిష్టరు వుత్తరం వ్రాయాలి.

(2) పై కారణాలు తెలియజెప్పచూ, కలెక్టరుకోర్టులో డిపాజిటు చేయువచ్చును. ఇందుకు కలెక్టరు అంగీకరించాలి.

శిస్తు తకరర్లు ఉన్నచోట్ల ఈపద్ధతుల నవలంబించుట మంచిది.

## VI

## జప్తులు - వేలాలు.

కిస్తీ వాయిదా దాటిన మరునాటినుండి శిస్తు బకాయిగా ఎంచబడును.

కమతం భూముల శిస్తు బకాయిలకై సివిల్ కోర్టులో దావా చేసుకోవలసినదే.

జిరాయితీ భూముల శిస్తు బకాయీవసూళ్ళను భూమి లేక చరాస్తుల జప్తు, వేలములమూలకంగా రాబట్టుకొనవచ్చును. (సె 77)

భూమికాని స్థిరాస్తిని జప్తుచేయుటకు వీలులేదు.

కవులుదార్ల ఆస్తిని జప్తుచేయుటకు వీలులేదు.

చరాస్తియనగా భూమియందలిచెట్లు, పంటలు, ధాన్యం, పశువులు మొదలగునవి.

కట్టుగుడ్డలు, వంటపాత్రలు, పరుపులు, జంపఖానాలు, మతాచారాల ప్రకారం విడువకూడని స్త్రీల ఆభరణాలు, నాగళ్ళు మొ|| వ్యవసాయపనిముట్లు, దుక్కిటెడ్లు, ఎరువులు, ముందు వ్యవసాయమున కవసరమైన విత్తనాలు - వీటిని జప్తుచేయకూడదు. (సె 77 యఫ్)

జమీందార్లు వీటిని పాటించరు కాబట్టి జాగ్రత్తగా వుండాలి. స్త్రీల స్వంత ఆభరణాలు స్త్రీధనం కాబట్టి వాటినికూడా జప్తుచేయకూడదు.

జప్తులు 3 విధాలు.

(1) జమీందారు స్వయంగాచేయు జప్తు.

(2) కలెక్టరుకోర్టుద్వారాచేయు జప్తు.

(3) సివిల్ కోర్టుద్వారాచేయు జప్తు.

రైతూ - జమీందారూ పరస్పరం పట్టా, ముచ్చిలికాలు కూర్చుకుని వుండాలి. లేదా రెండరుపట్టాయైనా ఇవ్వబడి వుండాలి. అప్పుడే జప్తు చేయబడవచ్చు (సె 77 ఎ)

జమీందారు చేయు జప్తు.

బకాయిపడ్డ ఒక్క సంవత్సరం లోపుననే జమీందారు స్వయంగా జప్తు చేయవచ్చును. (సె 77 డి)

శిస్తు బకాయికి సరిపడ్డ విలువగల ఆస్తిమాత్రమే జప్తు చేయాలి. (సె 79)

ముందుగా డిమెండునోటీసు యిచ్చి, వెంటనే బకాయి చెల్లించక పోతే అప్పుడు జప్తు చేయాలి. డిమెండు లేకుండా జప్తు చేయకూడదు. (సె 78)

డిమెండు నోటీసును మనిషికివ్వవచ్చు; ఇంటికి అంటించవచ్చు; లేదా చేలో కట్టిరావచ్చు.

జప్తు చేసిన ఆస్తివివరాలతో లిస్టువ్రాసి ఒక కాపీని రైతుకివ్వాలి. మరొక కాపీని సేల్ ఆఫీసరుకు 10 రోజులలోగా పంపాలి..

జప్తు చేయుటకై ఆఫీసరు ఏ ప్రదేశములోనికైనా వెళ్ళవచ్చు. పోలీసు సహాయంతో జనానాగదులలోకూడా ప్రవేశించవచ్చును.

జప్తు చేయుటకు పోలీసుల సహాయాన్ని కోరవచ్చును.

జప్తు చేసిన ఆస్తిని, మరొక వస్తువును కుదవపెట్టుటవల్లగాని, మరొక రైతు హామీవుంచటంవల్లగాని తిరిగి ఇచ్చివేయాలి. లేదా డిపాజిటు చేయగానే తిరిగి ఇచ్చివేయాలి. (సె 87)

జప్తు చేసిన ఆస్తినిగాని, పశువులనుగాని ఉపయోగించ కూడదు. (సె 86) జప్తుపశువుల మేతకగు ఖర్చుమాత్రం రైతువద్దనుండి వసూలు చేసికొనవచ్చును.

కవులుదారుగాని, భూమియందు హక్కువున్న మరొకరుగాని డిమెండు మొత్తాన్ని చెల్లించి, జప్తును రద్దుచేయించవచ్చును. ఈ విధంగా చెల్లించిన సొమ్మును కవులుదారు తన కవులుం శిస్తులోనుండి తగ్గించవచ్చును. (సె 108)

జమీందారు వేలంభూమిని పాడుకొనవచ్చును. (సె 130)

వేలమును రద్దుచేసి తిరుగ తనభూమిని తనకుయిమ్మని రైతు కోర వచ్చును. ఇందుపై వేలంవేసిన 45 రోజులలోగా డిమెండు మొత్తాన్నీ, ఖర్చులనూ, వేలంలో కొన్నవారికి పరిహారం నిమిత్తం కొన్న మొత్తానికి 5% ఎక్కువయును కలిపి కలెక్టరు కోర్టులో డిపాజిటు కట్టాలి. (సె 131)

జమీందారు అకర్మపు పన్నునుగాని, అసలుపన్నుకు ఎక్కువగాని వసూలుచేసినచో, ఆ హెచ్చు మొత్తం రు 50/- లకు తక్కువైనచో రు100/ ల వరకూ, రు 50/-లకు మించినచో రు 200/- ల వరకూ జమీం దారుకు జరిమానా వేయవచ్చును. (సె 136)

# VII

## పట్టా - ముచ్చిలికాలు.

రైతు జమీందార్ల మధ్యగల సంబంధాలను, వారి కర్తవ్యాధ్యక్షతలనూ తెలియజేయునది పట్టా.

జమీందారు రైతుకిచ్చునది పట్టా: రైతు జమీందారున కిచ్చునది ముచ్చిలికా. పట్టాలో ఇర్వురి మధ్యనుండే సంబంధాలనూ, రైతు ఏషరతు లపై భూమిని కలిగియున్నాడో తెలియజేయు విషయములు వుంటాయి. వాటికి బద్ధుడై వుంటానని వ్రాసియిచ్చేదిగాని లేక అంగీకరించి ఆ షరతుల నన్నిటినీ తిరుగ వ్రాసియిచ్చునదిగాని ముచ్చిలికా. ఈ రెండూ పరస్పరం మార్చుకొన బడుతాయి.

రైతుకుఇష్టంలేని షరతులుగాని, చట్టవిరుద్ధమైన షరతులుగాని పట్టాలో ఉన్నచో అట్టివి చెల్లకూడదని రైతు పట్టా సూటు చేసుకొనవచ్చును

పట్టాలో వుండవలసిన విషయాలు.

(1) పట్టాయిచ్చు జమీందారు పేరు. పట్టా తీసుకొను రైతు లేక రైతుల పేర్లు.

(2) భూమియొక్క స్థానికవర్ణన: అనగా మొరకయ్యా, పల్లమా దాని పేరు, దాని విస్తీర్ణం.

(3) శిస్తు రేటు.

(4) భూమిపై శిస్తు మొత్తం.

(5) ఏరూపంలో చెల్లించేశిస్తు (నగదు, సాలు కట్టుబడి, వగైరా)

(6) సెస్సులు: ఇతరపన్నులు. (ఇతర పన్నులనగా ఆచారసిద్ధంగా వస్తూ, చట్టసమ్మతముగు పన్నులు ఉదా:- చేపలు పట్టుకొనుటకుగాపన్ను; పుల్లరి; రాళ్ళఫీజు మున్నగు)

(7) ఎన్నికిస్తీలు; కిస్తీ ఆఖరు వాయిదాలు.

(8) పట్టా పుట్టినతేది.

(9) ఇతర ప్రత్యేకముగు షరతులు.

పట్టా షరతులలో అనేకములు అక్రమమైనవివుంటాయి ఈభూమిలో ఫలానా పైరువేయాలి. ఫలానా సమయంలోనే కోయాలి అన్నవి అక్రమ షరతులు. అదేవిధంగా చెర్వు నీటి విషయంలోనూ, పశువులను మేపుకొను విషయంలోనూ, అనేక షరతులు విధిస్తారు. అవన్నియూ రైతులకు బాధాకరంగా వుంటాయి. ఉదా:- చెర్వులో ఒక ప్రమాణా నికన్న నీరువుంటే

జమీందారుకు ప్రత్యేకించబడుతుందని, ఆపైన నీరువస్తేనే రైతులకు వదలబడుతుందని వుండే షరతులు అక్రమం. అట్టివాటి విషయాలలో రైతులు చెల్లవని దావావేయాలి.

కొంతమంది రైతులకు కలిపి జాయంటుపట్టా లివ్వవచ్చును. కాని విక్రయం మొ॥ సందర్భాలలో సబ్ డివిజను విస్తీర్ణము ప్రభుత్వం నిర్ణయించినమేరకు తగ్గకుండా వుంటే ప్రత్యేక పట్టా యివ్వమని రైతులు కోరవచ్చును. (సె 146)

ఎస్టేట్లలో జాయంటుపట్టాల బాధ విపరీతం. ఒకొక్కొక్క పట్టాలో 10 మందికిపైగా కూడా రైతులుంటారు. ఇందులో ఏ ఒక్కరు శిస్తు చెల్లించక, తక్కినవారంతా చెల్లించినా వారందరకూ రశీదులలో కొరతగా చెల్లించినట్లుగానే వ్రాస్తారు. పైగా ఆబకాయికై ఆపట్టాలోవున్న ఏయితర పట్టాదారుపైనైనా జమీందారు చర్య జరుపవచ్చును సాధారణంగా జమీందార్లు తమకు ఇష్టముకాని రైతుపై పట్టాలోని ఇతర పట్టాదార్ల బకాయి కంతటికీ, చర్య తీసుకుంటారు. జప్తు చేయుట, వేలం వేయించుట చేస్తారు. కాబట్టి జాయంటుపట్టాలు పోవాలి. ప్రతిరైతుకూ విడిపట్టా యివ్వాలని, అధమం ఒక రైతు బకాయికి ఇంకొకరైతుపై చర్యజరుపుట చట్టవిరుద్ధమని చట్టం సవరించాలి.

జాయింటు పట్టాలోని ఒక రైతు బకాయిని ఇంకొక రైతువద్ద వసూలుచేస్తే, ఈ రెండవ రైతు బకాయిపడ్డ రైతువద్ద వసూలు చేసుకోవాలి. మర్యాదగా ఇవ్వకపోతే కోర్టులో దావా వేసుకోవాలి.

పట్టాలలోవున్న షరతులనే సాధారణంగా కోర్టులు గుర్తిస్తాయిగనుక పట్టాలు తీసుకొనునప్పుడే జాగ్రత్త వహించాలి; లేదా అక్రమ షరతులున్నాయని తెలియగానే పట్టాషరతు చెల్లకూడదని దావావేయాలి.

# VIII

## జలాధారాలు.

200 ఎకరాలకు పైబడ్డ ఆయకట్టుగలది మేజర్ జలాధారం; అంతకు లోపు ఆయకట్టుగలది మైనర్ జలాధారం.

మేజర్ జలాధారాలకు సంబంధించిన పిటీషన్లను జిల్లా కలెక్టరుకూ, మైనర్ జలాధారాలకు డిప్టీ కలెక్టరుకూ పెట్టుకోవాలి.

చెర్వుల విషయంలోనే రైతులకూ జమీందార్లకూ పేచీలు ఎక్కువ వస్తాయి. చెర్వులపై అధికారం ఎవరిదిఅనేది చాలా వివాదాస్పదమైనది. జమీందార్లవాదన ఏమిటంటే ఖాయం పల్లంవరకూ మేము నీళ్లు ఇచ్చుటకు బాధ్యులము. ఆపైనీరు మా యిష్టంవచ్చినట్లు చేసుకుంటాము; చెర్వును (చెర్వు పడకలు-కట్టలు) మా యిష్టం వచ్చినట్లు ఉపయోగించుకుంటాము అంటారు. ఈ కారణాలుచెప్పుతూ ఉన్న నీరునుకూడా వెళ్ళగొట్టి, చెర్వు పడకలను పొగాకు మొ॥ పైరు వేసుకొనుటకు కవుళ్ళిస్తున్నారు. పైగా చెర్వులను మరమ్మతు చేయుటలేదు.

నిజానికి చెర్వులపై జమీందార్ల కెట్టిహక్కున్నూ, పెత్తనమున్నూ లేదు. ఇందువిషయమై ప్రకాశం కమిటీవారు తమ రిపోర్టులో ఈవిధంగా చెప్పారు. "వ్యవసాయమునకు నీటిసరఫరా చాలా ముఖ్యము. భూమి హక్కు రైతుది. కనుక అందులసాగుకు వలయు నీటివసతులలోను రైతులకు సహజమగు హక్కుగలదు. సరిగా పంటపండని యెడ శిస్తు వసూలు కాదుగదా! నీటిహక్కు స్వతస్సిద్ధము కనుక వ్యవసాయమునకు నీరువాడు కొన్నందుకు రైతు అదనంగా పన్ను చెల్లించనక్కరలేదు......సర్కారు వారు జమీందారుకు వెంటనే మరమ్మతుచేయవలసిన నోటీసిచ్చుటయు, అట్లు వారు జరిగించకపోతే వెంటనే సర్కారువారు తమ ఉద్యోగులద్వారా సరియైన మరమ్మతులు జరిగించి, అందులకగు ఖర్చు సొమ్మును ఆ జమీం

దారువల్లనో, ఈనాందారువల్లనో రాబట్టుకొనునట్లును నిబంధనల చేర్చవలెను......జిరాయితీలకు, కమతం భూములకు తమ యిష్టప్రకారమే నీటి సప్లయిచేయు పెత్తనం తమకు యివ్వవలెనని జమీందార్ల వాదన. కాని జలాశయపు నేలహక్కు రైతులదే. కనుక అందలి నీటిహక్కున్నూ రైతులదే. పూర్వమీ అధికారము గ్రామసంఘములే చెలాయించుచుండెను."

ఈ విధంగా నిజానికి రైతులకే హక్కున్ననూ, ఎస్టేటులాండు ఆక్టు లో లోపాలవల్ల ఈనాడు జమీందార్లు చెర్వులపై పూర్తి అధికారము కల్గియున్నవారివలె వ్యవహరిస్తున్నారు.

ఆక్టు ప్రకారం జమీందారు చెరువులకు మరమ్మతులు చేయిస్తూ సరియగు స్థితిలో వుంచాలి. అట్లు వుంచనిచో, ఆచెర్వుక్రింది ఆయకట్టులోని భూములలో 1/4 వంతు భూమిని గల రైతు లేక రైతులుగాని, లేక ఆయకట్టుపై చెల్లబడే శిస్తులో 1/4 వంతు శిస్తును చెల్లించు రైతు లేక రైతులుగాని మరమ్మతులు చేయించమని కోరుతూ కలెక్టరుకు పిటీషను పెట్టాలి. పిటీషనుతోబాటు మేజరు జలాధారముకు రు 200/- లు మైనరు జలాధారానికి రు 100/- లు డిపాజిటు కట్టాలి. ఈ డిపాజిటు తిరిగి ఇవ్వబడుతుంది.

జమీందారు అప్పటికి మరమ్మతు చేయనిచో కలెక్టరు జమీందారును డిపాజిటు కట్టమనికోరి ఆ డిపాజిటుతో కలెక్టరు తానే స్వయంగా ఎవ్వరి చేతనైనా రైతు చేతనైనాకూడా మరమ్మతులు చేయించవచ్చును. జమీందారు డిపాజిటు కట్టకపోయినా కలెక్టరు మరమ్మతుచేయించి జమీందారు నుండి ఆ ఖర్చులను రాబట్టుకొనవచ్చును. (సె 139)

ఆచారసిద్ధంగానూ, కాంట్రాక్టుప్రకారం రైతులు చేయవలసిన చిన్న చిన్న మరమ్మతులను (కుడిమరమ్మతులు) అనగా బోదెల పూడికతీయుట, చిన్నగండ్లు పూడ్చుట మొ॥ వారే చేయాలి. ఆ చిన్న మరమ్మతులను రైతులు చేయకపోవుటవల్ల జలాధారంచెడిపోతే జమీందారు బాధ్యతలేదు.

చెర్వు మరమ్మతులు కోరుతూ వున్నప్పుడు తాత్కాలికంగా శిస్తులు తగ్గించమని రైతులు కోరవచ్చును. మైనరు జలాధారాల సందర్భంలో జిల్లా కలెక్టరుకూ, మేజరు జలాధారాల సందర్భంలో రివెన్యూబోర్డుకూ ఈ పిటీషనులు పెట్టుకోవాలి. (సె 141)

చెర్వుక్రింద ఆయకట్టును నిర్ధారణ చేయుటకూ, తరములను నిర్ధారణ చేయుటకూ కలెక్టరుకు అధికారమున్నది. (సె 137) ఈ విధంగా నిర్ధారణ చేసినపిమ్మట ఆయకట్టును హెచ్చించుటకు కలెక్టరు అనుమతి కావాలి.

జలాధారాలక్రింద నీరు సరిగా సప్లయిగాక 6 సం॥ లు వరుసగా మాగాణిగాని, తోటలుగాని సాగుకాకపోతే రైతుపిటీషనుపై ఆ భూముల తరాన్ని మెట్టగా మార్చవచ్చును. (సె 138 సి.) ఈతరం మార్చబడ్డ భూములకు అట్టివే భూములకు ఇతరచోట్లవున్న రేట్లే వేయిబడుతాయి.

సాధారణంగా ఈ విషయంలో రైతులకు చాలా అన్యాయం జరుగుతుంది. జమీందారు ఇష్టంవచ్చినట్లు ఆయకట్టు పెంచుతాడు. అందువల్ల కొన్ని భూములు సాగుగాక బీడుగావుంటాయి. లేక మెట్టపైర్లు వెయ్యబడుతాయి. కొన్ని భూములలో కొంతభాగం మాత్రమే ఈ విధంగా వుండవచ్చును. అట్టి సందర్భాలలో చెర్వు మరమ్మతులనైనా కోరుతూ. ఈలోగా శిస్తులను తగ్గించమని కోరవచ్చును. జలాధారం పర్మనెంటుగా నీటిని సప్లయి చేయలేదనుకుంటే తరం మార్పుకు పిటీషను పెట్టుకోవాలి. రైతు పిటీషను పెట్టుకోనిదేమాత్రం జమీందారు ఎన్నిసంవత్సరాలైనా భూమితరం మార్చడు. రైతు మాగాణిశిస్తు చెల్లించుచుంటూనే వుంటాడు.

ఎస్టేట్లలో సర్వసాధారణంగా భావుల విషయంలో రైతులకు అన్యాయం జరుగుతూ వుంటుంది. భావులలో ఎక్కువభాగం రైతుల పూర్వీకులు తవ్వించినవే అయివుంటాయి. కాని ఇటీవల జమీందార్లు ఇచ్చు పట్టాలలో ఆభావులు తమ పూర్వీకులవల్ల తవ్వించబడ్డాయని వ్రాసుచున్నారు.

ఈవిధంగా పట్టాలలో వ్రాసి ఆభావులక్రింద సాగులకు పన్ను వసూలు జేస్తున్నారు. భావుల మరమ్మతుకు తామేవీ ఖర్చులు ఇచ్చుకోరు. రైతే మరమ్మతులు చేయించుకోవాలి. ఇది బహుఅన్యాయం. నీటిశిస్తు తీసుకుం టున్న జమీందారు చెర్వులను ఏవిధంగా మరమ్మతు చేస్తున్నాడో అదే విధంగా భావులనుకూడా మరమ్మతు చేయించాలి; లేదా భావులక్రింద సాగులపై మాగాణిశిస్తు వసూలుచేయరాదు అని కోరాలి. ముఖ్యంగా వేసంగికారు పూర్తిగా ఈభావుల క్రిందనే సాగుఅవుతుంది. అట్టి వేసంగి కారులకుకూడా శిస్తువసూలుచేస్తారు కాబట్టి దానినికూడా వ్యతిరేకించాలి.

కొన్ని ఎస్టేట్లలో జమీందార్లు కాల్వలుకూడా మరమ్మతులు చేయించటం మానివేశారు. ప్రథమంలో రైతులనే చేసుకోమని తాము ఖర్చులిస్తామని ప్రారంభిస్తారు. క్రమంగా తాము ఖర్చులూ ఇవ్వరు. మరమ్మతులూ చేయించరు. చివరకు రైతులే మరమ్మతులు చేసుకొనే ఆచారంవుంది అని వాదించసాగుతారు. కాబట్టి ఈ విషయములలోకూడా రైతులు జాగ్రత్తగా వుండాలి.

ఎస్టేట్సు లాండుఆక్టులో రిమిషన్ విషయమేలేదు. కాబట్టి పంటలు పూర్తిగా నష్టమైనా జమీందారు రిమిషన్ ఇవ్వరు. కొన్ని ఎస్టేట్లలో మాత్రం కొన్ని షరతులకులోబడి రిమిషన్ ఇచ్చే షరతులను పట్టాలలో చేర్చారు. కాబట్టి పంట నష్టమైనపుడు రిమిషను ఇవ్వాలి అని కోరాలి.

ఇటీవల అధికాహారోత్పత్తి స్కీముక్రింద ప్రభుత్వమే ఎస్టేట్లలోని జలాధారములను మరమ్మతులు చేయుటకై ఒక బిల్లును ప్రకటించింది. అందులోని విషయాలివి.

(1) ఎస్టేట్లలోని జలాధారాలకన్నిటికీ ప్రభుత్వమే మరమ్మతు చేయించి ఖర్చులను జమీందార్లనుండి రాబట్టుకుంటుంది.

(2) ప్రభుత్వ జలాధారాలనుండి ఎస్టేటు జలాధారాలకు నీటిని సప్లయి జేస్తుంది.

(3) నూతన జలాధారాలను ఎస్టేట్లలో త్రవ్విస్తుంది. పాతవాటిని అభివృద్ధి చేస్తుంది.

(4) నూతన జలాధారాలను ఏర్పర్చినప్పుడూ, పాతవాటిని అభివృద్ధి పర్చినప్పుడూ జమీందారు శిస్తు హెచ్చు జేసికోవచ్చును.

(5) ఈ బిల్లుక్రిందజరుగు ఏపనిమైననూ అభ్యంతరపెట్టుటకు సివిల్ కోర్టుకు అధికారం లేదు.

బిల్లులోని లోపాలు.

(1) ప్రభుత్వ జలాధారాలను అభివృద్ధి చేయనిదే జమీందారీ జలాధారాలకు నీటిని సప్లయిజేయుట కష్టం.

(2) జమీందారుకు శిస్తు హెచ్చుజేసుకొనే అధికారం ఉంచబడింది.

(3) తిరిగి జలాధారాలను జమీందారు ఆధీనంలో వుంచబడుతాయి. ముందు మరమ్మతులు ఏర్పాటులేదు.

(4) శిస్తు హెచ్చింపు విషయంలోనైనా సివిల్ కోర్టుకు అప్పీలు లేకుండా చేయబడింది.

బిల్లుకు మనం సూచించిన సవరణలు.

(1) జలాశయసంరక్షణ నిధిని ఏర్పర్చాలి. జలాశయముల నన్నిటిని ఇరిగేషన్ పంచాయితీల స్వాధీనం చేయాలి.

(2) ప్రభుత్వ జలాశయములను అభివృద్ధి చేయాలి.

(3) జమీందారుకు శిస్తు హెచ్చుజేసుకొను అవకాశం వుండరాదు. అథవా వుంచినా రైత్వారీ శిస్తులకుమించి విధించవీలులేదు.

(4) శిస్తులనుగూర్చి సివిల్ కోర్టుకు అప్పీలు చేసుకొను హక్కు వుండాలి.

(5) వెంటనే ప్రభుత్వం జమీందార్ జలాధారాలను మరమ్మత్తు చేయుటకు పూనుకోవాలి.

# IX
## అడవులు.

అడవులనుగూర్చి ఆక్టులో ఏమీలేదు. అటవీచట్టంలో కూడా వివరాలు ఏమీలేవు. అడవులు తమ స్వంత కమతాలవంటివని జమీందార్ల వాదన. అడవులపై హక్కు రైతులదేనని ప్రకాశంకమిటీ నిర్ణయం.

రైతులకు ఆచారసిద్ధంగావచ్చు ఏ హక్కునూ ఆక్టు పోగొట్టలేదు. అదేవిధంగా రైతులకు ఆచారసిద్ధంగా వచ్చు హక్కులు కొన్ని అడవులలో వున్నవి. వ్యవసాయమున కుపయోగించు కలప, కట్టె, కంప ము॥ తెచ్చుకొనుటకూ, పశువులకూ, గొఱ్ఱెలను మేపుకొనుటకూ, రైతులకు దాదాపు ప్రతి ఎస్టేటులోనూవున్న సాంప్రదాయసిద్ధమగు హక్కు. ఇందులకై జమీందారు కొద్దిగా ఫీజు తీసుకొనవచ్చునేగాని, పూర్తిగా ఈ హక్కులను నిరోధిస్తానికి హక్కులేదు. ఈ విధంగా అడవిలోగల బాటలను, రహదార్లను మూయుటకూ, చెర్వులకడకు పశువులుపోవు డొంకలను మూయుటకూ, అధికారంలేదు. ఇంకా గొఱ్ఱెలు, మేకలు మేయుటకు కొట్లుకొను తుమ్మకాయలూ, ఆకులూ మొ॥ వాటికి మామూలు ఫీజును తీసుకోవలెనేగాని అభ్యంతరం పెట్టకూడదు.

కొన్ని ఎస్టేట్లలో, ఆక్టుమూరి రైతులకు హక్కుకలుగునను ఉద్దేశంతో జమీందార్లు అడవులనునరికి కలపకట్టె అమ్ముకోవడం, భూమిని సాగుకు గానుఇవ్వటం జరిగింది. ఇది చట్టవిరుద్ధం. అడవులను పూర్తిగా నరికివేయకూడదు. నరికినచో రైతులకు కావలసిన సామగ్రికొరకక పోవుటేగాక

వర్షములు కురియుటకూడా తగ్గును. కాబట్టి ఫారెస్టు అక్టు క్రింద అట్టి అడవులను నరుకు జమీందార్ల ప్రయత్నాన్ని నిరోధించాలి.

అడవులన్ని రైతులచే ఎన్నుకోబడు ఫారెస్టు పంచాయితీల యాజమాన్యంక్రింద వుండాలని, జమీందార్ల పెత్తనం తొలగించాలని, మన కోర్కె. ఈలోగా అడవులలో కలప, కట్టె, కంప ముll తెచ్చుకోనివ్వాలని పశువులను యథేచ్ఛగా మేపుకోనివ్వాలని మన కోర్కె.

## X

## సబ్ డివిజన్లు - ట్రాన్స్ఫర్లు.

భూమి ఒకరినుండి మరొకరికి చట్టరీత్యా సంక్రమించినప్పుడు జమీందారు ఈమార్పును అంగీకరించి కొత్త రైతుతో ఒడంబడిక చేసుకోవాలి. (సె 145) ఈవిధంగా ట్రాన్స్ఫరు అగునప్పుడు రైతు జమీందారుకు రిజిస్ట్రారుద్వారా, రిజిష్టరు నోటీసుయిచ్చి తెలియబర్చాలి. ఈవిధంగా తెలియబర్చుట అమ్మినవాడు, కొనువాడు కలిసిచేయాలి.

ప్రభుత్వం విధించిన పరిమాణానికి తగ్గని పక్షంలో, ఈ సబ్ డివిజన్లను జమీందారు అంగీకరించితీరాలి. అట్లుచేనిచో జాయంటుగా పట్టా నివ్వాలి. (సె 145)

## XI

## సర్వే సెటిల్మెంట్లు.

ఏ ఎస్టేటునైనా లేక ఎస్టేటులో భాగమునైనా సర్వేజేసి, రికార్డ్ ఆఫ్ రైట్సును తయారుచేయమని ఎస్టేటులోని రైతులలో 1/4 వంతు మంది కలెక్టరును కోరవచ్చును. అందుకు ప్రభుత్వం నిర్ణయించిన కొంత సొమ్మును ఖర్చులకుగాను డిపాజిటుచేయాలి. (సె 164)

ఈ రికార్డ్ ఆఫ్ రైట్సులో ఈక్రిందివి ఉండవచ్చును.

(1) చెరువులు, భావులు, ఇతర జలాధారాలపై వ్యవసాయమునకు గాను రైతులకున్న హక్కులు.

(2) ఆ జలాధారాలను మరమ్మతులు చేయించవలసిన బాధ్యత.

ఈపై రెండింటి విషయంలోను రైతులు, జమీందార్లకుగల బాధ్యతలు.

(3) సాంప్రదాయసిద్ధంగాను, చట్టరీత్యాను రైతులకు బంజరు భూములలోవున్న హక్కులు.

సర్వేప్లాను, సర్వేలాండు రిజిష్టరు, ఫీల్డు మెజెర్‌మెంటు షీట్సు తయారుచేసి, ప్రతి గ్రామంలోనూ, ప్రతి కరణంవద్దరా వుంచబడుతాయి. రైతులు కోరినప్పుడల్లా అవి ఉచితంగా చూపించబడాలి.

రికార్డు ఆఫ్ రైట్సులో ముఖ్యంగా ఈక్రిందివి ఉండాలి.

(1) రైతుయొక్క జమీందారుపేరు.

(2) రైతుపేరు లేక భూమిని అనుభవించువానిపేరు.

(3) సర్వేమాపులో చూపబడ్డట్లు, భూమి ఉనికి విస్తీర్ణము, ఒకటి రెండు సరిహద్దులు.

(4) భూమి పారుదల అగునట్టిదా, కాదా? తోట భూమియా? పారుదల అయితే ఒకకారా, రెండుకార్లా?

(5) రికార్డు చేయబడుకాలంలో న్యాయంగా ఇవ్వదగుశిస్తు.

(6) శిస్తు డిక్రీ ప్రకారం నిర్ణయించబడినదా, చట్టప్రకారమా లేక మరియొక విధంగానా?

(7) భూమితోబాటు సహజంగావుండే హక్కులు.

(8) శిస్తు క్రమంగా వృద్ధిఅవునది అయితే ఎన్నిపర్యాయములు, ఏపంతున వృద్ధి అవుతుంది?

(9) శిస్తుమాఫీ (చెల్లించ నవుసరంలేని) భూమిని వాదిస్తే, నిజంగా శిస్తు చెల్లింపబడుతున్నదా, లేదా? శిస్తు చెల్లించకుండా హక్కుదారుడు భూమిని ఉంచుకొనుటకు హక్కు ఉన్నదా లేదా? హక్కు ఉంటే ఏవిధముగా? శిస్తు ఇవ్వవలసివుంటే, ఎంతశిస్తు?

(10) జలాధారములపైనా, బంజర్లపైనా వున్న ప్రత్యేకహక్కులు

ఈసర్వే రికార్డు ఆఫ్ రైట్సు ప్రథమంలో చిత్తు ప్రతులను ప్రకటిస్తారు. అందుపై ఆక్షేపణలు తెల్పుకోవచ్చును. ఆక్షేపణలను విచారించిన పిమ్మట ఖాయపు రికార్డులను ప్రకటిస్తారు. ఇందుకు 2 సం॥లలోగా రెవిన్యూబోర్డుకు అప్పీలు చేసుకోవచ్చును.

ఇదేవిధంగా శిస్తుల సెటిల్మెంటుకుకూడా ఎస్టేటులోని రైతులలో ¼ మంది పిటీషను పెట్టుకోవచ్చును. కలెక్టరు విచారించి శిస్తుల నిర్ణయం చేస్తాడు. అందుపై ఆక్షేపణలనువిని, ఖాయకశిస్తుల నిర్ణయంచేసి, ప్రభుత్వం నియమించిన మరొక అధికారి అంగీకారానికి పంపగా, ఆ అధికారి ఆ శిస్తులను ఖాయంగా నిర్ణయంచేయును. ఇందుపై పై అధికారికి ఆక్షేపణలను 3 నెలలలోగా చేసుకోవాలి. 2 సం॥లోగా బోర్డు ఆఫ్ రెవిన్యూకు అప్పీలు చేసుకోవాలి. లేదా 6 నెలలలోగా సివిల్ కోర్టులో దావా వేసికొనవచ్చును. (సె 168_173)

సర్వే సెటిల్మెంటులకగు ఖర్చులను ప్రభుత్వం నిర్ణయించిన విధంగా జమీందారూ రైతులూ పెట్టుకోవాలి. (సె 180)

అనేక ఎస్టేటు లీనాటికికూడా సర్వేకాలేదు. కొన్ని ఎస్టేటులలో ప్రైవేటు సర్వేమాత్రం జరిగింది. ఈ సర్వేలలో అనేక మోసాలున్నాయి. 2, 3 లింకులు తక్కువవున్న గొలుసులతో కొలవటంవల్ల విస్తీర్ణం హెచ్చేది. అనేకమంది రైతులు, ఎన్నో సంవత్సరాలక్రింద భూమిని క్రయంపొందినా, ఎన్నో చేతులుమారినా, పట్టాలు పొందలేదు. అనేక విషయాలలో ముఖ్య

ముగా చెర్వులు, అడవులు, బంజర్లు మొ॥ వాటి విషయంలో రైతులకు, జమీందార్లకున్న హక్కులు స్పష్టంగాలేవు. అనేక భూములకు జలాధారాలు ప్రస్తుతం లేకపోయినా, ఉన్నట్లే పూర్వపుపట్టాలలో వుదహరించబడింది కాబట్టి పల్లపుభూములుగానే వ్యవహరింప బడుతున్నాయి. జలాధారం క్రింద ఆయకట్టు ఎంతో నిర్ధారణలేదు. ఈవిధమైన అనేక అక్రిమాలు ఎస్టేట్లలో జరుగుచుండుటచే తప్పక ప్రతిఎస్టేటుూ సర్వే సెటిల్మెంట్లు జరుపబడి, రికార్డు ఆఫ్ రైట్సును ఉంచాలని కోరాలి.

## XI
## జ్యూరిస్ డిక్షను వగైరా.

ఎస్టేట్సు లాండు ఆక్టు క్రింద వచ్చు తగాదాల నన్నిటిని విచారించుటకు జిల్లాకలెక్టరు అధికారి; ఆ అధికారమును సబ్, డిప్టీకలెక్టర్లకుకూడా ప్రభుత్వం సంక్రమింపజేసింది. శిస్తులు మొ॥ వాటివిషయములోమాత్రం సివిల్ కోర్టుకు అధికారంవుంది.

పట్టాలవిషయంలోనూ, శిస్తుల వసూళ్ళ విషయములోనూ, భూముల అమ్మకం విషయంలోనూ, అక్రమపు శిస్తుల విషయంలోనూ, జాలాధారాల మరమ్మతుల విషయంలోనూ, సాముదాయక భూముల విషయంలోనూ, భూములలోనుండి రైతులను వెళ్ళగొట్టు విషయములోనూ, ఏకలెక్టరుకైనా విచారించుట కధికారముంది. వీటి అన్నిటివిషయంలోనూ, జిల్లా కోర్టుకు అప్పీలు వుంది.

శిస్తుల హెచ్చింపు విషయంలో అప్పీలు, తగ్గింపుకు పిటీషను, ధాన్యపు శిస్తును నగదురేటుకు మార్చుటకూ రైతులు ఉమ్మడిగా చర్య జరుపవచ్చును. (సె 193)

## XII

ఎస్టేట్సు లాండు ఆక్టు జమీందార్లు అధికంగావున్న శాసనసభచే ప్యాసుచేయబడ్డది కాబట్టి ఆక్టు పూర్తిగా వారికే అనుకూలంగా వుంది. కొన్ని

సెక్షన్లు అస్పష్టంగా వున్నాయి. కాబట్టి ఆ సెక్షన్ల క్రిందయిచ్చు తీర్పులు కూడా పరస్పర విరుద్ధంగా వుంటున్నాయి. కాబట్టి ఎస్టేటు లాండు ఆక్టు పూర్తిగా మొదటనుండి చివరవరకూ సవరించవలసియున్నది. అందులో ముఖ్యంగా చేయవలసిన సవరణలు ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం తరఫున యాత్రాదళంవారు కాంగ్రెసు మంత్రివర్గానికి సమర్పించిన మెమోరాండం లో పొందుపర్చబడినాయి.

## ప్రస్తుతం ముఖ్యంగా మనం కోరవలసిన సవరణలు.

(1) ఎస్టేట్లలోని జలాధారములన్నీ మరమ్మతు చేయబడాలి. నూతన జలాధారములు నిర్మింపబడాలి. జలాధారములను పంచాయతీల పెత్తనం క్రిందఉంచాలి. జలాశయ సంరక్షణనిధిని ఏర్పర్చాలి.

(2) సాగుకు లాయికైన బంజర్లనన్నిటినీ రైతులకు సాగుకివ్వాలి.

(3) శిస్తులు హెచ్చించకూడదు.

(4) సర్వే, శెటిల్మెంటులు జరగాలి.

(5) కొత్తసాగులకు జమీందారు పెట్టుబడి పెట్టాలి.

(6) నజరానాలు రద్దుకావాలి.

(7) జమీందార్లు ఎస్టేట్లలోని బీదలకు రైతులకూ కూలీలకు అమ్మకటకుగాను చవుకధరల డిపోలను పెట్టాలి.

(8) జమీందార్లు దేశభక్తి ప్రేరితులై ఆహార సమస్యను పరిష్కరించుటకూ, అధికాహారోత్పత్తి చేయుటకూ రైతులతోనూ, రైతుసంఘాల తోనూ సహకారం చేయాలి.

---

# అధిక ఆహారోత్పత్తి.

అధిక ఆహారోత్పత్తి నినాద మెందుకు?

ఈనాడు దేశాన్నంతటినీ ఆహారసమస్య విపరీతంగా కలవరపెడుతోంది. ఈ సమస్యను పరిష్కరించగలిగితేనే మనం జాతీయ ఐక్యాన్ని సాధించగ్గలుగుతాం. నాయకులను విడిపించడం, దేశాన్ని రక్షించడం, జాతీయప్రభుత్వాన్ని సంపాదించడం సాధ్యమవుతుంది. లేదా దేశరక్షణ భగ్నమై, మనజాతిఅంతా జపానుఫాసిస్టుల పాదాక్రాంతమై పోతుంది. అందుచేత ఆహారసమస్యను పరిష్కరించడానికి దేశంలో 100 కి 75 మంది గావున్న రైతులూ, వ్యవసాయకూలీలూ, ముందడుగువేసి పూనుకోవాలి. ఆహారసమస్యను పరిష్కరించాలీ అంటే సరియైన రవాణా సౌకర్యాలూ, కంట్రోలు, పంపకం వున్నంతమాత్రాన సరిపోదు.

శాంతి సమయంలోనే మనదేశం బర్మానుండి 15 లక్షల టన్నుల ధాన్యాన్ని తెప్పించుకునేది. ఆధాన్యంలో సగభాగం మనరాష్ట్రంలోనే వుపయోగింపబడేది. ఇప్పుడు ఆధాన్యం రాకపోవడంవల్లా, మనకు పండే గోధుమలలో కొంతభాగాన్ని మనదేశసైన్యాలకూ, మధ్యప్రాచ్యానికి ఎగుమతిచేయవలసిరావడం మూలంగానూ, బెంగాల్‌లో మిద్నపూర్ ప్రాంతాలలోనూ, మనరాష్ట్రంలో రాయలసీమలోనూ, ఒరిస్సాలో బాలసోర్ ప్రాంతాలలోనూ, బొంబాయిలో బీజపూరు ప్రాంతలలోనూ, వర్షాలులేక పంటలు పాడైపోయినందువల్లనూ మనకు ఆహారపదార్థాల కొరత ఏర్పడింది. అధికపంటలను పండించి యీకొరతను పూడ్చితేనేగాని మనం ఆహారసమస్యను పరిష్కరించలేము. ఆహారసమస్యను పరిష్కరించితేనేగాని దేశాన్ని రక్షించుకోలేము. అందుచేత రైతాంగమంతా అధిక

పంటలను పండించడం తమ దేశభక్తియుతమైన చర్యగా భావించి, అధికాహారోత్పత్తి కార్యక్రమానికి పూనుకొనేటట్లు చేయుటకు, మనం అధికాహారోత్పత్తి నినాదాన్నిస్తున్నాం.

## ప్రభుత్వ అధిక ఆహారోత్పత్తి ప్రచారం:

ప్రభుత్వ ప్రచారకార్యక్రమం పూర్తిగా విఫలమైంది. ఎందువల్లనంటే? ఆప్రచారం రైతులను అధికఆహారోత్పత్తికి పూనుకునేటట్లు చేయలేకపోయింది. భారతదేశం మొత్తంమీద 10 కోట్ల యకరముల సాగులాయకైన బంజరుభూమివుంటే, అందులో 50 లక్షల యకరాలభూమిని మాత్రం సాగులోనికి తీసుకురావడానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేసింది. అందులోకూడా 13½ లక్షల యకరాలుమాత్రం సాగుచేయబడ్డట్లు కేంద్రప్రభుత్వ భూములశాఖాసభ్యుడు సర్ జోగీంద్రసింగ్, కేంద్రశాసనసభలో మాట్లాడుతూ చెప్పాడు. ఇదేగాకుండా జమీందారుల, భూస్వాముల బంజరుభూములను సాగుచేయించడానికికూడా ప్రభుత్వం పూనుకోలేదు. రైతుల అప్పులు, శిస్తుబకాయీలు, నిలిపివేసి మంచి విత్తనాలూ, ఎరువులూ, విరివిగా సప్లయిచేసి రైతుల నుత్సాహపరచి పని చేయించలేకపోయింది. భూములను ఆయకట్టులో చేర్చడానికీ, బంజరులను సాగుచేయించడానికీ, ప్రభుత్వోద్యోగులు అనేక అడ్డంకులు కల్పించారు. ముఖ్యంగా రైతుల, రైతుసంఘాలసహకారాన్ని పొందకుండా అధిక ఆహారోత్పత్తిజేయ బూనుకొని ప్రభుత్వం విఫలత జెందింది.

## అధిక ఆహారోత్పత్తి కార్యక్రమాన్ని మనం జయప్రదంగా నిర్వర్తించగలమా?

మనదేశంలో వ్యవసాయ పద్ధతి చాల వెనుకబడివుంది. కాబట్టి యంత్రసహాయంతో సేద్యంచేయకుండా ఉత్పత్తి ఎక్కువచేయలేమనుకో

కూడదు. నవీన విజ్ఞాన పద్ధతులలో సేద్యంచేస్తే ఎక్కువపంటలను పండించ గలం. కాని ఆపద్ధతులు ఇప్పుడు మనం ప్రవేశపెట్టే స్థితిలోలేము. అయినా మనం చేతులుముడుచుకు కూర్చోకూడదు. ఇప్పుడున్న పద్ధతుల లోనే వ్యవసాయం చేస్తూకూడా మనం ఎక్కువపంటలను (దేశావసరాలకు సరిపడినంత) పండించగలం. అది ఎలాగో చూదాం. మంచిఎరువులూ, విత్తనాలూ వేయడం, సాధ్యమైన చోటనల్లా రెండుపంటలు పండించడం, కూరగాయలు, పాలు, మాంసము ఎక్కువ ఉత్పత్తిచేయడం ద్వారానూ, వ్యాపారపంటలకు బదులు ఆహారపంటలను పండించడం ద్వారానూ, మనం అధికోత్పత్తిచేయగలం. ఆవిధంగా అధికపంటలను పండించడానికి రైతు లంతా గలసి కృషిచేస్తూ, ప్రజలకూ, సైన్యానికీ అవసరమైన తిండిని సప్లయిచేయడానికిగాను, భూస్వాముల, జమీందారుల, ప్రభుత్వ బంజరు భూములనన్నింటినీ సాగుకు యివ్వాలని ఆందోళన చేయాలి. దానికి అన్ని తరగతుల ప్రజల సహకారం సంపాదించాలి. అలాచేస్తే ప్రభుత్వం తప్ప కుండా లొంగుతుంది. ఆవిధంగా 5 కోట్ల యకరాలవరకూ సాగులోనికి తెచ్చి ప్రొఫెసర్ ముఖర్జీ చెప్పినట్లు 40 కోట్ల ప్రజలకూ ఎక్కువతక్కువ తిండి పెట్టగలం.

## అధిక ఆహారోత్పత్తి కొరకు ఐక్యం కావాలి:

ప్రభుత్వం అధిక ఆహారోత్పత్తి కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించలేకపోతోంది. కాబట్టి ఈ ప్రభుత్వ మున్నంతవరకూ మనం అధిక పంటలను పండించలేమనుకోవడం పొరపాటు. అధికోత్పత్తికి ప్రభుత్వం ఆటంకాలు పెడుతున్నమాట నిజమే. కాని ముప్పదికోట్ల రైతులు అధిక ఆహారోత్పత్తికొరకు ఐక్యమై పనిజేస్తూ ఇతర ప్రజానీకాన్నికూడా, కూడ దీసుకు రాగలిగినప్పుడు, ప్రభుత్వ అడ్డంకులను తప్పక తొలగించవచ్చు. అన్ని తరగతుల ప్రజలూ (కొంతమంది అధికలాభాపేక్షపరులూ, కరుడు గట్టిన జమీందారులూ తప్ప) అధిక ఆహారోత్పత్తిని కోరుతారు. అందు

చేత అధిక ఉత్పత్తికిగల అడ్డంకులను తొలగించడానికి వారుకూడా కలసి వస్తారు. అధిక ఆహారోత్పత్తి కార్యక్రమంతో మనం భూస్వాముల వద్దకు పోయి వారికి నచ్చజెప్పి దేశంకొరకు తన బంజరులను సాగుకు యిచ్చేటట్లుగా చేయవచ్చు. అలాగే పెట్టుబడిదారులనుండి విత్తనాలకూ, ఎరువులకూ, అప్పులు యిప్పించవచ్చు. ఈవిధంగా అన్నితరగతులను ఈ కార్యక్రమం మీద ఐక్యపరచి, ఆహారసమస్యా పరిష్కారం కొరకూ, దేశరక్షణకూ, జాతీయప్రభుత్వానికీ, ఆందోళన చేస్తుంటే, ప్రభుత్వ నిర్బంధాలు మనలను అడ్డుపెట్టలేవు.

## రైతుసంఘాలు సాధించిన ఫలితాలు:

ఈ కార్యక్రమాన్ని రైతుసంఘాలు నిర్వహించగలవా? అన్న ప్రశ్నకు జవాబు బెంగాల్, మలబారు రాష్ట్రాలలో జరిగిన కృషినీ, మన రాష్ట్రంలో సాధించిన ఫలితాలనూ పరిశీలిస్తే తెలుస్తుంది. బెంగాల్ లో "ఖుల్నా" జిల్లాలో రైతులు స్వయంగా చొరవతో కృషిచేసి 10,000 బీగాల భూమిని సాగుచేశారు. దీనిలో 75,000 మణుగుల ధాన్యం పండుతుంది. అంతేగాకుండా జెస్సూరు, ఖుల్నా జిల్లాలలో, జమీందారుల సహకారాన్నికూడా సంపాదించి వారి బంజరు భూములను సాగుకుయిచ్చేటట్లు చేయగలిగారు. వారితో కాల్వలు బాగుచేయించుట, విత్తనాలు యిప్పించుటకూడ జేస్తున్నారు. మలబారులో, కాసరగోడ్, చిరక్కల్, కాలికట్, తాలూకాలలోకూడా బెంగాల్ లోవలెనే జమీందారుల సహకారాన్ని సంపాదించి బంజరులను సాగుకు యిప్పించడం, విత్తనాలూ, ఎరువులూ అప్పు యిప్పించడం, కాలువలు బాగుచేయించడం జరుగుతోంది. మనరాష్ట్రంలో కృష్ణాజిల్లాలో యింతవరకు ప్రభుత్వంనుండి 3 లక్షల 50 వేల రూపాయల ఎరువులను అప్పుగా యిప్పించగలిగారు. అలాగే అన్ని జిల్లాలలోనూ రైతుసంఘాలు ఎరువులను రైతుల కిప్పించడంకోసం ప్రత్యేకకృషి జేస్తున్నాయి. ఇంతవరకు గుంటూరు జిల్లాలో యీ 1700 లు

బంజరుభూమిని సాగుచేయించారు. అలాగే కృష్ణాలో య 3000 లున్నూ ప॥ గోదావరిలో య 2866 లూ, తూ॥ గోదావరిలో య 100 లూ, వైజాగ్‌లో య 150 లూ, నెల్లూరులో య 300 లూ, రాయలసీమ మొత్తంమీద య 170 లున్నూ సాగుచేయించగలిగారు. తూర్పు గోదావరి, ప॥ గోదావరి జిల్లాలలో రెండవపంటకు ఎక్కువ ప్రాంతానికి నీరు యిచ్చేటట్లున్నూ, ఆనీరు సక్రమంగా సరఫరా అయ్యేటట్లున్నూ రైతుసంఘాలు కృషి చేసినయి. కృష్ణాజిల్లాలో రెండవపంటకు య 1960 లకు నీరు యిప్పించారు. పిశప పంటపండే ప్రాంతానికి దీర్ఘకాలపుపంట వేసినచోట్ల కాలువలు నవంబరు 10 వ తేదీకే కట్టివేయకుండా డిసెంబరు 3 వ తేదీ వరకూ వుంచేటట్లు చేయగలిగారు. అదనపు భూములను ఆయకట్టులో చేర్పించుట, పెనాల్టీలు రద్దుచేయించుట, కాలువలు బాగుచేయించుట, సరియైన తూములు ఏర్పాటుచేయించుట దాదాపు అన్ని జిల్లాలలోనూ చేయబడుతోంది. కృష్ణాజిల్లాలో గన్నవరం తాలూకాలో వ్యాపార పంటలకు బదులు య 100 లలో ఆహారపంటలను వేయించారు. అలాగే గుంటూరులోకూడా య 100 లలో ఆహారపంటలను వేయించారు.

ఈ విధంగా కొన్ని ఉదాహరణలు మాత్రం యిక్కడ యివ్వబడినయి. రైతుసంఘాలు సాధించిన యీ పనులుచూస్తే మనం అధికాహారోత్పత్తి కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వర్తించగలమనే ధైర్యం కలుగుతుంది. కాని యీ పనులు మనం సాధించవలసినవాటిలో స్వల్పభాగం మాత్రమే. ఇంకా ఎన్నో పెద్ద పెద్ద పనులు మనం సాధించవలసివుంది. అందుకుగాను మనం మనలోవున్న లోటులను తొలగించుకొని పని చేయవలసివుంది.

## మనం ఇదివరకు ఎలా పనిచేశాం?

అధికాహారోత్పత్తికి మనం 1942 ఫిబ్రవరి నాటినుండి పూనుకున్నాం. ఆనాడు వక్క కృష్ణాజిల్లా రైతుసంఘంమాత్రం బంజర్ల విషయంలోనూ,

ఎరువుల విషయంలోనూ కృషిచేయసాగింది. తక్కువ జిల్లాలలో కొన్ని చోట్ల సంఘాలులేకపోవడం, వున్నచోట్ల రంగాయుతా చేతుల్లో వుండడం వల్ల పనిజరుగలేదు. క్రిష్ణా గుంటూరు, ప|| గోదావరి జిల్లాలలోకూడా 1942 జూన్ నెలనుండీ బంజర్లవిషయంలో పనిప్రారంభించాం. నీటిపారుదల, శిస్తు కమిషనులు మొదలైన విషయాలమీద దాదాపు అన్ని జిల్లాలలోనూ పని ప్రారంభించాం. కాని చేసినపనంతా అన్ని జిల్లాలలోనూ కూడా, ఆర్థిక దృక్పథంతోనే చేశాం. అన్నోత్పత్తికున్న రాజకీయ ప్రాముఖ్యతను గుర్తించలేదు. దీనికితోడు యింకో డివియేషన్ కూడావుంది. అది అతివాద జాతీయ దృక్పథం. ప్రభుత్వానికి మన డిమాండ్లిస్తే అన్నాహారోత్పత్తి కావాలంటే అవి నెరవేర్చబడాలంటూ తెలియజేశాం. ఈ విధంగా మనం అతివాద జాతీయదృక్పథంలోబడి కొట్టుకుపోయి మనంతట మనమే చొరవచేయలేకపోయాం. 1943 జనవరి ఆఖరువరకూ యీ విధంగానే పనిజేశాం. అక్కడినుండీ ఆహార అన్నోత్పత్తికిగల రాజకీయ ప్రాముఖ్యతను గుర్తించి పనిచేయసాగాం. కాని మనలో అప్పటికికూడా సెక్టేరియన్ దృక్పథం వుండడంవల్ల చురుకుగా పనిచేయలేకపోయాం. జమీందారులనూ, భూస్వాములనూ, తమ బంజర్లను సాగుకు యివ్వవలసిందనీ, పెట్టుబడిదారులను ఎరువులకూ, విత్తనాలకూ అప్పులు యిప్పించవలసిందనీ కోరలేదు. అధిక ఆహారోత్పత్తి కార్యక్రమంద్వారానే రైతులు తమ కోర్కెలను సాధించుకోగలుగుతారనే విషయాన్ని మనం గుర్తించలేకపోయాం. మన రాష్ట్రంలో సాధించినదంతా ప్రభుత్వమునుండియే. జమీందారులకు, వడ్డీవ్యాపారస్తులకు దేశభక్తిలేదనే అభిప్రాయం మనకు వున్నందువల్లనే వాళ్ళవద్దకు పోలేకపోయాం. 1943 జూన్ నాటికి ఈ డీవియేషన్ను గుర్తించగలిగాం, కాని యింతవరకు సరియైన పరిమాణంలో జరుగలేదు.

## మనం ఎలా పనిచేయాలి?

ఆహార అధికోత్పత్తికొరకు మనం యీ క్రింది కార్యక్రమంతో పని చేయాలి.

(1) మనంచేసే ప్రతిపనికీ అధిక ఆహారోత్పత్తి కార్యక్రమాన్ని ముడిపెట్టాలి. దానికి అన్నితరగతుల ప్రజల సహకారాన్ని సంపాదించాలి. ఆహార అధికోత్పత్తి, కార్మికులకు, మేధావులకు, వ్యాపారస్తులకూ అందరికీ అవసరమైన సమస్యగాబట్టి అంతా దీనిని బలపరుస్తారు.

(2) ఆహార అధికోత్పత్తికంటూ పెద్దపెద్ద కోర్కెలతో మనం జమీందారులవద్దకూ, ఇతరులవద్దకూ వెళ్లితే వారు నిరాకరిస్తారు. అప్పుడు వారిని జనాల ఏజెంట్లని తిట్టి ప్రయోజనంలేదు. అందరికీ అంగీకారయోగ్యముగావుండే కార్యక్రమంతోనే మనం జమీందారు మొదలైన వారివద్దకు వెళ్ళాలి.

(3) భూస్వాముల, జమీందారుల ప్రభుత్వ, బంజరుభూములను చవుకగా బీదరైతులకూ, కూలీలకూ సాగుకు యిప్పించుటకు కృషిచేయాలి.

(4) ఎరువులూ, విత్తనాలూ ప్రభుత్వంనుండి అప్పుగా యిప్పించుటకూ, నీటి వసతులు కల్పించుటకూ, శిస్తులు, మస్తాలు ఇచ్చుకోలేని రైతులకు మారటోరియం యిప్పించుటకూ, పంటలమీద వేలాలూ, జప్తులూ లేకుండా చేయుటకూ కృషిచేయాలి.

(5) ఆహారపదార్థాలూ, జీవితావసర వస్తువులూ సరసమైన ధరలకు రైతుల కందేటట్లు చూడాలి.

(6) కరువు ప్రాంతాలలో ప్రభుత్వమె పూనుకొని పశువులను కాపాడేట్లున్నూ, విత్తనాలు సప్లయిచేసేట్లున్నూ చేయాలి.

(7) రైతులకూ, వ్యవసాయ కూలీలకు మధ్య ఐక్యతను గొనిరావాలి.

(8) కూరగాయలూ, పాలు, గుడ్లు, మాంసమూ వృద్ధిచేయాలి. అందుకుగాను కోళ్ళను, గొఱ్ఱెలనూ విరివిగా పెంచాలి.

(9) రైతులే చొరవచేసి కాలువలు బాగుచేసుకునేటట్లున్నూ వరవలు ఏర్పరచుకొనేటట్లున్నూ చేయాలి.

(10) మంచి ఎరువులూ, విత్తనాలూ వేయడంద్వారా పంటలను ఎక్కువ పండించేటట్లున్నూ, వ్యాపార పంటలకుబదులు ఆహారపంటలు పండించేటట్లున్నూ చూడాలి.

(11) వ్యవసాయానికి పనికివచ్చే పశువులను కసాయివాళ్ళకు అమ్మకుండా రైతులలో ప్రచారం గావించాలి.

(12) ముఖ్యంగా తాలూకాకు తాలూకాకు మధ్యనా, జిల్లా జిల్లాకు మధ్యనా గల పరిస్థితులనుబట్టి మన కోర్కెలు, పద్ధతులు, చర్యలువుండాలి.

ఈవిధంగా అన్ని తరగతుల ప్రజలూ కలసి కార్యక్రమాన్ని ప్రజలముందుపెట్టి పనిజేయాలి. అలాచేస్తే ప్రజలంతాకలసి అధిక ఆహారోత్పత్తికారకు పూనుకుంటారని మనకున్న కొద్దిపాటి అనుభవమే రుజువు చేస్తోంది.

## బంజరు భూములను సాగులోనికి ఎలా తేవాలి?

బంజరు భూములలో 3 రకాలు వుంటాయి. (1) ప్రభుత్వ బంజరులు (2) జమీందారీ బంజరులు (3) కమ్యూనల్ ల్యాండ్సుగా నమోదు చేయబడిన బంజరులు. ప్రభుత్వ బంజరుల విషయంలో రివెన్యూ ఉద్యోగులకు అర్జీలుపెట్టి అనుమతిపొంది సాగుచేయాలి. జమీందారీ బంజర్లకు,

జమీందార్ల అర్జీలుపెట్టి అనుమతిపొంది సాగుచేయాలి. జిరాయితీహక్కు ఏర్పడుతుందేమోనని జమీందార్లు భయపడితే రైతుసంఘాలు హామీయిచ్చి సాగులోకి తీసుకురావాలి.

కమ్యూనల్ ల్యాండ్సు:— గ్రామ సమిష్టి ప్రయోగం నిమిత్తం వుండే, పుంతలు, డొంకలు, పోరంబోకలు, శ్మశానాలు మొ॥ అలాంటి వాటికి ప్రభుత్వానికీ, జమీందార్లకూ యిద్దరికీ పిటీషన్లు పెట్టాలి. గ్రామస్థుల నందరినీ ముందుగానే ఒప్పించాలి. గ్రామస్థులకు ఏవిధంగానూ, ఇబ్బందిలేని భూములనే సాగుచేయించాలి.

ఇవిగాక రైల్వే పోరంబోకలుకూడా సాగు చేయించవచ్చు. ఆపోరంబోకలు ముందు రైల్వే కూలీలకే యిస్తారు. వారు లేకపోతే ఇతరులకిస్తారు. దీనికికూడా రెవెన్యూ డిపార్టుమెంటుకే అర్జీలుపెట్టాలి. ఏతరగతిభూమికైనా పల్లపుసాగైతే, నీటికొరకు P. W. D కి పిటీషన్లుపెట్టాలి. బంజరుభూములను సాధ్యమైనంతవరకు పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు యిప్పించాలి ఎక్కడైనా తగాదాలువస్తే ముందుగానే జాగ్రత్తపడి తగినవిధంగా రాజీచేసి, సేద్యం జరిగిపోయేటట్లు చూడాలి.

ఎరువులు, విత్తనాలు ఎలా వుపయోగించాలో తెలుసుకునేందుకు ప్రజాశక్తి సంపుటి 2 సంచిక 12, సంచిక 13 లు చూడాలి.

## మన నినాదాలు.

(1) అధిక పంటలను పండించి ప్రజలకూ, సైన్యానికీ ఆహారాన్ని సప్లయి చేయడమే రైతులయొక్క దేశభక్తిపూరితమైన కర్తవ్యం.

(2) అధిక ఆహారోత్పత్తికొరకు కూలీ-రైతులు ఏకంకావాలి.

(3) అన్ని బంజర్లు సాగుచేయబడాలి.

(4) ఆహారపదార్థాలను పొదుపుగా వాడుకోవాలి.

(5) సాధ్యమైనచోట్ల వ్యాపారపంటలకుబదులు ఆహారపంటలువేయాలి.

### ప్రచారం.

అధిక ఆహారోత్పత్తికి రైతులు కేవలం ఆర్థిక దృష్టితోనే పూను కుంటున్నారు. అధిక పంటలను పండించడం తమయొక్క దేశభక్తి పూరిత మైన కర్తవ్యంగా భావించి రైతులు అధికాహారోత్పత్తికి పూనుకునేటట్లు చేయాలి. దానికిగల రాజకీయ ప్రాముఖ్యతనుగూర్చి విరివిగా ప్రచారం చేయాలి. ఆహారవస్తువులను పొదుపుగా వాడుకోవలసిందని, మూబరా చేయ వద్దని, దంపుడుబియ్యమే తినవలసిందని కూడా ప్రచారం చేయాలి.

### చదువవలసిన పుస్తకాలు.

(1) ప్రజాశక్తి పత్రికలు (2) పీపుల్సు వె, టు, ఫుడ్, (3) విత్ ద ప్లౌ షేర్ అండ్ ది సికిల్ (4) ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ తీర్మానాలు.

---

## ఫారెస్టు చట్టం.

### చరిత్ర.

అసలు అడవులలో చెట్లుండటంవలన వర్షం ఎక్కువగా కురవడానికి అవకాశం. అందువల్ల అడవులు తగ్గినకొద్దీ వర్షం తగ్గుతుంది అని అనడం జరుగుతుంది. అడవులకు బదులు చెట్లు ఎక్కువగా పెంచితే తప్పకుండా వర్షమును పూర్వపద్ధతిగా నిలుపుకోగలుగుతాము. పూర్వపురోజులలో అడవులు ప్రజలసొత్తుగా ఉండేవి. కంప, కట్టె, కాయ, ఆకు వగైరా తెచ్చుకొని జీవించడానికి వీలుండేది. కాని ఒక పరుస క్రమం లేకుండా సమిష్టి

క్షేమం గుర్తులేకుండా ఎదురుగా అగుపడ్డ ఎట్టి చెట్టయినా కొట్టివేయడం జరిగేది. అందుచేత అవి క్రమపరచడం అవసరం. ఇదివరకు అట్టి ప్రయత్నాలు జరుగలేదు. తర్వాత వచ్చిన బ్రిటిషు పెట్టుబడిదారీ ప్రభుత్వంలో గూడా అడవులనుండి లాభాలు బడయుటకు ప్రయత్నాలు జరిగినవి. అవి కూడా పద్ధతి ప్రకారం కాకుండా ఏదో ఒకరి పరంగా.

1855 లో డల్‌హౌసీ గవర్నర్ జనరల్‌గా వుండి అడవులను గురించి ఒక పద్ధతి ఆలోచించవలెనని ప్రారంభించాడు. బొంబాయి, మద్రాసు, కలకత్తా రాష్ట్రాలలో ఫారెస్టు కన్సర్వేటర్లను నియమించడం జరిగింది. 1864 సంIIలో ఇనస్పెక్టరు ఆఫ్ ఫారెస్ట్సు ఆధిపత్యం క్రిందఅన్ని రాష్ట్రాలలో అడవుల విషయం వ్యవహరించుటకు ఒక అధికారి నియమింపబడ్డాడు. అప్పటినుండి ఇండియా ఫారెస్టు శాఖఅంటూ యేర్పడింది.

అప్పటికి అడవులు ఎంతవున్నవి. ఏవిధంగా వున్నవి. ఇంకా ఎంత పెంచాలి, ఎవిధంగా పెంచాలిఅని ఆలోచన జరిగింది. అందుకై అడవులను గురించి ఒక ఆక్టు చేశారు. తర్వాత 1878 లో ఇదివరకు రైతులు సంప్రదాయసిద్ధంగా అనుభవిస్తూ వచ్చిన హక్కులను పూర్తిగా అరికట్టుతూ ప్రభుత్వం తన పెత్తనాన్ని అధికారాలను బలపరచుకుంటూ శిక్షలు, జరిమానాలు అమలుజరిపే విధులు నియమించుకుంది. ఈశాసనాలు అమలు జరుగడంలో ఇండియా మొత్తానికి సంబంధించినవి కాకుండా అడవుల విషయం స్థానిక సమస్యగాకూడా వుండడంవల్ల ఆయా రాష్ట్రాలలో శాసనాలు చేయబడ్డవి. ఆవిధంగానే మద్రాసులో 1882 సంII ఒక ఫారెస్టు శాసనం చేయబడ్డది. 1894 లో ఫారెస్టు అభివృద్ధిని గురించి ఒక సర్క్యులరు యిచ్చింది.

## మద్రాసు ఫారెస్టు ఆక్టు.

అడవులు నాలుగు రకాలుగా విభజించవచ్చు.

(1) వాతావరణ కారణాన అవసరమైన అడవులు.

(2) వ్యాపారానికి పనికివచ్చే అడవులు.

(3) మైనరు అడవులు.

(4) పచ్చిక అడవులు.

ఈ అడవులు రెండు భాగాలు. (1) రిజర్వు ఫారెస్టు (2) అన్ రిజర్వు ఫారెస్టు.

ఒక ఫారెస్టును రిజర్వుఫారెస్టుగా నిర్ణయించిన ఆవిధంగా ఫోర్టు సెంటు గెజెటులో ప్రకటించబడును. ఆ తర్వాత దానిలో

(1) సాగుచేయుటకై కట్టకలప ఖాళీచేయడంగాని,

(2) రిజర్వుమైనును, ఆకులను, కొమ్మలను తెగుటపెట్టడంగాని నష్టపరచడంగాని,

(3) జిల్లా ఫారెస్టు ఆఫీసరు కోరిన విధంగా కాకుండా ఎవరన్నా నిప్పు వెంట ఉంచుకున్నా,

(4) నడిచినా, పశువులనుమేపినా లేక పశువులు పోవునట్లుచేసినా,

(5) చెట్లను పడగొట్టినా, వాల్చినా, గుర్తులుపెట్టినా కల్లుగీత వగైరా గీతగీసినా తెగులబెట్టినా, చెట్లకొమ్మనుగాని పాకుచేసినా,

(6) రాళ్లుతీసుకున్నా, సున్నం బొగ్గు కాల్చినా లేక పైవి ప్రోగు చేసినా లేక అడవి ఫలసాయాన్ని తీసుకున్నా,

(7) సాగుకై సాపుచేసినా, దున్నినా, పగులగొట్టినా,

(8) రూల్సును వ్యతిరేకంగా షికారుచేసినా ఏ జంతువునన్నా కాల్చినా, చేపలుపట్టినా, నీటిని విషమయంచేసినా, వలలు ఉచ్చులుపన్నినా

(9) గోడగుంట, కట్టకంచె, కమ్ములు వీటిని నష్టపరచినా, కదిలించినా,

6 నెలల శిక్ష, 500 వరకు జరిమానా వేయవచ్చు. రెండూ వేయవచ్చు. వీటికి పైగా కలిగిన నష్టానికి నష్టపరిహారంకూడా వసూలు చేయవచ్చు.

ప్రభుత్వాధీనంలో లేకపోయినా ఏ స్థలాలనైనాసరే

(1) గాలివానలు, సుడిగాల్పులు, రాళ్లు జారి పడడం, ప్రవాహం రావడం,

(2) స్థలాలు, లోయలు పూడిపోవడం లేక కొట్టుకొనిపోవడం,

(3) ఊటలు, నదులు, చెరువులలో నీరు ఎల్లకాలం నిల్వ ఉంచడం,

(4) రోడ్లు, బ్రిడ్జీలు, రైల్వేలు మొదలగు రహదారీలను రక్షించుటకు

(5) ప్రజల ఆరోగ్యాన్ని రక్షించడానికి

కారణాలు అవసరంగాని లేక అభ్యంతరాలు కనిపించినవి అనిగాని తలిస్తే అట్టి స్థలాలలో (1) సాగుచేయుటకై సాగుచేయడంగాని (2) పశువులను మేపడంగాని (3) చెట్లను తీసివేయడంగాని, కాల్చడంగాని జరుగకుండా నిషేధించవచ్చును.

ఫారెస్టు కోర్టులు:— మొదటి రోజులలో ఫారెస్టు సెటిల్‌మెంటు ఆఫీసరును యేర్పరచి వారు ఫారెస్టు సరిహద్దులు నిర్ణయించేటప్పుడు జమీందారీలలోను అగ్రహారాలలోను అడవులు స్వాధీనపరచుకున్నప్పుడే వాటిల్లోవచ్చే సరిహద్దుపేచీలు హక్కుల పేచీలు విచారించడానికి ఫారెస్టు కోర్టులు యేర్పడ్డవి. ఇందులో 3గ్గురు సభ్యులుంటారు. 1. జిల్లా జడ్జి (ఇతడే ప్రెసిడెంటు) 2. జిల్లా కలెక్టరు 3. గవర్నమెంటు నామినేటు చేసిన సభ్యుడు. దస్తావేజులలోనూ, లా పాయింట్లలోనూ అనుమానంవస్తే కోర్టుగాని లేక ఏపార్టీ అయినాగాని ఈ కేసును హైకోర్టుకు రిఫరుచేయవచ్చునని అడగవచ్చును. తీర్పు చెప్పకపూర్వమే హైకోర్టుకు రిఫరుచేస్తారు.

## ఫారెస్టు నేరాలు:

ఫారెస్టు ఫలసాయంగాని కలపగాని, అపహరించి ఫారెస్టు నేరం చేస్తే ఆ వస్తువులను పశువులను, ఇంకా ఆ నేరానికి సహాయపడిన వస్తుపరికరాలు, తాళ్ళు, గొలుసులు, వాహనాలు, బండ్లు, పడవలు, వీటన్నింటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవచ్చు. పైగా మేజస్ట్రేటు శిక్షకూడా వేయవచ్చు. ఆ ఆస్తిలో ఏదైనా అప్పుడే చెడిపోయేదిగాని, కుళ్ళిపోయేదిగాని ఉంటే అట్లాంటివాటిని వెంటనే వేలంవేసి అమ్మివేసి ప్రభుత్వఖజానాలో జమ కట్టవచ్చు. ఆస్తి కోల్పోయినవాడు నెలలోగా అపీలు చేసికోవచ్చు. ఫారెస్టు నేరాలను ఒప్పుకుంటే కాంపౌండు (కంపెన్సేషను) చేస్తారు అది చెల్లిస్తే ప్రభుత్వం స్వాధీనపరచుకున్న ఆస్తిని అతని కిచ్చివేయవచ్చు. శిక్షఅనుభ విస్తూవుంటే విడుదల చేయవచ్చు.

వారంటులేకుండా ఏ ఫారెస్టు ఆఫీసరయినాసరే ఫారెస్టులో నేరం చేసినవానిని అరెస్టు చేయవచ్చును. కారణంలేకుండానే అరెస్టుచేశాడని రుజువుచేస్తే ఆ అరెస్టుచేసిన అతనికి 6 నెలలశిక్ష రు 500 లు జరిమానా వరకు వేయడానికి కోర్టుకు అధికారం ఉంది.

అడవుల కూపులలోనూ, నిషేధిత స్థలాలలోనూ, పశువులు మేస్తే వాటిపై క్రింది ధరలు మించకుండా కాంపౌండు వేయవచ్చు. ఏనుగు రు 10 ఒంటె, గేదె రు. 2. గుఱ్ఱం, కంచరగాడిదె, ఎద్దు, కోడె, ఆవు, ఆవుదూడకు రు. 1. గాడిదె, పంది, పొటేలు, గొర్రె, గొర్రెపిల్ల, మేక, మేకపిల్లలకు రు. 0-8-0 లు అంటె రెట్టింపు అన్నమాట. మేక, మేకపిల్లను అసలు అడవిలో మేయనియ్యరు. దానికి పర్మిటు-పుల్లరి చెల్లించినా ఇవ్వరు. కారణం మేక తలలు కొరికివేస్తుంది. అందువల్ల చెట్లు పెరగడానికి అవకాశం లేకుండా పోతుంది అని అంటారు.

## ఫారెస్టు పంచాయతీ:

1912 లో ఫారెస్టు కమిటీ ఫారెస్టు అధికారులకు గ్రామస్థులకు సంబంధం వీలైనంత తగ్గించవలెననే సూచనయిచ్చి, రిజర్వు ఫారెస్టులం రెండురకాలుచేసి పశుగ్రాసం, వంటచెరుకు, వ్యవసాయ పరికరాలు యిచ్చే వానిని ప్రత్యేకించి పంచాయతీ యాజమాన్యానికివ్వవలెనన్నారు. 1914లో కొన్ని అడవులు ఫారెస్టు పంచాయతీలకు యిచ్చారు. 1923 లో రిట్రెంచిమెంటుకమిటీ పశుగ్రాసం, వంటచెరుకును యిచ్చే అడవులను రైతీ అడవులు అని పేరుపెట్టి అట్టి అడవులన్నింటిని ఫారెస్టు పంచాయతీల కిచ్చారు. అందుపై సాధారణంగా వదిలిపెట్టదగిన అజమాయిషీ ఫారెస్టు డిపార్టుమెంటు ఉంచుకొనడం అనవసరం అని 1925 జూలై 1వ తేదీని రివిన్యూడిపార్టుమెంటుకు మార్చారు. ఈ పంచాయతీల అజమాయిషీ ల్యాండు రివిన్యూ కమీషనరుకు యిచ్చారు. ఇతనికింద రాష్ట్రానికి అంతకు డిప్యూటీతహసీలుదారు ఆఫ్ ఫారెస్టుపంచాయతీస్ అనే ఉద్యోగి ఉన్నాడు. ఇతనికి సహాకారంగా రివిన్యూ కలెక్టరులు తహసీలుదారులు సహాయపడుతుంటారు. మనరాష్ట్రంలో 3371 పంచాయతీలున్నవి. వీటిఅధీనంలో 3371 చ. మైళ్లు ఉన్నవి. మిగత 15126 చ. మైళ్లు రిజర్వు ఫారెస్టు మద్రాసురాజధానిలో ఉన్నది. ఈ ఫారెస్టు పంచాయతీల అజమాయిషీఅంతా ఒక ప్రభుత్వ శాసనంద్వారా కాకుండా, 195 (ఎ) బోర్డుస్టాండింగు ఆర్డరుద్వారా పరిపాలింపబడుతున్నవి. అట్లాకాకుండా ఫారెస్టుపంచాయతీల చట్టం అంటూ ఏర్పడి దానిద్వారా నిర్వహింపబడాలి.

ప్రతి ఫారెస్టు పంచాయతీ ఆవరణకూడా అఫ్‌యూనిట్ గా లెక్కకట్టబడును అఫ్‌యూనిట్ అంటే మూడు ఎకరాలు. ఈ ప్రకారంగా ఆ ఫారెస్టు ఏరియా అంతా డబ్బులో లెక్కకట్టబడుతుంది. దీనికి సరిపోయే పైకం యిచ్చి, ఫారెస్టును అభివృద్ధి పరుస్తామని దానికితగ్గ అజమాయిషీ చేస్తామని, ఫారెస్టురూల్సులు అమలు జరుపుతామని ఒక అగ్రిమెంటు ప్రతి

ఫారెస్టు పంచాయతీ వ్రాసియివ్వాలె. గార్డుకు అంతా అధికారం నామకః పంచాయతీ ఉన్నా ఫారెస్టు అధికారులకు బాగా ఉన్నాయి. ఫారెస్టు పంచాయతీ ఆవరణంలో తమ పశువులను మేపుకుంటానికి పుల్లచీట్లు తీసుకున్న వారంతా ఓటర్లు. స్త్రీలు సభ్యులుగా ఉండకూడదు. తహసీలుదారు ఎన్నికలు జరుపుతారు.

ఫారెస్టు పంచాయతీ మేతచీటీలు యివ్వవచ్చు. తోటు వసూలు చేయవచ్చు. మైనరుపంట అనుభవించవచ్చు. (మైనరుపంట అంటే చిన్న చిన్న 10-15 ఎకరాల స్వంత కూపులమీది ఆదా. తంగేడు చెక్క, ఎండుకట్టె, ఎరువు ఆకులు అమ్మకం) వీటికివచ్చే ఆదాయాలు (1) పుల్లరి (2) మైనరు పంట అమ్మకాలు, (3) అబ్కారీ ఆదా, (4) పచ్చికలప అమ్మకం, (5) పెద్ద కూపులమీద కమీషన్, (6) కాంపౌండు ఫీజులు, (7) క్వారీ ఆదా, (8) చందనంలో భాగం.

వీరు ఖర్చుచేసే పనులు (1) వాచరుఖర్చు, (2) నిర్వహణ, (3) గవర్నమెంటు రెంటు, (4) సరిహద్దులు భద్రపరచుట, (5) ఫారెస్టు అభివృద్ధి చేయడం;

అప్పుడప్పుడు మధ్య ఎన్నుకోబడిన సభ్యులుకూడా పంచాయతీ అగ్రిమెంటుమీద సంతకాలు చేస్తూవుండాలి. పంచాయతీ తాము చెల్లించవలసిన ప్రభుత్వరెంటును రెండువాయిదాలుగా చెల్లించాలి. ఇవి చేయగలిగిన అభివృద్ధులు (1) నాగజెముడు తీసివేయడం, (2) నీరు నిల్వ చేయడానికి కంతలు పడకుండా కొట్టుకుపోకుండా కట్టలు వేయడం, (3) గొట్లనోడ్లు - బావులు బాగుచేయించడం, (4) గడ్డి పెంచడం, (5) చెట్లునాటడం, (6) తంగేడు అభివృద్ధి, (7) కంచెలు వేయించడం, (8) చందనం పెంచడం ఇంకా ఇట్లాంటివే.

జరుగుతున్న అన్యాయాలు (1) పంచాయతీ సభ్యులు ప్రెసిడెంటు ఒకటిరెండు తమ పశువులకు పర్మిట్లు తీసుకొని ఎన్నో పశువులను ఊరక మేపు కోవడం. (2) పర్మిట్లు లేకుండానే యితరుల పశువులను ఉద్దర్కి తామే తీసుకొని మేపడం (3) కొందరికి అసలు పర్మిట్లు ఇవ్వకపోవడం, (4) ఆఫ్యయాలిల్లుకున్న అధికంగా పశువులను ఫారెస్టులో మేపడం. తనపార్టీవారికి, తనబంధువర్గానికి ఫారెస్టు స్వంతంలాగా వాడుకోవడానికి అవకాశం యివ్వడం.

పర్మిటు తను తీసుకోకపోవడంలో డబ్బు ఆదా. ఇతరులకివ్వకపోవడంలో (1) తన జేబులో వేసుకోవచ్చు (2) అవతలవాడికి వోటు లేకుండా, వోటరులంతా తమచేతులోనే ఉంటే శాశ్వతంగా అనుభవమూ ఉండవచ్చు. ఈ వోటింగు పద్ధతిలో మార్పురావాలి. ఊరికి మొండిపెత్తనం పోయి అందరికి అందుబాటులో దయకిందగాక, హక్కుకింద మేపుకునే హక్కు - ఓటిచ్చేహక్కు ఉండాలి.

## జమీందారీ ఫారెస్టులు:

ఏజన్సీలో అడవులు:- ఇచ్చట అడవులు రెండురకాలు (1) ప్రొటెక్టెడ్ అడవులు, (2) రిజర్వు అడవులు. డాక్టర్ వేలోకర్ చెప్పినట్లు రిజర్వు 'ఫారెస్టులో అనుమతించనిది ఏదిచేసినా నేరమే' ప్రొటెక్టెడ్ ఫారెస్టులో నిషేధించింది నేరంకాదు. ఇక్కడ ఫారెస్టు నిబంధనలే అమలుచేయబడ్డవి. అయినా జమీందారులు ఎక్కువమంది ఉన్నారు. అధికారాలు అమలు జరపడం వారిపరం అయినవి ఈ ప్రొటెక్టెడ్ అడవులలో ఏజన్సీలోని కొన్ని జాతులు తినుబండారాలు స్వంత ఉపయోగానికి తీసికోవచ్చునని ఉన్నది కాని అమలులో అనేక పేచీలు. వాటిఫలితాలె రంపపితూరి సీతారామ రాజు తిరుగుబాటు వగైరా ప్రొటెక్టెడ్ ఏరియాలో రిజర్వుకు చెల్లున్నవి. వాటిని అనుమతిలేనిదే కొట్టరాదు. కొన్నిచోట్ల ప్రొటెక్టెడ్లాండు అని

కూడా వాడారు. ఈ రిజర్వు చెట్లు, టేకు, ఇ[illegible], వే , కరక్కాయ, చింత, గుగ్గిలం, యిప్ప, మామిడి, పనస, బిల్లుడు, కొండతంగేడు, తుంగుడు, కానుగ, నల్లమద్ది, తక్కి, పందర, యల్లెరమన, [illegible]నుగ, బట్టగడప, సొంచి, తెల్లమద్ది, బూసి, నేరేడు, చందనం, పాలువ, తంగిన, యేగిశ, ఇరిప్పి, చెన్నంగి, చండ్రి, ముష్టి, ఇందుగు, వేప, వె[illegible], బీడి, తాటి, ఈత, కొబ్బరి, మొదలగునవి.

రిజర్వులలో రైతులు 'ప్రివిలైజుడు హక్కులు' అనేటువంటి సాంప్రదాయ సిద్ధంగా ఉన్న హక్కులు అనుభవించవచ్చునని ఉన్నది; ఫారెస్టు మాన్యువల్లో. కాని అవి అమలుజరుగడం ఆ ప్రాంత ప్రజలపై ఆధారపడి యున్నది.

రిజర్వు ఫారెస్టులో షికారు చేయడానికి లైసెన్సు ఉండాలి. లైసెన్సు పొందినా దుప్పి, అడవిగేదె వీటికొమ్ములు 25 అంగుళాలకు లోగా ఉంటే చంపకూడదు. జీవంగల జంతువును పట్టుకోరాదు. మనుష్యులను చంపే జంతువులనైతే చంపవచ్చు అని అవకాశం ఉంది గాని ఫలానా జంతువులు అని చెప్పబడలేదు. రిజర్వు ఫారెస్టులో అనుమతించనిది నేరం.

## జమీందారీ అడవులు:

ఫారెస్టుయాక్టు అమలుజరిపి జమీందారీ ఏరియాలలోని ఫారెస్టులను కూడా ఫారెస్టు రూల్సును ఎరచేశారు. కాని ఫారెస్టు అధికారులక్రింద కాకుండా మళ్ళీ వాటి అజమాయిషీ అంతా జమీందారులు వారి తాబేదారుల ద్వారా పోవుతున్నారు. అందుచే రైతులకు స్వతసిద్ధంగా ఉన్న వ్యవసాయ పరికరాలు, ఆకు, పుల్ల, గడ్డి తెచ్చుకొనే మామూలు హక్కులు అమలుజరగడం లేదు. భూములు జమీందారు ఇష్టంవచ్చినట్లు సేద్యానికి యిచ్చివేస్తున్నారు. మేసేచోటు తగ్గిపోతున్నది. అటు ఫారెస్టుయాక్టుక్రింద లేనపుడు ఫారెస్టు

యాల్సు ప్రకారం అమలుచేయడమో లేక జమీందారుక్రిందఉండి పూర్వపు హక్కులు అమలుజరగడమో జరగాలి.

జనరల్.

ఫారెస్టులలో వ్యవసాయం చేసికోవడానికి చాలా భూభాగం ఉన్నది. అది సాగుకు ఇవ్వవలెనని ఆందోళన చేసిన ఫలితంగా అడవులు అభివృద్ధి చెడకుండా సమగ్రపద్ధతి అంటూ ఒకటి తెచ్చారు. ఫారెస్టు భూములలో ఒక చెట్టుకు మరొకచెట్టుకు మధ్యఉండే స్థలంలో అంటే దాదాపు 25 అడుగుల వెడల్పున 70-80 గజాలవరకూ పొడవు ఉంటుంది. ఈ మధ్య సాగు చేసుకోవచ్చునన్నారు. కానీ చెట్లకుగాని, పెరిగిఉన్న చెట్లకుగాని ఎమాత్రం నష్టం తగిలినా నష్టం చెల్లించుకోవాలిసిందే. అరక అటుయిటు తిరగదు. ఇది చెట్లు మొదటిలో పెరిగే మూడు సం॥రాలే. తర్వాత మళ్ళీ మార్చవలసిందే. సమీపంగా చేసుకోవచ్చునని ఫారెస్టు డిపార్టుమెంటు అంటుంది. ఉపయోగం సున్నా.

అడవులు అన్ని ఒకేసారి పెరుగుతుంటం, ఒకేసారి నరుకుతుండటం జరుగుతున్నది. అందువల్ల ఒక్కసారి ఫారెస్టుఅంతా ఖాళీ అయిపోవటం జరుగుతున్నది. కావున "ప్లాంటింగు" పద్ధతి ఏర్పాటుచేశారు. అంటే ఒక వరుసలో 5 కూపులు ఉంటే వరుసగా ఒక సం॥ మొక్కలువేసి నాటటం, ఒక సం॥ నరకడం జరుగుతూ ప్రతి సం॥ నాటేవి నరికేది ఉంటూ ఉంటుంది. దీనినే పెంపుదల మార్పుచేయటం అంటారు. ఇది అవలంబిస్తున్నారు.

అసలు పుల్లరి రద్దుచేయవలెనని ఫారెస్టులో చారపప్పు, తేనె, కలప, కట్టెమీదనే ఆధారపడేవారు చేసిన ఆందోళనఫలితంగా కాంగ్రెస్ మంత్రివర్గం అధికారానికి వచ్చినప్పుడు 1937 జూలైలో సం॥కి 6½ లక్షల ఆదాయం పుల్లరిద్వారా వస్తున్నా అంత నష్టానికికూడా సమ్మతించి పుల్లరి రద్దు చేశారు. సంయుక్త రాష్ట్రాలలో సగానికి తగ్గించారు. ఇందువల్ల వారికెప్పు

వచ్చింది రు 75000 లు మాత్రమే. మనరాజస్థానంలో కూడా పుల్లరి సగానికి తగ్గించారు. ఇది ఫారెస్టుడిపార్టుమెంటు క్రింద ఉన్నదానికి వర్తిస్తుందిగాని, పంచాయతీ ఫారెస్టులకు వర్తించదు. ఈ సగం తగ్గించడంవల్ల సగం నష్టం రావడానికి బదులు సగం తగ్గించినందున రైతుల భారం సగం తగ్గిందికావున ఎక్కువ పశువులను మేపారు. అందువల్ల నూటికి 50 నష్టం రావలసినదానికి నూటికి 37 నష్టం వచ్చింది.

అధికారులు.

గార్డు, ఫారెస్టరు, ఫారెస్టురేంజరు, జిల్లా ఫారెస్టు ఆఫీసరు, డిప్యూటీ కన్సర్వేటరు, కన్సర్వేటరు, కన్సర్వేటరు రాష్ట్రాధికారి. ప్రతి ప్రభుత్వానికి చెందిన అడవులకు ప్రత్యేకం ఆఫీసర్లుగలరు. ఆంధ్రరాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వానికి చెందిన అడవులు ఉన్నట్లు కన్పించదు.

మన డిమాండ్లు.

(1) పంచాయతీలు సరిగా పనిచేయుటకై పంచాయతీలు శాసనబద్ధంచేయాలి, ఎన్నికలవిధానం మార్చాలి, పశువుగలిగిన ప్రతివారికి వోటింగుహక్కుండాలి.

(2) పుల్లరి పూర్తిగా రద్దుచేయాలి.

(3) రిజర్వులైనులు గ్రామానికి కనీసం ఒక మైలు దూరముండాలి.

(4) అడవులు మూతలు తీసివేయాలి.

(5) వ్యవసాయ పరికరాలకు అవసరమైన కొయ్య, వంటచెరుకు, గడ్డి, బోదెగడ్డి, ఉచితంగా తెచ్చుకోవడానికి అనుమతి యివ్వాలి.

(6) లంచాలను రూపుమాపాలి, రైతులుకూడా హక్కులనెరిగి వాటిని అమలుపరుచుకొనేటట్లు బాధ్యతవహించి లంచగొండితనాన్ని అరికట్టాలి.

(7) జమీందారీ అడవులలో జమీందార్లు మొదలైన ఫారెస్టు శాఖ వారి యెస్టేట్లలో ప్రవేశపెట్టి అనాది సిద్ధంగావున్న హక్కులను భంగ పరచరాదు.

(8) ఉన్న అడవులను కాపాడుతూ పాత అడవులను వినియోగించుకొని వాటిస్థానములో క్రొత్త అడవులను వేయాలి.

(9) ఫారెస్టులలో నీటి పారుదల క్రింద సాగుకు లాయకు అయిన భూమిని, సాగుచేయాలి. ఫారెస్టు పారుదల ప్రక్కనున్న భూములకు ఫారెస్టులోని నీరు పారుదలల నుపయోగించుకొని సాగుచేయుటకు అవకాశం ప్రభుత్వం వెంటనే యివ్వాలి. అధికాహారోత్పత్తికి ఈ అవకాశాన్ని కూడా ఉపయోగపర్చుకోవాలి.

(10) రైతులు అవకాశమున్నచోటునల్లా చెట్లువేసి పెంచి వర్షానికి అవకాశం కల్పించాలి.

కర్తవ్యం.

నిరంతరం రైతునంటియుండి ఏ నిమిషంలో ఏ యిబ్బందివచ్చినా దానిని ధైర్యంతో పరిష్కరించడం చేయాలి. రైతుకూడా మొదట్లో కొంత కష్టాన్ని ఎదుర్కోవాలి.

---

## కరువు చట్టము.

కరువు భారతదేశములో ప్రతిసంవత్సరము యేదో ఒక రాష్ట్రములో ప్రత్యక్షమౌతూనే వుంటుంది. 1865 లో ఒరిస్సాలో, 1873 లో బీహారులో, 1876, 1896, 1897 లలో దక్షిణభారతదేశంలోను భయంకర క్షామపరిస్థితులు కల్గినవి. ఒరిస్సాలో సహాకారము రాకముందే వేనవేల

చనిపోయారు. 1873 లో బీహారులో కరవు తీవ్రమైన - సమస్యగ గురికాగా నప్పుడు ఒరిస్సాలో జరిగిన సంఘటనలు డబ్బు, శక్తి వ్యయంతో బీహారులో జరుగనివ్వకాదని ప్రభుత్వము అభిప్రాయపడి కరవు నివారణకు 6½ మిలియను పౌనులు ఖర్చుపెట్టింది. ప్రధానంగా 5 లక్షల టన్నుల బియ్యము బర్మానుండి సరఫరా చేయబడినవి. కాని 1876 లో దక్షిణ భారతదేశములో క్షామము ఏర్పడినప్పుడు ప్రభుత్వము వ్యతిరేక వైఖరి నవలంబించింది. కరవువలన మనుష్యులు చచ్చిపోకుండా ప్రభుత్వము తమకున్న అధికారములతో చూడవలసియున్నా, బీద ప్రజాసామాన్యమునకంతటికి ఏవిధమైన బాధలులేకుండా నివారణచేసే బాధ్యతలేదని ఇండియా ప్రభుత్వం ప్రకటించింది. ఈ సూత్రాన్ని ఆధారంగా నిర్ణయించే ఆ తరువాత నియమింపబడిన ఫామిన్ కమీషనులన్నియు నిచేసినవి.

ఆంధ్రజిల్లాలు (1896, 97, 1900, 1901, 19, 21, 22, 24, 31, 32, 34, 35, 37, 38, 42, 43 సం॥) తరచుగా కరవుకు గురియగుచు వచ్చినవి. ఇందు ఎక్కువగా బళ్ళారి, అనంతపూర్, కర్నూల్ జిల్లాలలోను, కడప, చిత్తూరులలో కొన్ని భాగాలలోను సంభవించింది. కరవు వచ్చినప్పుడు తాత్కాలిక రిలీఫు పనులు యివ్వడం, కరవుశిబిరాలు పెట్టి రాళ్ళు బద్దలు గొట్టించి ప్రజలను చావుబ్రతుకుల మధ్యనిలబెడుతూ వస్తున్నారు. 1937, 38 లలో కరవు వచ్చినప్పుడు కాంగ్రెసు మంత్రివర్గము అధికారములోవుంది. తరచుగా కరవులువచ్చే ప్రాంతాలలో కరవురాకుండా చేయడానికి, తగ్గించడానికి సూచనలు సలహాలు యివ్వమని ఒక విచారణ కమిటీని 1938 మే 2 వ తేదీన నియమించింది. దీనిలో 8 మంది అనధికారులు, 5 గురు అధికారులు వున్నారు. కరవు కమీషనరు ఈ సంఘానికి అధ్యక్షుడు. ఈ కమిటీ రాయలసీమ అంతా తిరిగి అధికారులదగ్గర అనధికారుల దగ్గర సాక్ష్యములు తీసికొని కరవు నివారణకు స్పష్టమైన సూచనలతో ఒక సమగ్రమైన రిపోర్టు తయారుచేశారు. వీరు దానిలో సూచించిన ప్రధాన

సూచనలు తుంగభద్ర, యింకా ఇతర మైనరు ప్రాజెక్టులను కట్టాలని, ఈజిల్లాలలో ప్రస్తుతి పదిలక్షల యకరాలకు పైగా వేస్తారు గాబట్టి బట్టల మిల్లులు మొదలగు పరిశ్రమలు పెట్టాలని, గనుల పరిశోధనచేసి గనుల పరిశ్రమ అభివృద్ధిచేయాలని, కుటీరపరిశ్రమలు అభివృద్ధిచేయాలని, చెరువులు, బావులు త్రవ్వించి ఫలవృక్షములతోటలు అభివృద్ధిచేయాలని, చేతిపరిశ్రమలు అభివృద్ధిచేయాలని సూచనలు గావించారు. ఇప్పుడున్న కోడ్‌లో యింకా సవరణలు సూచించారు. కాని, ఈ కమిటీ రిపోర్టుతయారై చర్చకు రాకముందే కాంగ్రెసుమంత్రులు రాజీనామాలిచ్చారు. ఈ సూచనలు కాగితాలమీదనే వున్నాయి. మరల నేడు కండ్లముందే రాయలసీమలో క్షామము ఏర్పడి ప్రజలు బాధలు పడడము చూస్తున్నాము.

భారతదేశము వ్యవసాయ దేశమైనా ప్రజలు తినుటకు తిండిలేక మలమల మాడడము చూస్తున్నాము. దానికి కారణం అతివృష్టి, అనావృష్టి అని ప్రభుత్వం చెప్పతుంది. కాని ఈ కరువుకు కారణము బ్రిటిషు సామ్రాజ్యము భారతదేశములో ప్రసరించుచున్న ఆర్థిక విధానఫలితం, పన్నుల భారము, వున్న జలాధారములను ప్రాజెక్టులు కట్టించుటద్వారా వుపయోగములోనికి తీసికొని రాకపోవుట, వ్యవసాయాభివృద్ధికి సరియైన పెట్టుబడి పెట్టక నామమాత్రపు వ్యవసాయశాఖను ఏర్పరచుట మొదలగునవి ప్రధానమైనవి. ప్రత్యేకంగా నేటి యుద్ధపరిస్థితులు మరింత తీవ్రం కావించినవి.

<u>కరువుచట్టము రైతుసర్కార్లు ఎలా వుపయోగించుకోవాలి:-</u> మనము కరువుచట్టముద్వారా కరువు తొలగించగలమని అనుకోవడం శుద్ధ పొరపాటు. కాని ఈ కరువుచట్టములోనున్న అవకాశములను కరువు ప్రాంతముల ప్రజలు వుపయోగించుకొనుచున్నారా? ప్రభుత్వము అమలు జరుపుతోందా? అంటే లేదు. కరువువచ్చినప్పుడు సకాలంలో కరువుక్యాంపులు పెట్టుటలేదు. క్యాంపులు పెట్టినచోట్లకూడ సరియైన ఏర్పాట్లు గావించుట

లేదు. కాబట్టి మన వర్కర్లు ఈ కరువు చట్టాన్ని పని ప్రారంభించుటకు ఒక ఆధారంగా తీసుకోవాలి. దీనిలోని సెక్షనులను ఆధారంగా జేసికొని అవి అమలులోనికి తీసుకురావడానికి ప్రజల సమీకరణ చేయాలి. ప్రభుత్వాన్ని లొంగచేయడానికి ప్రభుత్వాధికారుల నిరంకుశత్వాన్ని, అవినీతి ప్రవర్తనను అరికట్టడానికి వర్కర్లు ఈ సెక్షన్లలో ఏమివున్నదో తెలిసికోవాలి. కరువుచట్టంలో మొత్తం 294 సెక్షనులు వున్నాయి. కాని వీనిలో ముఖ్యమైనవానిని 26 సెక్షనులు మాత్రమే యిస్తున్నాము. అవికూడా సెక్షను పూర్తిగాగాని, అనువాదంగాగాని కాదు. ఆ సెక్షనులోని సారాంశాన్ని మాత్రమే యిస్తున్నాము.

కొన్ని ముఖ్యమైన సెక్షన్లు.

10 వ సెక్షను కరువునివారణపనులు రెండు తరగతులుగా విభజించాలి. (1) పబ్లిక్ వర్క్సు: ఈ పనులు పి. డబ్ల్యు. డి. యాజమాన్యమున జరుగుతాయి. ఈ పనులలో 500 లోపుగాని, పైనగాని కూలీలు పనిచేస్తారు. (2) గ్రామపనులు: ఇవి రెవిన్యూశాఖ యాజమాన్యమునగాని గ్రామములో వుండే వ్యక్తుల యాజమాన్యమునగాని జరుగును. ఇవి చెరువులు త్రవ్వించుట, రిజర్వాయర్లు కట్టించుట, గ్రామరోడ్లు వేయించుట మొదలగు పనులు చేయిస్తాయి. రెవెన్యూ యజమాన్యమున జరుగుపనులను ప్రభుత్వ ధనముతోనే చేయిస్తారు. గ్రామసంఘ యాజమాన్యమున జరుగునవి గ్రామవుమ్మడి ఆదాయంగాని, వ్యక్తుల పెట్టుబడిమీదగాని జరుగుతవి. దీనికిగూడా ప్రభుత్వ సహాయాన్ని తీసికోనవచ్చును.

11 వ సెక్షన్: ఈ కరువుపనులు ఆ కరువుప్రాంతములోని 20 % (నూటికి ఇరవైమందికి) 6 మాసములు పనులు ఏర్పరచాలి. (ఈ కరువు ప్రాంతములోనికి ఆంధ్రదేశములోని కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరులూ, తూర్పు గోదావరిలోని డెల్టా తాలూకాలు రావు.)

49 వ సెక్షన్: లెక్కపెట్టువారు; కరువువచ్చిన్న ప్రాంతములో నిజంగా కరువుందా లేదా అనే పరీక్షచేయడానికి ఈ పనులు ప్రారంభి స్తారు. ఈ పనుల్లో ప్రతిమనిషికి మామూలుగా చేయవలసిన పని కంటె కొంచెం తక్కువగా వుంటుంది. ఎవరినైనా చేర్చుకోవాలి. విశ్రాంతి దిన మున సెలవు భత్యము వుండదు. పిల్లలకు, ముదుసలులకు కూడా ఆవేళ భత్యమువుండదు. చేసిన పనికొలతలు ప్రతిరోజూ చేయాలి. కూలి వారము నకు రెండుపర్యాయములైనా యివ్వాలి.

50 వ. సెక్షన్: లెక్కపెట్టువారుతోపాటు పనిచేయలేనివారికి వంట శాలలు తెరచి ఉచితంగా భోజనము పెట్టాలి. లేక భత్యము యివ్వాలి. లెక్కపెట్టకముందైన గ్రాటిమస్ రిలీఫ్ పని చేయలేనివారికి (పిల్లలు, వృద్ధులు మొ॥) యివ్వాలి.

68 సెక్షన్: సర్కిల్ ఆఫీసరు. తన సర్కిల్లోనున్న ప్రతి గ్రామమువెళ్ళి ప్రతియింటికి వెళ్ళి కరువుస్థితి యెలావుందో తెలుసుకో వాలి. భూస్వాములను కూలీలతో పని యించమని ప్రోత్సహించాలి. రిలీఫ్పని యెక్కడవుందో, కూలి యెంత యిస్తున్నారో పనియేమిచేయాలో చెప్పి ఆ సర్కిలునుండి కరువుబాధితులను పనులలోనికి పంపాలి. కరువు పనులలో చేర్చుకోమని కూలీలకు అనుమతి యివ్వాలి. గ్రామాలలో జరుగు రిలీఫ్ పనులను తోడ్పడాలి. పని చేయలేని వారికి వుచిత భోజన యేర్పాట్లు గావించాలి. తన సర్కిలులో కొన్ని వంటశాలలను తనిఖీ చేయాలి.

69 సెక్షన్: తాలూకా రిలీఫ్ ఆఫీసరు: రిలీఫ్ పనులు (ఎక్కువగా రివిన్యూశాఖ యాజమాన్యమున జరుగు) గ్రాటిమస్ రిలీఫ్ యేర్పాట్లు సరిగా వున్నాయా లేదా అని చూడాలి. సర్కిల్ ఆఫీసర్ పనులను తణిఖీ చేయాలి. గ్రామాలలోకి వెళ్ళి కరువు, వంటశాలలు ఎలావున్నాయో తనిఖీ చేయాలి.

సెక్షన్ 81: కరువు బాధితులు కరువు నివారణ పనిలో చేరడానికి గ్రామ మునసబుగాని, సర్కిలాఫీసరుగాని, గ్రామ పెద్దలతో కూడిన కమిటీ గాని, అనుమతిపత్రము వ్రాసియివ్వవచ్చును.

82 సెక్షన్: ఒక కూలీ ఈ దిగువ పరిస్థితులలో చేర్చుకోడానికి నిరాకరింపబడవచ్చును. తినడానికి ధాన్యమువుండటం, 4 మైళ్ళ దూరంలో నున్న క్యాంపులో చేరతాననడం, 10 మైళ్ళదూరంలో క్యాంపువుండటం, ఈ మూడువరిస్థితులూ, వుంటే చేర్చుకొన నిరాకరింపవచ్చును.

85 సెక్షన్: రిలీఫ్ పనులు రెండు విధాలుగా చేయించవచ్చును.

1. టాస్కుపద్ధతి అంటే పనియొక్క ఫలితాన్నిబట్టి కూలియివ్వడం,
2. పీస్‌వర్కు. అంటే గుత్తపద్ధతి.

88 సెక్షన్: చార్జి ఆఫీసరు. కరువుక్యాంపు మొత్తం పరిపాలనను బాధ్యత వహించాలి. క్యాంపుకు కావలసిన పనిముట్లు (టూల్సు) నీటి సదుపాయాలు, వైద్యశాల, ఆరోగ్యము, కూలీలను చేర్చుకొనుట, యేమైన కంప్లెయింటులువున్న విచారించుట, కూలీలకు సరియైన భత్యములను అంద చేయుట మొదలయినవి చూడాలి.

90 సెక్షన్:- పరిశుభ్రమైన నీటి సదుపాయాలు, పాకీదొడ్లను ఏర్పాట్లు, కలరావచ్చినవారిని వేరుచేయడానికి యేర్పాట్లు చేయందే పనులు ప్రారంభించరాదు.

91 సెక్షన్: ప్రతిక్యాంపుదగ్గర హాస్పిటల్ ఏర్పాట్లు చేయాలి. లేనిచో తాత్కాలికంగా చార్జి ఆఫీసరుచూస్తూ తీవ్రమైన జబ్బులువచ్చిన వారిని దగ్గర వైద్యాలయానికి పంపాలి.

93 సెక్షన్: (ఎ) కలెక్టరు, క్యాంపులన్నిటికి ఆహార పదార్థాల సరఫరాకు అవుసర యేర్పాట్లు గావించాలి.

97 సెక్షన్: కరువునివారణ పనులలో పనులు చేయు కూలీలను ఈ విధంగా విభజించాలి. 1 వ తరగతి: త్రవ్వుట లేక దానితో సమానమైన పని. (2) వ తరగతి: మోయుట లేక తత్సమానమైనపని. 3 వ తరగతి: 12 to 14 సంవత్సరముల బాలబాలికలు.

100 సెక్షను: (ఎ) ఒక గ్యాంగు 50 మందికి పైన 100 లోపుగా వుండాలి. ఒకే కుటుంబానికి చెందినవారు, లేక ఒకే గ్రామానికి చెందినవారు ఒకే గ్యాంగులో వుండాలి. కోల్కారు (గ్యాంగుప్రతినిధి) ఆ గ్యాంగులో ఎన్నుకోబడాలి.

102 సెక్షన్: బలహీనులకు ప్రత్యేకంగా వేరుగ్యాంగు ఏర్పరచాలి.

107 సెక్షన్: బలహీనులు సగంపని జేసినా చాలును.

110 సెక్షన్: ప్రతిరోజూ కూలీలకు కూలీ యివ్వాలి.

116 సెక్షన్: పనిచేయలేనివారి విభజన: 4 వ తరగతి: పనిచేయలేని వృద్ధులు (స్త్రీలు, పురుషులు) జబ్బుగానున్నవారు. 5 వ తరగతి: (ఎ) పని చేయలేని బాలురు 12 నుండి 14 సం॥ వయస్సుగలిగినవారు. (బి) 8 నుండి 12 సం॥ వయస్సుగలిగినవారు (సి) 5 నుండి 8 సం॥ వయస్సు గలిగినవారు. (డి) 1 సం॥ నుండి 5 సం॥ వయస్సుగలిగినవారు. (ఇ) 1 సం॥లోపు పిల్లలు.

124 సెక్షను: వారమునకొక రోజు శెలవుదినము. ఆరోజు సెలవు భత్యము యిస్తారు.

132 సెక్షను: గర్భిణీస్త్రీలు ప్రసవించడానికి పూర్వము, ప్రసవానంతరము కొన్నిరోజులు పనిలోనికి రానవసరంలేదు. ఎన్నిరోజులు రానవసరంలేదనే విషయం క్యాంపులోని మెడికల్ ఆఫీసరు సలహానుబట్టి వుంటుంది. పనిలోనికిరాని దినాలకు భత్యముయిస్తూ వుండాలి. రెండు రూపాయలు వైద్యసహాయాని కివ్వాలి.

134 సెక్షన్: వైద్యపరీక్ష చేయించుకొనే సమయమున పనిచేయడానికి వాతావరణము బాగుండని సమయమున కూలీలందరకు (పనిచేయలేనివారికిచ్చే) భత్యము యివ్వాలి. పిల్లలకు జబ్బుగా వున్నప్పుడు ఆ పిల్లల తల్లులకు శెలవు యిస్తూ యీ భత్యాన్నే యివ్వాలి.

114 సెక్షన్: అత్యవసర సమయాలలో గ్రామమునందు కొంత మందికి భత్యాన్ని యివ్వవచ్చు. తరువాత సర్కిలు ఆఫీసరుతో ఆమోదింప జేసికోవాలి.

148 సెక్షన్: భోజనమునకువచ్చు బాలురు, వృద్ధులకు 5 మైళ్ళ కంటె ఎక్కువ దూరములో వంటశాలలుండరాదు. వర్షాకాలములో యెక్కడ వంటశాలవుంటే ఆ గ్రామానికే పరిమితి చెయ్యాలి.

159 సెక్షన్: విజిటర్సు: శాసనసభా సభ్యులు, జిల్లాబోర్డు సభ్యులు, స్థానికరిలీఫ్ కమిటీసభ్యులు, మునిసిపల్ కౌన్సిలర్లు విజిట్ చేయవచ్చును.

180 సెక్షన్: వ్యవసాయదారులకు లోన్సు యిచ్చే పద్ధతిని అనుసరించి పశువులకు మేత, పశువులను, విత్తనాలను, ఖరీదు చేయడానికి లోను యివ్వాలి.

187 సెక్షన్: పశువులకు మేత, కరువువచ్చినప్పుడు వెటర్నరీ డిపార్టుమెంటు యాజమాన్యమున పశువులకు క్యాంపుపెట్టవచ్చు. మంచి ఆవులను, యెద్దులను సెలక్టుచేయాలి. జిల్లాకలెక్టరు కొన్ని ఆవులను యెద్దులను కొని మరల కరువుపోయిన తరువాత అమ్మవచ్చును.

కోల్కారు: 50 మొదలు 100 లోపుగా వుండే గ్యాంగుకు ప్రధాని. మేస్త్రి. 4 గ్యాంగులపై తనిఖీచేయువాడు.

వర్కు ఏజంటు: క్యాంపులో పనులకొలతలు తీయుట బిల్లులు తయారుచేయుట, పనినిర్ణయించుట, మేస్త్రీలపని తనిఖీచేయుట ఇతని బాధ్యత.

డాక్టరు: క్యాంపులోవున్న కూలీల ఆరోగ్యమును గురించి శ్రద్ధ వహించును. తీవ్రంగా జబ్బుగావుంటే హాస్పిటలులో చేర్చాలి.

వంటశాల సూపరింటెండెంటు: పనిచేయలేనివాళ్ళకి తగినంతవారికిగా భోజనము అందజేయాలి. ఇండెంటు ప్రకారము పదార్థములు తీసికోవడం, పిల్లలకు సరిగా అందినదీ లేనిదీ జాగ్రత్త తీసికోవడం చేయాలి.

ఫామిన్ కమిషనర్: రాష్ట్రమంతటికీ కరవు క్యాంపుల విషయంలో సర్వాధికారి.

క్యాంపులలో ఆచరణలోనున్న లోపాలు.

(1) ప్రతిదినమూ హాజరు వేసేటప్పుడు కోలాకారు, మేస్త్రీ కలిసి 80 మందివస్తే 100 వచ్చినట్లు వేస్తారు. ఈ విధంగా ఎక్కువ హాజరువేసి, రాని కూలీల భత్యములు కోలాకార్లు, మేస్త్రీలు (కొన్నిచోట్ల చార్జి ఆఫీసరుకు కూడా ఇందులో భాగముంటుంది) పంచుకుంటారు. దీనివలన కూలీలు తమ గ్యాంగులకు యిచ్చిన టాస్కు పూర్తి చేయజాలరు. (100 మంది పనిని 80 మంది చేయవలసి వస్తుందిగాబట్టి) అప్పుడు వారి కివ్వవలసిన రోజు కూలీలో (తమ పని పూర్తిగా చేయక పోవుటచే) కోతకోసి తక్కువ కూలి యిస్తారు. చార్జి ఆఫీసరు సరిగా తనిఖీచేస్తే ఈ లోపాల్ని తేలికగా సరిచేసికోవచ్చును.

(2) ప్రతిదినము కూలి యివ్వక ధాన్యమురాలేదని, డబ్బురాలేదని, అశ్రద్ధ చేయడం జరుగుతుంది. దీనివలన ఏనాటి కానాడు ధాన్యము తీసుకొనివెళ్ళి తినవలసిన వీళ్ళు ఉపవాసములుండవలసి వస్తుంది. మరునాడు తిండిలేక పని చేయలేకపోవడం జరుగుతుంది. ఇదంతా ప్రధానంగా చార్జి ఆఫీసరు అశ్రద్ధయే.

(3) వంటశాలలో వంట సూపరెంటెంటు పిల్లలకు, వృద్ధులకు ముద్దలు సరిగాయివ్వక తగ్గించి యిండెంటు ప్రకారము వచ్చిన పదార్థములన్నింటిని కాజేయడం, పిల్లలకు యివ్వవలసిన కానులు యివ్వకపోవడం సెలవుదినం భృతి సరిగా యివ్వకపోవడం జరుగుతుంది.

(4) పాకలు (షెడ్సు): ప్రతిక్యాంపు దగ్గర పని సేసే వేలమంది కూలీలు, స్త్రీలు, పిల్లలు, మధ్యాహ్నం విశ్రాంతిసమయంలో మండు టెండలో మాడవలసివస్తుంది. పాకలు నామమాత్రంగా కొన్నిచోట్ల వుంటాయి. కొన్నిచోట్ల అవికూడా వుండవు.

(5) మంచినీటి సదుపాయాలు సరిగావుండవు. చాలినన్ని బండ్లను ఏర్పరచి మంచినీళ్ళను సప్లయిచేయరు. మంచినీళ్ళ బావులలో వంకలలో నీటిని శుభ్రపరచు మందులను వేయడం జరుగదు. ఎప్పుడో కలరా వ్యాధి వ్యాపించిన తరువాత ఈ జాగ్రత్తలు తీసికోబడతాయి.

(6) వైద్యసహాయం సరిగావుండదు.

(7) కూలీలను అసభ్యంగా చూడడం.

(8) ధాన్యము సప్లయి చేయకుండా డబ్బుయిచ్చుట.

(9) క్యాంపులలోనున్న హాస్పిటలులో మందులు లేకపోవడం.

(10) బలహీనులకు ప్రత్యేక గ్యాంగులు పెట్టకపోవడం.

(11) కోల్కారులు ఎన్నుకోబడకుండా చార్జి ఆఫీసరు ఇష్టంవచ్చిన వానిని నామినేటు చేయడం.

(12) కోల్కార్లు-గింజలు కొల్వడంలో కూలీలకు అన్యాయాలు చేయడం.

(13) పశువులను పోషించుటలేదు.

(14) ప్రభుత్వము రైతులకు విత్తనాలకు యిచ్చు ఋణం ఆచరణలో పూర్తిగా లేదు.

(15) చార్జి ఆఫీసరు అతని బాధ్యతల నన్నిటిని చూడక క్యాంపులలో జరిగే అన్యాయాలు పోగొట్టక, కూలీల కష్టాల నివారించక కూలీలపై, కోల్కారులపై దౌర్జన్యము చేయుట జరుగుతుంది. చార్జి ఆఫీసరు లైను మీదకు వెళ్ళినప్పుడు కూలీలు వారి పని పూర్తిచేసుకొని కూర్చున్నా ఎన్ని వందలమందికైనా నాగాలు వేయడం జరుగుతుంది.

## రైతు సేవకులకు కొన్ని సలహాలు.

రైతు సేవకులు పై లోపములను యెలా పోగొట్టాలి? కరువు ప్రాంతములలో కరువు నివారణ పనులను ప్రారంభించుటకు యెలా పనిచేయాలి? శాశ్వతంగా కరువులు రాకుండా చెయ్యాలంటే మన రైతు సంఘ నినాదా మేమిటి? ఈ ప్రాంతములలో రైతు ఉద్యమాన్ని బలపరచుటద్వారా ఎలా ఈ కరువులనుండి బయటపడడానికి తోడ్పడగలము? అనేవి యిప్పుడు మన ప్రధాన చర్చనీయాంశములు —

పంటలు పోయినట్లు డిశంబరు నెలలోనే తెలియగలదు. అప్పటి నుండి ఆ ప్రాంతములలో ఎన్నివంతులు పండింది, లెక్కలు తయారు చేయాలి. పంటలు బాగా దెబ్బతింటే పూర్తి రెమిషన్ కావాలనే ఆందోళన ప్రారంభించాలి. ప్రభుత్వాన్ని ఆ ప్రాంతాన్ని కరువుప్రాంతంగా ప్రకటించాలని, కరువుక్యాంపులు పెట్టాలని కోరాలి. ఆ కరువుపనులు అక్కడ శాశ్వతంగా కరువు నివారణకు, వ్యవసాయాభివృద్ధికి తోడ్పడు ప్రాజెక్టులు, చెరువులకు మరమ్మతులు మొదలగు పనులను స్పష్టమైన సూచనలను ప్లానుల తోసహా జిల్లా కలెక్టరుకు అందజేయాలి. కలెక్టరు మార్చిలో రెవిన్యూ బోర్డుకు పంపే రిపోర్టులో మన సూచనలు పంపేటట్లు చూడాలి. బలమైన

ప్రజాసమీకరణ చేయుటద్వారానే మన సూచనలు ప్రభుత్వముచే అంగీకరింప బడగలవనే విషయాన్ని రైతువర్కర్లు మరువరాదు. ఈ ప్రాంతములలో మనము ఈ పనులు నిర్వహించాలి.

(1) పూర్తి రెమిషన్ యివ్వాలని (2) కరువుపనులు రాళ్లు పగులగొట్టుటగాక ప్రాజెక్టు నిర్మించుట, చెరువులు త్రవ్వించుట, బావులు త్రవ్వించుట మొదలగు శాశ్వతకరువు నివారణోపాయాలు చేయాలి (3) వెంటనే రిలీఫ్ పనులు ప్రారంభించాలని ఆందోళనచేయాలి. (4) అన్ని పక్షాలకు చెందిన ప్రజా సంస్థలతో, గ్రామ, తాలూకా, జిల్లా రిలీఫ్ కమిటీలను యేర్పాటుచేసి పని చేయించాలి. (5) ఎప్పటికప్పుడు ఈ రిలీఫ్ ఫామిన్ కమిటీల ద్వారా అక్కడి పరిస్థితులను పత్రికా ముఖమునను, ఇతర ప్రజాసంస్థలకు ప్రకటనలను పంపించాలి. (6) ఫామిన్ కమిటీల సహాయంతో స్థానిక భూస్వాములతో కొంత పెట్టుబడి పెట్టించి, పనులు కల్పించుట, చౌకధాన్యము అమ్మించుట, విత్తనములు యిప్పించుట చేయించాలి. వెలుపలినుండివచ్చే వస్త్రం, ధనము, నూనె మొదలగు సహాయమును కరువుచే బాధపడువారికి అందజేయాలి. (7) ఇతర ప్రాంతములలో పనిచేయురైతు సేవకులు తమ ప్రాంతములలోనున్న అన్ని వర్గ ప్రజలను (జమీందారులతో సహా) కలిసికొని ధనము, ధాన్యము, బట్టలు వసూలుచేయాలి. కరువు ప్రాంతపు ప్రజల ప్రతి కోర్కెను యిక్కడి ప్రజలలో ప్రచారంచేసి బలపరచునట్లు చేయాలి. (8) అధికార, అనధికార్ల విజిటర్లను క్యాంపుల దగ్గరజరిగే అన్యాయాలను మహజరుద్వారా అందజేయాలి. డిప్యుటేషనులు వెళ్ళాలి. రైతుసేవకులు కరువు క్యాంపులలోను, ఆ ప్రాంతములలోను దైనందిన సమస్యలు తీసికొని పని చేయుటద్వారా ఆ ప్రజలందరిని రైతుసంఘములోనికి ఆర్గనైజు చేయాలి. రైతుసంఘ ఆశయాలను, కరువు ప్రధానకారణాలను, సంఘ ఆవశ్యకతను ప్రచారము చేయాలి. వారందరు రైతుసంఘమువెనుక ఐక్యమగుటద్వారానే వారి

కోర్కెలు నెరవేరుతాయని ఋజువుచేయాలి. ఈ దృక్పథంతో పని చేయక కేవలము జీవకారుణ్యదృష్టితోనే పనిచేసినయెడల ఆ ప్రజల నంద రను, రైతుసంఘ నాయకత్వాన సమీకరించలేము. ఆ ప్రాంతములోనున్న రైతులు, కూలీలు, శాశ్వతంగా కరువును గురియగు స్థితిలోనే వదలి పెడతాము. ఆ ప్రాంతములోనున్న ధనికరైతులను; వారిచే ధాన్యము యిప్పించే సందర్భములలో, విత్తనాలు యిప్పించే సందర్భాలలో ప్రస్తుత దేశరక్షణలో రైతులు, కూలీలు అధికోత్పత్తి చేయుటంద్వారా తమ పాత్రను ఎలా నిర్వహించగలరో నొక్కిచెప్పాలి. ధనికరైతులు ఈ సంద ర్భంలో ముందుకు వచ్చి దేశభక్తిని ప్రదర్శించకపోతే వచ్చే దుష్ఫలితా లను చెప్పాలి.

ఈవిధంగా పనిచేస్తే కరువు క్యాంపులో అన్యాయాలను పోగొ ట్టుటేగాక శాశ్వతంగా కరువును తగ్గించడానికి తోడ్పడతాము. రైతు వుద్యమాన్ని బలపరుస్తాము.

---

# రైతు కూలీ సామరస్యము.

(1) రైతులు, వ్యవసాయకూలీలు వ్యవసాయమును ప్రధానవృత్తిగా పొంది జీవించువారు. వీరు యిరువురు ఒక వర్గమునకు చెందినవారయ్యు కాలక్రమేణ కొంతమంది భూమిని కోల్పోయి, వ్యవసాయ కూలీలుగను, కొంతమంది బీదరైతులుగను, మధ్యతరగతి రైతులుగను, ధనికరైతులుగను, అంతరము యేర్పడి, వ్యవసాయకూలీలు, రైతులు వేరని తలచుట జరుగు తోంది. బ్రిటిష్ సామ్రాజ్యవాద ఆర్థిక విధానమువల్లను, జమీందారుల దోపిడివల్లను, ధనికుల (వడ్డీ) అప్పులబాధవల్లను, పరిశ్రమల అభివృద్ధి లేకపోవుట, చేతిపరిశ్రమలు పడిపోవుటవల్లను, జనాభా వృద్ధివల్లను, రైతులు

తమ భూములను కోల్పోయి వ్యవసాయ కూలీలుగా మారుతున్నారు. భూమికి వత్తిడి యెక్కువైనది. పెట్టుబడిదారీ విధానవ్యాప్తికి సామ్రాజ్య వాదము ఎక్కువ అవకాశములు యివ్వనందువల్ల, భూమిలేని కూలీలు పారిశ్రామిక కూలీలుగా వెళ్ళడానికి వీలులేనందున భూమిమీద పనిచేసి జీవించవలసి వస్తోంది. ధనికులుకూడా తమ పెట్టుబడిని పరిశ్రమలమీద గాక వ్యవసాయముమీద మరల్చవలసి వచ్చింది. ఈ దోపిడి ఆర్థిక విధానమువల్ల రోజురోజుకూ రైతులు అధికంగా దిగజారి కూలీలుగా మారుతున్నారు. 1921 లో 2 కోట్ల 17 లక్షలువుంటే 1931 లో 3 కోట్ల 35 లక్షలువున్నారు. ఈసంఖ్య దినదినమూ ఎక్కువగుతోంది. డెల్టా ప్రాంతాలలో 100 కి 50 మంది వ్యవసాయ కూలీలే వుంటారు.

(2) భారతదేశము మొత్తంమీద ఆంధ్రదేశములో వ్యవసాయ కూలీ వుద్యమము మొదట బయలుదేరింది. ఆంధ్రలోకూడా ప్రత్యేకంగా డెల్టా ప్రాంతములోని కూలీలే యెక్కువ చైతన్యముకలిగి వారు ప్రత్యేక సంఘాలు పెట్టుకుంటున్నారు. దీనికి కారణము వ్యవసాయము చేయు పద్ధతులలో; ఉత్పత్తి సాధనాలలో అభివృద్ధి జరగడం; (నీరుపారుదల అవకాశాలు అభివృద్ధి జరగడం) ప్రస్తుత రైతాంగ ఆర్థిక విధానములో వ్యవసాయము ఎంతవరకు అభివృద్ధిచెందాలో అంతవరకు అభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధికర ఉత్పత్తి విధానములో భూమియొక్క కేంద్రీకరణ త్వరగా జరుగుతోంది. పనిచేయని భూముల సంఖ్య పెరుగుతోంది. రైతులు వ్యవసాయ కూలీలుగా త్వరగా మారిపోతున్నారు. అందుచే ఈవ్యవసాయ కూలీలు పెద్ద రిజర్వుసైన్యముగా గ్రామాలలో తయారవుచున్నారు. వీరు సంవత్సరములో కొన్నిమాసములు నిరుద్యోగులై కరువుతో బాధపడవలసి వుంది. మెట్టప్రాంతములలో పురాతన వ్యవసాయ పద్ధతులుండుటచే వ్యవసాయ కూలీలుగామారుట నెమ్మదిగా జరుగుతోంది. భూమికొరకు తహతహలేదు. కొద్ది, గొప్ప భూమి యెక్కువమందికి వుంటుంది. రైతులకు

జీవనం జరగడం కష్టం. అందుచే మెట్టప్రాంతములలో వ్యవసాయకూలీలు రైతులనుండి తాము వేరని అభిప్రాయపడనందుననే ప్రత్యేక కూలీ ఉద్యమాన్ని నిర్మించలేదు.

(3) రైతులు, కూలీలు ఒకే ఆర్థిక విధానమువల్ల బాధపడుతున్ననూ, నేటిరైతులు రేపు కూలీలుగా మారుచున్ననూ, తమ యిద్దరిని దోచుకొనే ప్రధాన శత్రువులెవరో తెలిసికొనలేక ఒకరినొకరు వ్యతిరేకముగా భావిస్తున్నారు. పైవర్గములచే దోచుకొనబడు రైతు స్వరక్షణకై వ్యవసాయ కూలీలను దోచుకోడానికి ప్రయత్నిస్తాడు. ఈవిధంగా ఒకరినొకరు వ్యతిరేకమై యిరువుర ప్రయోజనాలను ఆహుతిచేసికొని జమీందారు, ప్రభుత్వ ధనికుల దోపిడీలకు గురియగుచున్నారు. రాజకీయ చైతన్యము లేకపోవడం ప్రధాన కారణం కాబట్టి ఒకే ఆర్థిక విధానానికి గురియైన వారిరువురు చేతులు కలిపి రైతుకూలీ సామరస్యాన్ని సంపాదించిననాడే యిరువుర బాధలు తొలగుతాయి.

(4) ప్రత్యేక సంఘాలు:—రైతులు, కూలీలు యిరువురు రాజకీయముగా వెనుకబడి వుండుటచే ప్రస్తుతము చాలా ప్రాంతాలలో వేరు సంఘాలు కావాలని, తమ ప్రయోజనాలు వేరని అభిప్రాయ పడుతున్నారు. వ్యవసాయ కూలీలు తాము వేరని అభిప్రాయపడుచోట మనము వేరే సంఘాలద్వారా ఆర్గనైజు చేయుటద్వారానే సామరస్యము నెలకొల్పగలము. అటువంటిచోట్ల మనము వేరే ఆర్గనైజుచేయనిచో ఆ కూలీలు పెడమార్గాన పోయి రైతు వ్యతిరేక సంఘాలుగా తయారుగావడానికి అవకాశముంది. మెట్టప్రాంతాలలో భూమిలేనివారు ఒక ముఠాగాతయారై వారు వ్యవసాయ కూలీ సంఘము వేరే కావాలంటేతప్ప పెట్టకూడదు. అక్కడ రైతు సంఘాలలోనే చేరుస్తాము. ఉదా:-మునగాల, తిరువూరు, విశాఖపట్టణం, నైజాము, రాయలసీమ.

(5). ప్రారంభదశలో మతాలు, కులాలు, వర్గపోరాటమును మభ్య పరుస్తాయి. వర్గవిభజన ననుసరించి స్పష్టంగా విడిపోరు. ఈదశలోనే అనేక మంది కులతత్వవాదులు, మతవాదులు, ఆ కులాల, మతాలపేరుతో కూలీ, రైతులను తప్పుడుమార్గాల పట్టించడము జరుగుతుంది. ఈ యిదరి కలయికను భయపడు అభివృద్ధి నిరోధకముఠాలు, స్వార్థపరులు ఈ యిరువురమధ్య పోరాటము రేకెత్తించగలరు. వ్యవసాయ ప్రధానమైన భారతదేశములో 100 కి 80 జనాభాగల రైతు, కూలీ విప్లవ ప్రజానీకమును, స్వాతంత్ర్య పోరాటములో ప్రధాన జాతీయశక్తిగా నెంచవలసియుంది. దేశంయొక్క భవిష్యత్తు ఐక్యతమీదనే ఆధారపడివుంది.

నేడు మన ప్రధాన రాజకీయనినాదము జాతీయైక్యత. మనరాష్ట్రంలో జాతీయైక్యత అంటే కాంగ్రెసు, లీగు ఐక్యతను గుర్తుగా తీసుకోరాదు. రైతు, కూలీఐక్యతే మనరాష్ట్రంలో జాతీయైక్యతా నినాదముయొక్క అర్థం. రైతు కూలీ ఐక్యత మన గమ్యస్థానంగాదు. నేటి చారిత్రిక అవసరం. ఐక్యతద్వారానే నేడు దేశాన్ని యెదుర్కొన్న సంక్షోభమునుండి బయట పడగలము. రైతు, కూలీ సామరస్యంద్వారా సాధించిన ఐక్యత విశాల జాతీయైక్యతకు బలమైన పునాది. రైతుకూలీ ఐక్యతయే ఆహారసమస్యను పరిష్కరించగలదు. గ్రామ, పట్టణ ఐక్యతకు పునాది వేయగలదు. అప్పుడే జాతీయ నాయకులకు విడుదల చేయించగలము. దేశరక్షణ చేయగలము.

దేశరక్షణలో రైతు, కూలీలవంతు అధికోత్పత్తి చేయుడమే. ప్రజలకు, సైన్యాలకు ఆహారమును అధికముగా వుత్పత్తిచేయడమే, నేడు రైతు, కూలీల పవిత్ర జాతీయధర్మము. "అధికోత్పత్తి చేయడమే జాతీయధర్మము" అనే నినాదమును అమలుజరుపుట ద్వారానే రైతు, కూలీ సామరస్యాన్ని సాధించగలము. ఈ నినాదముతోనే రైతు, కూలీలను సమీకరించగలము. మార్చినెలలో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సాధారణ సమా

దేశములో రైతు, కూలీ సామరస్యాన్ని సాధించుట ఒక ప్రధానబాధ్యతగా నిర్ణయింపబడింది. జిల్లా వ్యవసాయ కూలీ సంఘాలను, రాష్ట్ర రైతుసంఘానికి అనుబంధ సంఘాలుగా యేర్పరచాలనీ, రైతులకు, కూలీలకు రాష్ట్ర రైతుసంఘము సమిష్టి నాయకత్వమువహించే సంస్థగా పెంపొందాలని తీర్మానించింది. ఈతీర్మానము రైతు, కూలీ సామరస్యాన్ని సాధించాలని ఇచ్చిన నినాదాన్ని అమలుజరుపుటలో ప్రధాన అభ్యంతరాలేమిటో చూడవలసియున్నది.

## రైతు, కూలీ సామరస్యాన్ని ఎలా సాధించాలి?

రైతు, కూలీలు రాజకీయంగా వెనుకబడియున్నారు. వీరి అజ్ఞానాన్ని ఆధారంగా జేసికొని కొంతమంది స్వార్థపరులు, కూలీలలోను, రైతులలోను ప్రవేశించి స్థానాన్ని సంపాదించి కూర్చున్నారు. వీరు కూలీలలో కూలీలను రైతులలో రైతులను, రైతు, కూలీలమధ్య ఐక్యత, సామరస్యంలేకుండా ద్వేషములు పురికొల్పుతున్నారు. తమ స్వార్థ ఆశయాలకొరకు రైతు, కూలీలను బలిపెట్టుచున్నారు. ఉదాహరణకు:_వ్యవసాయ కూలీలలో ఆదిమాంధ్ర సంఘము, క్రిస్టియన్ ఫెడరేషను, సహపంక్తి భోజనములని కూలీలను మోసగించే సంస్కరణవాదులు, ఫార్వర్డ్ బ్లాకు మొ॥ పంచమాంగదళము, రైతు వ్యతిరేకత ప్రబోధముచేయు గ్రూపులు యెన్నోవున్నాయి. రైతులలో, రంగాముఠా; పుష్టి 200 రూ. కావాలనే స్వార్థపరులగు జస్టిస్ పక్ష ప్రముఖులు, గుంటూరుసీమ రైతుసంఘము మొదలగువారుగలరు. ఈ ముఠాలన్నింటిని రైతులనుండి, కూలీలనుండి వేరుచేయవలసి వుంది. రైతులు, కూలీలు వుభయులు అధికోత్పత్తిని జాతీయధర్మంగా తీసికొనడం ద్వారానే వీరిరువురు ఐక్యమవుతారని పైన ఉదహరించాము. రైతులు వ్యవసాయ కూలీలు యిరువురు కలసిమెలసి వ్యవసాయాన్ని నిర్వహించినప్పుడే అధికోత్పత్తి కార్యక్రమము అమలుజరుగుతుంది. వ్యవసాయకూలీలు వుత్సాహ

ముతో అర్థోత్పత్తి చేయడానికి, రైతులు ముందు చొరవతీసికొని వారిమధ్య అభ్యంతరములను తొలగించవలసియున్నది. ఇప్పుడు, ప్రధానంగా రైతు కూలీల మధ్య భేదాలకు కారణంగావుంది కూలిరేటు. కూలీరేటు నిర్ణయము వల్ల యిరువురమధ్య సఖ్యత యేర్పడుతుంది.

కూలి రేటు.

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ తీర్మానములో ఒక రేటు నిర్ణయింపబడింది. వరి ధాన్యపుబస్తా ఎన్ని రూపాయలు అమ్మితే అన్ని అణాలు యివ్వాలని, కూలీలు రోజుకు 7 గంటలు నికరంగా పనిచెయ్యాలని తీర్మానములోవుంది. ఈ కనీసరేటును ఆధారంగా తీసికొని రైతురంగములో పనిచేయువారు, కూలీరంగములో పనిచేయువారు, కృషిచేయాలి. ఈ రెండు రంగములలో పనిచేయు కామ్రేడ్స్ యిరువురమధ్య ఈకూలీరేటు నినాదాన్ని ప్రచారము చేసి ఆత్మవిశ్వాసంతో పనిచేస్తే తప్పక జయంపొందుతాము. ఈ తీర్మానము చేసిన తరువాత జరిగిన 5 మాసముల అనుభవము దీనినే రుజువుచేస్తోంది. చాలా గ్రామాలలో కూలీరేటు విషయంలో రాజీజరిగింది. ఈ తీర్మానము అమలులోవుంది. ఈ తీర్మానము అమలుజరుగనిచోట్ల వర్కర్లలోపము తప్ప మరియొకటిగాదు. రైతులలోపనిచేయు కామ్రేడ్స్ ధాన్యపురేటు ననుసరించి కూలీరేటును హెచ్చించాలని రైతులలో ప్రచారము చేయడానికి వెనుకంజ వేయుటవల్ల, కూలీలలో పనిచేయు కామ్రేడ్స్ హైముప్రకారం పనిచేయడాన్ని, 7 గంటలు పనిచేయడాన్ని, ప్రవేశపెట్టి అలవరచలేకపోవుటవల్ల రైతులలో యేమీ ప్రచారం చేయకుండానే, ముందుగా రైతులను కలిసికోకుండానే, కూలీరేటు హెచ్చించాలనడంవల్ల, రైతు కూలీ సామరస్యానికి బదులు రైతు, కూలీ కలహాలతో అంతమొందుతుంది. రెండు రంగములలో పనిచేయు కామ్రేడ్స్ రెండు రంగములలోనూ ఇరువుర కోర్కెలను ప్రచారముచేసి యిటు రైతులతోనూ, అటు కూలీలతోనూ అంగీకరింపజేయాలి. బహిరంగ వేదికలద్వారా ప్రచారమునకు ముందు వ్యక్తులతో సంభాషణ

చేయుటద్వారాను, ఇంటింటికివెళ్ళి ప్రచారముచేయుట ద్వారాను, రైతులను, కూలీలను త్వరగా ఒక అభిప్రాయానికి తీసుకురావడానికి వీలుంటుంది. చివరకు సంయుక్త సమావేశాలు జరుపుటద్వారా ఇరువురు ఒక నిర్ణయానికి వచ్చేటట్లు చేయాలి.

## రైతులలో పనిచేయు కామ్రేడ్స్.

(1) వ్యవసాయ కూలీలకోర్కె సక్రమమైనదని, ధాన్యపు రేటు కనుగుణ్యంగావుందని (2) సరియైన రేటు యిచ్చినప్పుడే కూలీలు ఖచ్చితంగా 7 గంటలు పనిచేసి వ్యవసాయము తమదను భావముతో పనిచేస్తారని (3) రైతులు అధికోత్పత్తి చేయడానికి ఈ కూలీరేటు ఇవ్వడం ఎంత అవసరమో (4) యివ్వనట్లయితే కూలీలను పంచమాంగదళము, స్వార్థపరులు యీలా రైతులకు వ్యతిరేకంగా త్రిప్పుతారో (5) దోపిడీలు, దొంగతనాలు, అరాజకము యేర్పడుతుందని, అసలు రైతులు కూలీలకు న్యాయమైన రేటు యివ్వడంద్వారా ఆర్థికంగా పతనమవ్వడంలేదనే విషయం రుజువుచెయ్యాలి.

## కూలీలలో పనిచేసే కామ్రేడ్స్.

(1) కూలీలు ఖచ్చితంగా 7 గంటలు పనిచెయ్యడం, పొలములో చేయవలసిన పని తమదని భావించినప్పుడే రైతులు, కూలీలు అడిగినరేటు తప్పకుండా యిస్తారని (2) కూలీలు సంఘాలుగావుండి ఐక్యతతో పెట్టిన కోర్కెలు రైతులు గుర్తిస్తారని, కూలీలు ఐక్యతగాలేనిచో వారికోర్కెలు తీరవని చెప్పాలి. (3) సమ్మె చేయుటవలన అధికోత్పత్తి కుంటుపడుతుందని ఆహారసమస్య తీవ్రమౌతుందని (4) అధికోత్పత్తి చేయడం తమకు పుష్కలంగా ఆహారము లభించుటకు, కరువుతోమాడిపోవు ప్రజలకు, యుద్ధరంగములో పనిచేయు తమ పుత్రులకొఱకు (100 కి 90 మంది కూలీలే యుద్ధము లోవున్నారు గాబట్టి) అవసరమని చెప్పాలి.

## సంయుక్త సమావేశాలు.

రైతు కూలీ సామరస్యాన్ని చేకూర్చుటలో, సాధించుటలో సంయుక్త సమావేశములు ప్రధానపాత్ర వహిస్తాయి. యిరువుర కోర్కెలు ముఖాముఖిని చర్చించుకొని అర్థంచేసుకొని ఒక నిర్ణయానికి రావడానికి, సందేహాలు పోగొట్టుకోడానికి, వుపయోగిస్తాయి. అందుచే రాష్ట్ర, జిల్లా, తాలూకా, గ్రామ రైతు, కూలీ సంఘాలు ఈ విషయాన్ని గుర్తించాలి. ఎక్కువగా గ్రామ సంఘాలకు తప్ప మిగిలిన పై సంఘాలకు సంయుక్త సమావేశాలకు కొద్దిమంది ముఖ్యులను, సౌహార్ద్ర ప్రతినిధులుగా ఆహ్వానింపవచ్చును. రాష్ట్ర రైతు సంఘ సమావేశాలకు, జిల్లా రైతు సంఘ సమావేశాలకు, జిల్లా వ్యవసాయ కూలీ ప్రతినిధులను, తాలూకా రైతుసంఘ సమావేశాలకు తాలూకా వ్యవసాయ కూలీ ప్రతినిధులను ఆహ్వానించాలి. ఇదేవిధంగా వ్యవసాయ కూలీ సంఘ సమావేశాలకు రైతుసంఘ ప్రతినిధులను ఆహ్వానించాలి. గ్రామములలో యెక్కువగా ప్రతి సమస్య మీదా సంయుక్త సమావేశాలు జరుపవలెను. యిరువురకు సంబంధించిన విషయములపై చర్చలు జరపడం, నిర్ణయాలు తీసికోవడం జరగాలి. కొన్ని విషయాలలో జాయంటు కమిటీలను వేయాలి. సమిష్టి ఆందోళన, సమిష్టి ప్రచారము చేయాలి.

## సమిష్టి ఆందోళన, ప్రచారము చేయవలసిన సమస్యలు :

(ఇరువురకు సంబంధించినవి)

(1) బంజరుభూములు ప్రభుత్వందగ్గర నుండి, జమీందారు నుండి తీసుకొనె విషయంలో,"

(2) ఆహారసమస్యను పరిష్కరించడానికి, ఆహారకమిటీలు ఏర్పరచడానికి, రేషనింగు అమలు జరుపడానికి, ప్రజారక్షణ దళాలను ఏర్పరచడానికి, "తిండిదొంగలను బహిరంగ పర్చడానికి, ప్రజలకు, సైన్యానికి ఆహారం కొఱకు, అధికోత్పత్తి చేయుటకు,

(3) చౌకడిపోలు, మందులు, బట్టలు, అప్పు, గ్రామసౌకర్యాలు అంటువ్యాధులు, విద్య మొదలగునవి.

## రైతు కూలీ సభలు :

వేరువేరుగా రైతులసభలు, కూలీల సభలు జరిగినప్పుడు, రైతుల సమావేశాలలో కూలీలకోర్కెలు, కూలీల సమావేశాలలో రైతులకోర్కెలు బలపరచాలి. ప్రజలతోకూడిన ఈ సభలలో రెండుపక్షాల నాయకులు మాట్లాడాలి. వ్యవసాయకూలీ సమావేశాలలో రైతునాయకులు మాట్లాడాలి కూలీ సంఘ కోర్కెలను రైతు సంఘము బలపరుస్తుందని స్పష్టం చేయాలి.

ఈ సమావేశాల ఫలితంగా సమిష్టి ఆందోళనా ప్రచార ఫలితంగా (1) రెండు రంగములలో పనిచేయు కామ్రేడ్స్‌లో యిరువుర సమస్యలపై ఒకే అభిప్రాయము, సరియైన అభిప్రాయము యేర్పడుతుంది. సెక్టేరియన్ తప్పులు జరుగవు. (2) రెండు వేపులనుండి యిరువుర కోర్కెలను బలపరచుట ద్వారా రైతులలో, కూలీలలోనున్న వైరుధ్యభావముపోయి అన్యోన్య సహకార భావమేర్పడుతుంది. (3) సామరస్య విచ్ఛిన్నకులకు స్థానము పోతుంది. (4) కూలీలలో ఐక్యతచేకూరి కూలీసంఘము, రైతులలో ఐక్యత చేకూరి రైతుసంఘము బలపడతాయి. (5) ఒక బలమైన సమిష్టినాయకత్వం నిర్వహింపబడుతుంది.

## నాముపద్ధతి రద్దు : ఆహారఫండు నిల్వ :

రైతు సేవకులు నాము పద్ధతి రద్దుచేయడం, ఆహారఫండునుగాని, ధాన్యాన్ని నిల్వచేయించడం విషయంలోగాని ఎక్కువ శ్రద్ధవహించాలి. రైతు కూలీసామరస్యము సాధించుటలో కూలీ రేటునిర్ణయము తరువాత నాముపద్ధతి మాన్పించడం అనేది, రెండవ విషయంగా తీసికోవాలి. ఇప్పుడు

గ్రామాలలో నాముపద్ధతి వివిధరూపాలలో వున్నది. వ్యవసాయ కూలీలు పనిలేకుండా వుండే (సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసాలలో ఈ పద్ధతి జోరుగా వుంటుంది. అక్టోబరులో రైతులవద్ద కూలీలు బస్తా ధాన్యము తీసి కుంటే జనవరిలో మూడుతూములు, రెండుబస్తాలు యివ్వవలసి యుంటుంది. కొన్నిచోట్ల బస్తా ధాన్యము కరువు కాలములో తీసికొన్న కూలీ; వత్తిడి పనిరోజులలో ఆ రైతుకే, పనిలేని కాలములోవున్న స్వల్ప కూలీరేటుకే, పని చేయాలి. ఈ నాము పద్ధతి ఏ రూపంలోవున్నా మోటురకపు దోపిడీ విధానమనవచ్చు. సామాన్యంగా ఈ విధానాన్ని మధ్యతరగతి రైతులు, ధనిక రైతులు, చిన్న వ్యాపారస్తులు చేస్తుంటారు. కూలీల దారిద్ర్యాన్ని ఆధారంగా చేసికొని, దోచుకొనే ఈ నాము విధానాన్ని రైతాంగములో లేకుండా చేయడానికి ప్రచారము చేయాలి. దాని స్థానములో మనము రైతు, కూలీలతోగూడిన ఆహార కమిటీతరఫున (ఆహార కమిటీ లేనిచోట రైతులను వ్యక్తిగతంగా గాని) కూలీలు పనిలేని రోజులకు ధాన్యము పోగుచేయడం, లేక ధాన్యపు ఫండు పోగుచేసి ధాన్యము కొనడంగాని చేసి వడ్డీలేకుండా, నాము పద్ధతిలేకుండా మరల ఆధాన్యాన్ని జనవరిలో యిచ్చేటట్లు యేర్పాటు గావించాలి. ఎక్కువ ధాన్యము, ఎక్కువ డబ్బు వసూలైతే మార్కెటు రేటుకంటె చౌకగాను, కొంత వుచితంగాను యివ్వాలి. ఈ విషయంలో రైతు సేవకులలో ధాన్యం అదనంగా పండువారు ముందు కూలీలకు ధాన్య మివ్వడంద్వారా ఆదర్శాన్ని చూపాలి. ఈ విషయము ప్రచారము చేసే టప్పుడు పనిలేనికాలములో కూలీలకు ఆహార సదుపాయాలు చేయకపోతే, ఆకలి మంటలతో బాధపడు కూలీలు సహజంగాను, పంచమాంగ దళ దౌర్బల్యముతోను, దోపిడీలకు తయారవుతారని, అరాజకము ప్రబలి రైతు శ్రేయస్సుకు, గ్రామరక్షణకు, దేశరక్షణకు భంగము వాటిల్లునని చెప్పాలి. గత సంవత్సరము రైతులతో ధాన్యమును యిప్పించడములో చాలాచోట్ల రైతుసేవకులు జయంపొందారు. కాబట్టి ఈ విషయాన్ని రైతు సేవకులు

తక్షణం ఆచరణలోనికి తెసికొనివస్తే మనం రైతు కూలీ సామరస్యాన్ని సాధించగలము.

రైతు సేవకులు రైతు, కూలీ సామరస్యాన్ని సాధించడానికి గమనించి ఆచరించవలసిన విషయములు.

(1) కూలీ సంఘ కోర్కెలను, రైతులకోను, బహిరంగ వేదికలలోను బహిరంగపరచాలి. (2) కూలీ రేటు నిర్ణయాన్ని అమలు జరుపుటకు వెనుకంజ వేయరాదు. రైతులను ఒప్పించాలి. (3) సంయుక్త సమావేశాలు, సౌహార్ద్ర ప్రతినిధులను పిలుచుట. సమిష్టి ఆందోళన జరుపుట. (4) రైతులలో ఐక్యతవున్నప్పుడే రైతు, కూలీ సామరస్యము సాధ్యపడుతుందన్న విషయము తెలిసికొని రైతు సంఘవిచ్ఛేదకులను నిరంతర కార్యాచరణ ద్వారా బట్టబయలు చేసి, రైతులనుండి వారిని వేరుచేసి రైతులందరిని రైతుసంఘములోనికి తీసుకురావాలి. (5) అధికోత్పత్తికి కూలీలు బంజరు భూమి సాగుచేస్తుంటే, రైతులు అభ్యంతరములు పెట్టకుండా సంయుక్త సమావేశములు జరిపి నచ్చచెప్పాలి. (6) రైతులు, కూలీలు కలిసి పనిచేయడం ద్వారా, వచ్చిన ప్రతి విజయాన్ని యెత్తిచూపాలి. (7) కూలీలను రైతులు గౌరవంగా వ్యవహరించునట్లు చూడాలి. (తిట్లు, కొట్టుట మున్నగునవి రైతు కూలీ తగవులకు దారితీస్తాయి.) (8) కూలీలను ఆహారకమిటీ ద్వారాగాని, రైతులతో వ్యక్తిగతంగా గాని, పంటరోజులకు ధాన్యమును యిప్పించాలి. (9) నౌకర్లకు, కూలీలకు, సకాలములో సరియైన పాత్రంతో మంచి ధాన్యము యిచ్చునట్లు చేయుట. (10) నాముపద్ధతి రద్దుచేయడం. (11) వ్యవసాయ కూలీ సమావేశాలలో రైతుప్రతినిధులు కూలీ కోర్కెలను బలపరుస్తూ వుపన్యసించుట. (12) విద్యాలయాలకు, నీటివసతులకు, వ్యవసాయ కూలీలను రానిచ్చుట. (13) రైతు, కూలీలమధ్య సామరస్యము కేవలం పల్లెటూరి పెత్తందారుమాదిరిగాక రాజకీయ దృష్టితో సాధించాలి. (14) రైతులను రాజకీయంగా అభివృద్ధిచేయాలి. రాజకీయంగా అభివృ

చేయందే రైతు కూలీ సామరస్య నినాదప్రాముఖ్యతను గుర్తించలేరు. (15) వ్యవసాయ కూలీసంఘ తీర్మానాలు జాగ్రత్తగా చదవాలి. (16) గ్రామములలోవుండే పై వర్ణపు వ్యవసాయకూలీలు ఎక్కువగా రైతులతోనే వుంటారు గాబట్టి పై వర్ణపు (మాల మాదిగ గా) కూలీలను కూలీసంఘములో చేరమని రైతుసేవకులే ప్రోత్సహించాలి. (17) ఇవన్నీ అమలు జరగడానికి ప్రాథమిక సంఘాన్ని చురుకుగా పనిచేయించాలి.

---

# రిజిస్ట్రేషను.

## వర్కరులు ఎందుకు తెలుసుకోవాలి:

సాధారణంగా గ్రామాలలో కరణాలుగాని, కేవలం దానిమీద జీవనంచేసే మరివొకరుగాని, దస్తావేజులు యితర కాగితాలు వ్రాస్తూవుంటారు. గ్రామంలోని సర్వవ్యవహారాలు, ప్రతివారికి సంబంధించిన వ్యాపార గుట్టు వారికి తెలిసివుంటుంది. గ్రామంలో వారి స్వలాభంకోరకు, అన్యాయంగా సంపాదించే సంపాదన చెడకుండా శాశ్వతంగావుండాలని, పార్టీలు సృష్టించుతారు. వుభయ పార్టీలనుంచీ లంచాలు కాజేస్తుంటారు. యింతవరకు ప్రజలను యీరీతిగా వుంచుటకు ప్రజల ఆయువుపట్టు రిజిస్ట్రేషను ప్రజల ఆస్తులకు సంబంధించిన దస్తావేజులన్నీ వారే వ్రాయుచుండుట సర్వే చేసి భాగాలుపంచుట, చిన్నచిన్న సలహాలు చెప్పుటవల్ల రైతులు శాశ్వత బానిసలై తమస్థితి తాము గుర్తించుకోలేక పోతున్నారు. యీ దుర్మార్గం తెలిసికూడా ఎక్కడ నష్టాలు కలుగజేస్తారో అనేభయం. ఎందుకు? మరొకరు రైతులు నమ్మినవారుగావుండి యీ చిక్కులు తీరుస్తారనే విశ్వాసం కలిగించలేకపోవుటే. ఇందువల్ల గ్రామాలు అధోగతిపాలగుట, సమాజ మార్పుకు మనం నిర్మించదలచిన వర్గ చైతన్య సంఘాలను ఎదుర్కొనుట

మొదలిడుతున్నారు. ఈ కార్యాలలో మన వర్కర్లకు చొరవలేనందున మనం చెప్పినది, మంచిది, తనకోరకేనని నమ్మినా! రైతు తిరిగి ఆ మోసపు గాండ్రినే ఆశ్రయించవలసి వస్తున్నది. వర్కర్లు రైతుకు కావలసినది చేయలేక నిస్పృహ చెందుతున్నారు. అందువల్ల ప్రతి వర్కరు ప్రజలకు కావలసిన విషయాలు తెలుసుకుని ముందడుగు వేయాలంటే ఈ విషయాలు తెలుసుకోవాలి.

ఆక్టు పుట్టుక.

1882 లో (Transfer of property act) ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీయాక్టుగా వుండేది. మళ్ళీ కొన్ని మార్పులు చెందుతూ 1908 సం॥రం డిశంబరు 18 వ తేదీనుంచీ (Indian Registration Act) ఇండియన్ రిజిష్ట్రేషను అక్టుగామారి 1909 జనవరి మొదటి తేదీనుంచి రాష్ట్ర ప్రభుత్వాలు విడదీసిన భాగంలోగాక బ్రిటిష్ ఇండియా అంతటా అమలుజరుప బడుచున్నది.

ఆక్టు అవుసరం.

వ్యక్తులమాట నమ్మకంమీద మాత్రం కాపాడబడే స్వంతాస్తి, తాళ పత్రాలమీదికి, పెద్దమనుష్యుల సాక్ష్యములతో మారింది. దానితోపాటు పెట్టుబడీదారీ విధానం పెంపొందసాగింది. ఆస్తి చేతులుమారడం అధికమై హెచ్చుమందినుండి, అల్పసంఖ్యాకులకు సంక్రమింప మొదలిడింది పేచీ వ్యవహారం హెచ్చిపోయింది. ఈ వ్యవహారాలు పెంపొందకుండా వ్యక్తిగత ఆస్తికి భద్రత ఏర్పరచాలంటే కొన్ని పద్ధతులమీద రికార్డుకు కాపాడ వలసిన అవుసరం ఏర్పడింది. ఆ ఏర్పాటు జరుగుటకు కావలసిన ధనంకొరకు స్టాంపు, ఫీజు, ఏర్పరచి శాసనంగా చేయవలసివచ్చింది. క్రమేపీ ప్రభుత్వం దీనికూడా ఒక ఆదాయ పద్ధతిగా తీసుకుని స్టాంపు డ్యూటీ, ఫీజు, హెచ్చించ మొదలుపెట్టారు.

## దీని అధికారవర్గం.

సబ్ రిజిస్ట్రారు, జిల్లా రిజిస్ట్రారు, యిన్స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను (I. G.)

సబ్‌రిజిస్ట్రారువల్ల ఏమైనా అన్యాయం జరుగుట కాని, చట్ట వ్యతిరేక ప్రవర్తనగాని ఉంటే జిల్లా రిజిస్ట్రారుకు రిపోర్టు చేసుకోవాలి, ఆయన విచారణలోకూడా న్యాయం జరుగకపోతే, యినస్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషనుకు తెలియపర్చుకోవచ్చు. సబ్ రిజిస్ట్రారు రిజిస్టరు చేయనప్పుడుగాని, సరియైన కారణము రుజువుపర్చుకున్నప్పుడుగాని, సబ్‌రిజిస్ట్రారు ఆఫీసురేటు గాక ప్రత్యేక రేట్లతో జిల్లా రిజిస్ట్రారుచేత రిజిష్టరు చేయించుకోవచ్చును.

## రిజిష్టరు చేసుకోవలసినవి.

క్రియం, స్వాధీనతనఖా, అస్వాధీనతనఖా, ముద్దతుతనఖా, పట్టా (పరటా) సెటిల్మెంటు, దఖల్, హక్కువిడుదల, హామీ, దస్తావేజులు, జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ (General power of attorney) స్పెషల్ పవర్ ఆఫ్ అటార్నీ (Special power of attorney) ఫారఖత్తు, కౌలు కట్టులు, ప్రాంశరీనోట్లు, విల్ నామా (మరణశాసనం) దత్తతస్వీకారపత్రం.

## క్రియం.

రొఖ్ఖానికి అమ్ముకొనుట.

## స్వాధీన తనఖా.

అప్పుకు హామీగా భూమినివుంచి దాని ఫలసాయం [illegible]పుచ్చుకున్నవాని స్వాధీనమందే వుంచుకుని రుణం ఏర్పర్చుకొనుటకు.

## అస్వాధీన తనఖా.

హామీవుంచిన ఆస్తిని రుణదాత స్వాధీనమందుం[illegible]టు.

ముద్దతు తనఖా.

ఆస్తిని హామీగావుంచి, నిర్ణీతకాలంలో తీర్చలేకపోతే ఆస్తి ఋణదాత స్వాధీనపర్చుకొనుట. యీ మూడు విధములైన తనఖాలకు 12 సంవత్సరాలు లిమిటేషనుగడువు వున్నది.

ఫల్లా.

భూమికి, భూమిని మార్చుకుని ఆ మార్పును స్థిరపర్చుకొనుట.

సెటిల్ మెంటు.

ఆస్తిని దుర్వినియోగపర్చుచున్నప్పుడు, ఆస్తియందు తన హక్కును నిరూపించుకుంటూ, డామేజిమెంటుచేయుటకు మరొకరి పేర సెటిల్ మెంటు చేయుట.

దఖల్.

వున్న హక్కునుగాని, రానున్న హక్కునుగాని, యితరులకు సంక్రమింపజేయుట లేక ఆస్తిని భార్యపేర దఖలు చేయుట.

హక్కు విడుదల.

ఆస్తియందు తనకున్న సంపూర్ణహక్కును విడుదల చేసుకొనుట (ఉదా:- నలుగురు అన్నదమ్ములలో ఒకరు తమ హక్కును వదలుకొని మిగతావారికి సంక్రమింపజేయుట, ఏదైనా కంపెనీలయందు, ఫ్యాక్టరీల యందు తనకున్న హక్కును విడుదలచేసుకొనుట.)

హామీ:

వితంతువుగాని, మైనరుల ఆస్తినిగాని, యితరాధారములేని మరొకరు గాని ఆస్తిని విక్రయించునపుడు, మైనరుల తరఫున బాధ్యత వహించునప్పుడు ఆయాదస్తావేజుల విలువలకు, సైతగ్గ ఆస్తులకు మరొకఆస్తిని హామీవుంచుట.

## జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ:

తనకున్న సమస్త వ్యవహారములు తనకుగాను యితరులు వ్యవహరించుటకు యిచ్చే అధికారం. దీనితో సర్వం యజమానితో సంబంధంలేకుండా చేయవచ్చు. (యస్టేట్లలో ఏజెంట్లు వుంటారు)

## స్పెషల్ పవర్ ఆఫ్ అటార్నీ :

ఏదో ఒకేఒక పనికిమాత్రం నియోగించియిచ్చు అధికారం. ఆ నియమింపబడిన పని కాగానే యీ అధికారం ముగింపబడుతుంది.

## ఫారిఖత్తు :

వ్యక్తులమధ్య పంచుకోబడిన ఆస్తిని ఆభాగాలు మారకుండా స్థిరపర్చుకొనుట.

## కౌలు, కత్తులు:

భూములు మరొకరికి సాగుచేయుటకు యిచ్చి వొప్పందమైన ఫలసాయం పొందుటకు, ఆ కాలంవరకు అవప్పందం నిలుపుటకు, భూస్వామి యిచ్చేది కౌలు. రైతుయిచ్చేదిక్బులియత్తు.

## ప్రామిశరీ నోట్లు:

యివికూడా అరుదుగా రిజిష్టరీ చేయబడుతవి. దీనివల్ల డబ్బుయివ్వకుండా బినామీగా వ్రాయించుకున్నారనే వాదనమాత్రం భంగపర్చుటకు

## విల్ నామా:

తన ఆస్తి తనతదనంతరం కొందరికి సంక్రమింపజేయుటకుగాను తన యిష్టాన్ని తెలియజేయుచూ, దానిని స్థిరపర్చునది యీవిల్ నామా. ఆసలుదారు బ్రతికుండగా అయితే ఆయన స్వయంగా రిజిష్టర్ చేస్తారు. లేక వ్రాసి

ఆయన చనిపోతే. నాలుగు నెలలలో ఆసితినే వారు రిజిస్టరీ చేయించుకో వచ్చును. కొందరు సీలుకవరులో తమ అభిప్రాయం వ్రాసి తమ తదనంతరం వారసులకు తెలుపునట్లు చేస్తారు.

## దత్తత స్వీకార పత్రం:

సంతానం లేనపుడు యితరులను పెంచుకొని ఆస్తి సంక్రమింపజేయుటకు, దీనిని ధృవపర్చుకొనుట, లేకపోతే దత్తుడుమీద అయిష్టత ఏర్పడినప్పుడు వెళ్ళగొట్టవచ్చు. అతను నిరాధారుడవుతాడు.- అందుకు రిజిష్టరు వుండాలి.

విల్ నామాలు, దత్తతస్వీకారపత్రాలు, యింకా గనులు, పెదకంపెనీల దస్తావేజులు పాటోపసి రిజిష్టరు చేయించవచ్చు. ఒక అక్షరము దిద్దినా విపరీత నష్టము రావచ్చు అందుకుగాను యీవిధానం హెచ్చువిలువైన వాటికి మాత్రమే చేసుకుంటారు.

## రిజిష్టరుకాబడు కాగితానికుండవలసిన అంశాలు:-

దస్తావేజు ఆరుభాగాలుగా విభజింపబడినది.

1. యిన్నివందల రూపాయిల విలువగల (క్రయం, తనఖా, పట్టా, మొదలైన పేరులతో)

2. తేదీ, నెల, సంవత్సరం అక్షరాలతో

3. వ్రాయించుకున్నవారు. పేరు, తండ్రిపేరు, కులం, వృత్తి, గ్రామం, గ్రామం జమీలోదైతే ఏజమీలోదో కూడా వ్రాయాలి. ఏ జిల్లా సెక్షనులోనిదో ఆ రిజిష్ట్రారు ఆఫీసు.

4. వ్రాసియిచ్చినవారు. డిటో.

5. దస్తావేజు వివరాలు, షరతులు, ఆస్తి ఎందుకు రిజిష్టరుచేయు చున్నారు. తనకు ఆ ఆస్తియందుగల సర్వహక్కులు వదలుకొనుట తెలుపుతూ.

6. షెడ్యూలు:- ఆస్తి వివరం, హద్దులు, వివరంగా, డిమార్కేషను నంబరు లెటరుంటే లెటరుతో, పరిమితి, శిస్తు.-

వ్రాసి ఇచ్చినవారు ప్రతి కాగితంమీద సంతకం పెట్టాలి. మైనరు ఉంటే మైనరును వుదహరించి గార్డియన్ కూడా ప్రతి కాగితంమీద సంతకం చేయాలి. చివరకాగితంమీద తుడుపులు, కొట్టివేతలు, హంస పాదులుంటే ఎన్ని పేరా, ఎన్ని పంక్తిలోనో, ఎన్ని వివరంగావ్రాసి, వ్రాసి యిచ్చేవారు దస్కతుచేయాలి.

యిద్దరు సాక్షులకు తప్పకుండా సాక్షి వ్రాలు చేయించాలి. దస్తూరి ఎవరిదో వారు తమదస్తూరి అని వ్రాయాలి.

క్రియానికి, దఖల్, హక్కువిడుదలకు, (నివేశనంగాక) ట్రాన్స్ఫరు ఫారాలుకూడా వుండాలి. ఆ ఫారాలు నింపి వ్రాయించుకొనువారు, వ్రాసియిచ్చువారు దస్కతుచేసి, ఆదస్తావేజుతో పెట్టాలి. రిజిస్ట్రాఫీసుకు యిద్దరు గుర్తింపుసాక్షులుకూడా కావాలి. వారిద్దరు పూర్తిగా రిజిష్టరు చేయువారికి ఆ ఆస్తియందు సంపూర్ణ హక్కున్నదని ఎరిగినవారుగా ఉండాలి.

షరా:- డబ్బు సంబంధమంతా రిజిష్ట్రారు ఎదుటనే జరుపుకొనుట చాలా ముఖ్యం. యీ విధానం అలవాటు పర్చాలి. దీనితో కోర్టువ్యవహారం కొంత తగ్గిపోతుంది.

విడుదల :

తనఖా, పవర్ ఆఫ్ అటార్నీలు, సోల్ సెంటు, హామీలు, తిరిగి అసలువారికి హక్కుకలిగించుటకు రిజిష్టరుద్వారా నేగాని, సామాన్యకాగితాలతోగాని, రశీదులతోగాని, విడుదల కానేరదు.

## రిజిష్టరు చేసుకొను గడువు :

ప్రతిదస్తావేజు వ్రాసిన తేదీ లగాయతు నాలుగు నెలలలోగా రిజిష్టరు కావాలి. గడువుదాటిన తరువాత స్టాంపు చెడిపోతుంది. ఆ గడువులో దస్కతుచేసి రిజిష్టరీ నిరాకరించినపుడు రిజిష్ట్రాఫీసులో సమనుపత్రంకొరకై దాఖలుచేస్తే పార్టీని పిలిపించి రిజిష్టరు చేయిస్తారు. పక్షకక్షిదారులు కోర్టుద్వారా రాబట్టుకొను హక్కువుంది.

## చెడిన స్టాంపుల ఖరీదు రిఫండు యిచ్చుట.

స్టాంపు చెడుటకు తగిన కారణాలు చూపించి స[illegible]ని రుజూపరుస్తుంటే రూపాయికి అణా చొ॥ తగ్గించి తాలూకా ట్రెజరీలో డబ్బు యివ్వబడుతుంది.

## స్టాంపు డ్యూటీ.

క్రియానికి నూటికి రు 1-8-0.

తనఖా, కౌలుఖుస్తులు, సెటిల్ మెంట్లు వగైరాలకు నూటికి రు 0-12-0

జనరల్ పవర్ ఆఫ్ అటర్నీకి రు 7-8-0.

స్పెషల్ ,, ,, 4-8-0.

### ఫీజు.

## పవర్ ఆఫ్ అటర్నీలకు.

స్పెషలుకు 0-12-0, జనరల్ కు 4-8-0, విల్ నామా, దత్త స్వీకార పత్రం, మరికొన్నిటికి ప్రత్యేక రేట్లున్నవి. క్రియం, దఖల్ సెటిల్ మెంటు, తనఖా మొదలైన అన్నిటికీ యీ దిగువ రేట్లప్రకారం ఫీజులు చెల్లించాలి, (ప్రస్తుతం హెచ్చించిన ప్రకారం.)

| | | | |
|---|---|---|---|
| 1 | నుండి | 10 | 0—6—0 |
| 10 | నుండి | 25 | 0—9—0 |

| | | | |
|---|---|---|---|
| 25 | నుండి | 50 | 0—12—0 |
| 50 | నుండి | 75 | 1— 2—0 |
| 75 | నుండి | 100 | 1— 8—0 |
| 100 | నుండి | 200 | 2— 4—0 |
| 200 | నుండి | 300 | 3— 0—0 |
| 300 | నుండి | 400 | 3—12—0 |
| 400 | నుండి | 500 | 4— 8—0 |
| 500 | నుండి | 600 | 5— 4—0 |
| 600 | నుండి | 750 | 6— 0—0 |
| 750 | నుండి | 1000 | 7— 8—0 |

1000 మొదలు 2500 వరకు ప్రతి 500 లకు దానిలోని భాగానికి 1-8-0.

2500 నుండి 4000 వరకు. ప్రతి 500 దాని భాగంకు 2-0-0.

4000 నుండి ఎంతైనాసరే ప్రతి 1000 దానిలోని భాగానికి 2-8-0.

టాన్స్ఫరు ఫీజు.

గవర్నమెంటు గ్రామాలకు శేరీకికాదు ఈనాంకు 0-12-0.

జమీందారీ ,, శేరీకి 0-8-0, ఈనాంకు 0—12—0.

వరా:—దస్తావేజు 1 కి.

జ్యూరిస్ డిక్షను.

ఒక జ్యూరిస్ డిక్షనులోని భూమిని మరొక జ్యూరిస్ డిక్షనులో చేయాలంటే ఆ ఏర్యాలోని ఆస్థి ఏకొద్ది అయినా కలియనిది వీలంలేదు.

రిజిష్టరీని ఆపుచేయుట.

ఏదైనా వివాదమున్నదని రిజిష్టరీని ఆపమని ఎవరైనా అడ్డు పిటీషను పెట్టునపుడు విచారించి తన యిష్టప్రకారం చేయుటకు రిజిష్ట్రారు అధికారం కలిగివున్నాడు.

## యన్‌కంబరెన్సు సర్టిఫికేటు.

(ఆస్థి అన్యాక్రాంతము చేయలేదని ధృవపర్చుకొను ధృవపత్రము) యిది కావాలంటే ఏ సంవత్సరములలో కావాలో ఆ సంవత్సరాలకే యిస్తే ఒక రేటు, యింకా కొన్ని సంవత్సరాలకు మరొక రేటు. రేట్లు ఒక్కొక్క డిమార్కేషను నంబరుమీద చార్జిచేస్తారు. (రేట్లను ఆఫీసులో కనుక్కోవాలి.) యీ రేట్లు చాలా హెచ్చుగావు. ఇవి రైతు తన నంబర్లన్నిటినీ ఏసుకోవాలంటే చేతగానంతగావున్నవి. వాటిని తగ్గించుటకు ఆందోళన కావాలి.

## భూమి తనఖా బ్యాంకులు.

యీ బ్యాంకులలో అప్పుతీసికొనినపుడు ఆ బ్యాంకువారే ఏసుకుంటారు. అప్పుడుమాత్రం సగం రేటు వసూలుచేస్తారు (యన్‌కంబరెన్సు సర్టిఫికేటును)

## యింటికివచ్చి రిజిష్టరు చేయుట.

ఘోషా జాతులుగా నిర్ణయించబడినవారికి ఫీజు కట్టగలిగిన ఘోషా స్త్రీలకు. రోగులకు నిర్ణయింపబడిన రేట్లుప్రకారం ఫీజు తీసుకుని శలవు రోజులలో యింటికివచ్చి రిజిష్టరు చేయబడుతుంది. రోగిస్థితినిబట్టి డాక్టరు సర్టిఫికేటుంటే శలవుకానిరోజున కూడా వచ్చి రిజిష్ట్రారు రిజిష్టరుచేయాలి. (యిందుకు ఫీజేగాక మైలేజి కూడా వుంది.)

## నకలు దరఖాస్తు.

యాక్టు పుట్టినప్పటినుంచీ వున్న రికార్డు కంతటికీ సబురిజిష్ట్రారు ఆఫీసులో నకలు దొరుకుతుంది. దానికి నియమింపబడిన ఫారంలో 0-3-0 దరఖాస్తుఫీజు. 1-8-0 కాపీ స్టాంపులు యివ్వాలి. ఏ సంవత్సరముదో తారీఖు తెలుపాలి. అదిగాక యింకా కొన్ని సంవత్సరాలు వెదకాలంటే సంవత్సరం 1 కి 0-6-0 యివ్వాలి, (వివరాలు ఆఫీసులో తెలుసుకోవాలి.)

కంపెనీసు యాక్టు.

ఈయాక్టుప్రకారం పబ్లిక సంఘలన్నీ రిజిష్టరు చేయవచ్చును. దీనికి రు 50-0-0 లు ఫీజు నిర్ణయింపబడివుంది. యీ రిజిష్టరు జిల్లా రిజిష్ట్రారు ఆఫీసులోనే చేయబడుతుంది. యీ సంఘలరిజిష్టరుకు, నిబంధనావళి వుండాలి. మొదట ఏ పేరుతో రిజిష్టరు కాబడుతుందో ఆ పేరుతో అక్షరం పొరబాటు లేకుండా వ్యవహరించాలి. నిబంధనలు మార్చినపుడు తెలియజేయాలి. పాలకవర్గం మారిన 15 రోజులలో పూర్తి చిరునామాలు తెలియజేయాలి.

వర్కర్ల కర్తవ్యం.

పై విషయాలన్నీ స్పష్టంగా తెలుసుకోవాలి. యివిగాక మిగిలిన వివరాలు ఆఫీసులలో పూర్తిగా తెలుసుకోవాలి. గ్రామాలలో దస్తావేజులు వ్రాసే కరణాలు, యితరులు, యీ రహస్యాలు ప్రజలలో ప్రచారం చేసిన కొలదీ వ్యతిరేకులై మనను ఎన్నో చిక్కుల ఎదుర్కొనబోయే, కేసులను ఎదురు తిప్పుతారు. ఎన్నోవిధాల రెచ్చగొట్టుతారు. వాటికి మనం లొంగకొని, ప్రజలలో వారు ఎలా మోసం చేయుచున్నది ఓపికగా, ఆధారాలతో చెప్పాలి. తగినంత లిఖితపూర్వక ఆధారాలు, నమ్మదగిన సాక్ష్యం లేనిది, ప్రజలందరూ, గుర్తించునట్లు చేయనిది లంచగొండితనం, కేసులు పెట్టరాదు —. అభివృద్ధి నిరోధకులవల్ల రైతులు లంచగొండి విధానంతో పనులు చేయించుకొనుట కలవాటుపడ్డారు. వారిని నెమ్మదిగా ఆదోవనుండి తప్పించాలి. రిజిష్ట్రారువద్దకు వచ్చేటప్పుడు, తగినసాక్షులు, దస్తావేజు క్రమంగా వ్రాయించుకొనుట, ట్రాన్సఫరు ఫారాలు చక్కగా అన్నిహంగాలతో పూర్తిచేయుట, క్రమమైన వేళకు ఆఫీసుకుచేరుట నేర్పాలి. అప్పుడే మనం అన్యాయాన్ని ఎదుర్కొనగలుగుతాం.

గ్రామాలలోనే గాక ఆఫీసులలో, ఆఫీసరులూ లంచగొండిపరులే. ప్రతి విషయానికి లంచం లేకపోతే అడ్డగించి యిబ్బంది పెడతారు. ఉదా:-

లంచం యివ్వకపోతే, దస్తావేజు గుమాస్తా సరిజూచి ఏదో రెండు తప్పులు పట్టుకొని, కాలం దాటిందాకా వుంచటం చేస్తారు. అయినా మనం వోపికతో ఎదుర్కోవాలి. గ్రామంలో ఒకేసారి మనం అన్నీ చేయాలని ఆదుర్దాపడితే ఏమీచేయలేక అలిగి ఆసహాయపరులమై రైతులను అప్పజెప్పిన వారమవుతాము. గనుక ప్రతి విషయం మార్క్సిస్టుగా పరిశీలించాలి.

N. B:— మనం చేసే ప్రతి పని గ్రామ తగాదాలను పెంచేదిగా గాకుండా, పరిష్కరించేదిగానూ, ప్రజలకు సహాయపడేదిగానూ వుండాలి. అందుకోసం యీ ఆక్టును తెలుసుకుంటున్నారనే విషయాన్ని మరచిపోకూడదు.

---



## భూమిశిస్తు విధానాలు

ప్రస్తుత శిస్తు విధానమునుగురించి వివరంగా తెలుసుకోవడానికి ముందు భూమిపై శిస్తువిధించేపదతి ఏయేకాలంలో దశలలో ఏవిధంగా పరిణామం చెందిందో ముందు తెలుసుకోవాలి.

### బ్రిటిష్ పాలనకు ముందున్న విధానం.

ఇంగ్లీషువారు యీ దేశానికి రాకపూర్వం భూమి విస్తీర్ణాన్ని, సారాన్ని బట్టి శిస్తు విధించేపద్ధతిలేదు. పండే పంటలలో ప్రభుత్వం కొంతభాగాన్ని తీసుకునే పదతి అమలులో వుండేది. మొట్టమొదట మనువు, గౌతముడు మొదలైన స్మృతికర్తలు రైతులు తమ పంటలలోనుండి 1/12 వంతు భాగాన్ని రాజులకు పన్నుగాయిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టారు. తరువాత చాణక్యుడూ ఇంకా ఇతర క్షత్రియరాజులూ పంటలో $\frac{1}{6}$ వంతు పన్నుగా తీసుకొనేవారు. వారే యుద్ధసమయాలలో $\frac{1}{4}$ వంతుకూడా తీసుకోవడం కద్దు. పిమ్మట మొగల్ చక్రవర్తులకాలంలో ముఖ్యంగా. అక్బరు

పాలనలో, రాజా తోడరుమల్లు ఆపన్ను ఎక్కువచేసి పంటలో $\frac{1}{3}$ వంతు పుచ్చుకోవడం జరిపాడు. మొఘల్ సామ్రాజ్యం పతనమై ఇంగ్లీషుపాలన ఏర్పడిన మొదటిరోజుల్లో పన్నులను వసూలుచేయడానికి ఒక క్రమ పద్ధతిగాని, నిర్ణయంగాని లేదు. ఇష్టంవచ్చినట్లూ, వీలైనట్లూ వసూలు చేయబడేది. కాని అంతవరకూకూడా పండినపంటనుండి భాగం తీసుకొనే పద్ధతి, గ్రామ పొలిమేరలలోవున్న భూమి అంతా గ్రామస్థుల సమిష్టి వుపయోగంక్రిందవుండే పద్ధతీమాత్రం అమలులో వుండేవి. సేద్యంచేసేవాడే రైతు. అతడే భూమికి యజమాని. పాలకులు పన్ను మాత్రం వసూలు చేసేవారు. ఇంగ్లీషువారుకూడా యీ సాంప్రదాయాన్నే ప్రథమంలో అనుసరించినా కొద్దికాలంలోనే యీ పద్ధతిలో ప్రధానమైన మార్పు ప్రవేశపెట్టారు.

## ఇంగ్లీషు పాలకులు ప్రవేశపెట్టిన మార్పులు.

ఏ సంవత్సరాని కాసంవత్సరం పంటలలో భాగాలను వసూలుజేసే పనిలేకుండా కొన్ని సంవత్సరాలకు కలిపి వసూళ్ళను వేలం వేసేవారు. సేద్యంచేసే రైతులు కాకుండా ఎవరో ఒకరు (జమీందార్లుగాని, కమీషన్ దార్లుగాని) ఈ వసూళ్ళను పాట పాడేవారు. వీరు ఇష్టంవచ్చినట్లు రైతుల వద్దనుడి పండిన పంటనంతా దోచుకోవడం జరిగేది. చివరకు ఈవిధానాన్ని మానుకుని ప్రభుత్వం శాశ్వత ఫైసలాపద్ధతిని ప్రవేశపెట్టింది. ఆ పద్ధతే జమీందారీ విధానం. ఈవిధానంక్రింద దేశం మొత్తంమీద భూమిలో 19% చేర్చబడ్డది. దీన్ని ప్రవేశపెట్టడంలో ప్రభుత్వోద్దేశం, రైతులను దోపిడీనుండి తప్పించి వారినుండి వసూలుచేసే పన్నును క్రమబద్ధం చేయుటకు కాదు; తమ వునికిమీద ఆధారపడే ఒక నూతనవర్గాన్ని సృష్టించడమూ, అనాదిసిద్ధంగావున్న భూస్వామ్యము రైతుకులేకుండాచేసి జమీందార్లకు కప్పగించడమూనై యున్నది.

ఈ జమీందారులు కూడా క్రమేణా, రైతులను పీడించి పెద్దపెద్ద మొత్తాలను (ధాన్యంగాగాని, డబ్బుగాగాని) పన్నుల క్రింద వసూలుచేయసాగారు. రైతులనుండి తాము వసూలుచేసే పన్నును 10 రెట్లవరకూ పెంచారు. కాని ప్రభుత్వానికి వారు చెల్లించే పేష్కస్, శాశ్వతఫైసలా పద్ధతి ప్రకారం నిర్ణయించబడిన మొత్తం మాత్రమే. అందువల్ల ప్రభుత్వానికి వచ్చే పన్నుకంటె, జమీందార్లకు 4 రెట్లు పన్ను ఎక్కువముట్టేది. అందుచేత రైతులనుండి వసూలయే మొత్తంలో సాధ్యమైనంత హెచ్చుభాగాన్ని తాము రాబట్టుకొనుటకై, ప్రభుత్వం టెంపరరీ (తాత్కాలిక) జమీందారీ పద్ధతులను ప్రవేశపెట్టింది. (ఈ పద్ధతి మనరాష్ట్రంలోలేదు. యు. పి. పంజాబు రాష్ట్రాలలోవుంది) ఈ పద్ధతిక్రింద దేశమొత్తం భూమిలో 30% చేర్చబడింది.

## రైత్వారీ పద్ధతి.

మన రాష్ట్రంలో ప్రభుత్వస్వాధీనంలోవున్న ప్రాంతాలలో మొదట్లో "గ్రామకవులు" పద్ధతివుండేది. తరువాత "ఇజారా" పద్ధతి ప్రవేశపెట్టబడింది. ఈ ఇజారాదార్లుకూడా రైతులను చాలా బాధించి పన్నులు వసూలుచేసేవారు. అందువల్ల రైతులు కొన్నిచోట్ల భూములను పాడుపెట్టడంకూడా జరిగింది. అందుచేత ఆ ఇజారాపద్ధతికి బదులు యింకో పద్ధతిని సూచించవలసినదిగా మద్రాసు ప్రభుత్వం, 1807 సం॥లో, సర్ థామస్ మన్రోను నియమించింది. ఈయనే రైత్వారీపద్ధతిని ప్రవేశపెట్టడం, తిరిగి ఈయనే 1820 సం॥లో గవర్నరుగా వచ్చినప్పుడు ఆ పద్ధతిని అమలులో పెట్టడం జరిగింది. ఈ పద్ధతి క్రింద దేశ మొత్తం భూమిలో 51% చేర్చబడ్డది.

## రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టడంలోగల ఉద్దేశాలు.

(1) జమీందారీ విధానంవల్ల రైతులనుండి వచ్చే మొత్తం పన్నులో 1వ పంతు మాత్రం తమకూ, మూడుపంతులు జమీందార్లకూ, చెందు

తూండడంవల్ల; వసూలయ్యే పన్ను మొత్తాన్నంతా తామే రాబట్టుకొనుచున్నా,

(2) పండే పంటతో నిమిత్తంలేకుండా, భూమి విస్తీర్ణమునుబట్టి శిస్తులు వసూలు చేసుకొనుచున్నా,

(3) పంటకు బదులు, డబ్బునే వసూలు జేసుకోవడానికిన్ని,

(4) గ్రామ సమిష్టి అంగీకారంతో పనిలేకుండా, పరాసరి, విడివిడిగా, రైతులతోనే శిస్తు నిర్ణయాలు (ఇష్టంవచ్చినప్పుడు పెంచే అవకాశాలతో) చేసుకొనుచున్నా,

(5) రైతులనుండే, భూస్వాముల (ల్యాండులార్డ్సు)ను సృష్టించడానికిన్ని, రైత్వారీపద్ధతి ప్రవేశపెట్టబడింది.

రైతులకే భూమిపై జిరాయితీహక్కు కలుగ జేయడానికీ, రైతుల ఆర్థిక పరిస్థితి ననుసరించి, శిస్తులను సవరిస్తూ, రైతుల యోగక్షేమాలను కాపాడడానికీ, ఈ పద్ధతిని ప్రవేశపెట్టినట్లు ప్రభుత్వం చెప్పుకుంటోంది.

ఈ పద్ధతివల్ల వ్యవసాయదారే, పట్టాదారయ్యాడు. రైతుకూ, ప్రభుత్వానికీ మధ్య ఇంకొకరి పెత్తనం లేకుండాపోయింది.

కాని ఈ పద్ధతి అప్పట్లో చాలా దారుణంగావుండేది. భూములకు సర్వే లేదు. శిస్తుల నిర్ణయాన్ని గూర్చి స్పష్టమైన పద్ధతులుగాని, సరియైన రికార్డులుగాని లేవు. రైతుకు పండిన పంటలో, ఖర్చులు మినహాయించకుండానే, నూటికి 60 వంతులు, శిస్తుక్రింద ప్రభుత్వం తీసుకునేది. తోట భూములపై యీ శిస్తులు మరీ హెచ్చుగావుండేవి. పైగా యీకాలంలో ధాన్యపు ధరలు తగ్గిపోవుటవలన, రొక్కరూపంలో పన్నులు చెల్లించడం మరింత దుర్భరమైపోయింది. దీనికితోడు, రైత్వారీపద్ధతిలో, భూస్వామిక విధానం హెచ్చుపెరిగిపోయింది. యంత్ర పరిశ్రమలు వృద్ధిగాకపోవడంవల్ల,

పెట్టుబడిదార్లు తమ పెట్టుబడిని, భూములపై పెట్టసాగారు. శిస్తులు కట్ట లేకనూ, ఋణములు, వడ్డీలు, తీర్చలేకనూ, రైతులు భూములను అమ్మివేసు కొని కూలీలయిపోవడంతో భూస్వాములు ఎక్కువయ్యారు.

## రైత్వారీ పద్ధతిలో సవరణలు:

ఈవిధంగా రైతులనుకలిగిన కష్టాలవల్లనో, కరువులూ, కాటకాలూ వచ్చిపడ్డాయి. పత్రికలలో ఆందోళనా, ఆవేశమూ తీవ్రరూపం దాల్చాయి. ఆసందర్భంలో 1855 సం॥లో కరువుసంఘములు ఏర్పడి విచారణలు చేసి, శిస్తువిధానం మారాలని, నీటివసతులు ఏర్పరచాలని సూచనలు చేశాయి. 1858 సం॥లో రెవెన్యూ, సెటిల్‌మెంటు శాఖలూ, ఇనాములనుగూర్చి విచారించుటకు ఒక కమీషనూ ఏర్పడ్డాయి. గోదావరి, కృష్ణానదులకు ఆనకట్టలూ, డెల్టాలకు పంటకాల్వలూ ఏర్పడ్డాయి. పండినపంట మొత్తంలో 60% గాక, వ్యవసాయఖర్చులుపోను మిగిలే నికరాదాయంలో శిస్తు సగానికి మించి వుండరాదని రూల్సు ఏర్పరచబడ్డాయి. భూములను సర్వేచేసి, తరగతులక్రింద విభజించి తరములుకట్టారు. ఈకాలంలో అనగా 1858–64 సం॥ మధ్య, రైత్వారీ పట్టాదార్లకుకూడా, భూమిపన్నును శాశ్వతం చేయాలని ప్రభుత్వం ఆలోచించింది. కాని ఆరోజుల్లో ప్రభుత్వాన్ని గడగడ లాడించిన సిపాయి తిరుగుబాటు చెలరేగిపోవడంతో, అది ఆచరణలోకి రాలేదు.

## సెటిల్‌మెంటు విధానం.

1864 సం॥లో "నెవిల్" అనే ఆయన సెటిల్‌మెంటు మాన్యువల్ ఏర్పరచాడు. దానిలోని ముఖ్యసూత్రాలు–

(1) అన్ని ప్రాంతాలకూ; సాధ్యమైనంతవరకూ. ఒకేరకం తరం కట్టాలి.

(2) భూములు రేగడ, గరప, గులకరాయి అను మూడుతరగతుల క్రింద విభజింపబడతాయి.

(3) మళ్ళీ ఒక్కొక్క తరగతి భూమిని మూడు అంతర్భాగాలుగా విభజింపబడాలి.

(4) భూమియొక్క తరగతినిబట్టి నిర్ణయింపబోయే శిస్తును, ఆ భూమిలోపండే పంటతో సరిపోల్చి చూడాలి.

(5) పల్లపుభూములైతే నీటివసతులనుబట్టి, మెరకలైతే, మార్కెటు సౌకర్యాలనుబట్టి సరిజూచి తరములు కట్టాలి.

(6) మొదటితరం భూమిలో పంటనిర్ణయంచేసి, ఆపంటను; సెటిల్మెంటుకుపూర్వం 20 సం॥ల (కరువులేని) ధాన్యపుధరకట్టి; ఆ మొత్తంలో వ్యవసాయపు ఖర్చులన్నీ మినహాయించి; కౌలుమానవ్యత్యాసములూ, వర్తక లాభములక్రింద మినహాలూ పోను; శేషించినదానిలో, "శిస్తు" సగానికి మించకుండా వుండాలి.

(7) ఒకసారి కట్టబడిన తరం 30 సం॥ల వరకూ, అమలులో వుండాలి. ఆ పిమ్మట తిరిగీ తరం నిర్ణయించాలి.

ప్రథమ సెటిల్మెంటు.

పై సూత్రాలతో ప్రథమ సెటిల్మెంటు 1866 సం॥ మొదలు 1900 సం॥ వరకూ అమలులోవుంది. సాధ్యమైనంతవరకూ ఒకేతరం కట్టాలని ప్రథమసూత్రంలో చెప్పబడ్డా, ఇతరసూత్రాలనుకూడా కలిపి ఆచరణలో పెట్టేటప్పటికి, భూములకు దాదాపు 15 తరములు ఏర్పడ్డాయి. రైతుల ఆర్థికస్థితినిబట్టి కాకుండా, భూమినిబట్టి పన్ను విధించడమే అసలు జరుగుతూ వచ్చింది. ఆనకట్టవల్ల ప్రవహించే నీరు పుష్కలంటే, మెరకచేలు ఎకరా రు. 3-4-5 లు చొ॥న నీటిపన్ను వసూలుచేసేవారు.

రెండవ సెటిల్‌మెంటు.

1900 సం॥ లో "క్లార్కు" అను సెటిల్‌మెంటు ఆఫీసరు, ప్రజాందోళనను లక్ష్యపెట్టకుండా, భూములను తిరిగీ తరగతులుగా విభజించి, వాటిమీద తరములను కృత్రిమంగా పెంచారు. దానికితోడు ఈక్రింది పద్ధతులద్వారా కూడా శిస్తులు విపరీతంగా పెంచబడ్డాయి

(1) 5 సం॥లు వరుసగా పల్లపుసాగులోవున్న భూమిపై సారమును బట్టి తరంగట్టి; భూమిశిస్తుకూ, నీటితీరువాను కూడా కలిపి, ఆతరమునుబట్టి పెంచారు. అందువల్ల భూమిశిస్తుతోపాటు నీటితీరువాకూడా పెరిగింది.

(2) మెరకబావుల పల్లంభూములను, నీరు పుచ్చుకోవడానికీ, లేక మానడానికీ, హక్కు రైతులకిస్తూ, అందుకుగాను మెరక పల్లపు రేట్లకు మధ్యగల తేడాపై, యింకొక రూపాయి అదనంగాకలిపి నీటి రేటుగా విధించారు.

(3) మెరక ప్రాంతాలలో ఇదివరకున్న శిస్తుపై 33% శిస్తు హెచ్చించారు.

(4) డెల్టాప్రాంతాలలో "తండ్రి" భూములు అనే తరగతిని కొత్తగా కల్పించి, దానికిపెచ్చు తరములుకట్టి, రెవిన్యూ పెంచారు.

(5) 1866 సం॥ సెటిల్‌మెంటులో కట్టబడిన శిస్తులోనే సెస్సులు కూడా కలిసివుండేవి. కాని యీ సెటిల్‌మెంటులో సెస్సులు వేరే కట్టాలన్నారు.

(6) లోగడ ఇజారాపద్ధతిలోవున్న ఏజెన్సీ ప్రాంతాలలోకూడా, తరగతి విభజనచేసి, తరములు పెంచారు. అందువల్ల వచ్చిన ప్రజాందోళనచే 1919 సం॥లో ప్రభుత్వపు సెటిల్‌మెంటు మాన్యూయలుకు సవరణగా ఈ క్రింది సూత్రాలను ప్రకటించారు.

(1) ప్రత్యేక కారణములుండిన తప్ప, భూముల పునర్విభజన, పంట అంచనా, వ్యవసాయపు ఖర్చు అంచనాలపై శిస్తులు పెంపకం జరుగదు.

(2) శిస్తులను ఏ కొలదిగానైనా, న్యాయసమ్మతముగా మార్చదగినంత, యదార్థమైన మార్పువల; ధాన్యాదుల ధరలలో కనబడినప్పుడే; సెటిల్‌మెంటు ఆఫీసరు మార్పులనుగూర్చి ఆలోచించాలి.

(3) హెచ్చుచేయబడిన రేట్లుకూడ, ధాన్యపు ధరయొక్క పూర్తి పరిమితివరకూ, హెచ్చించరాదు.

ఈ ఉత్తరువుల ప్రకారం, ధాన్యపు ధరల పెరుగుదలనుబట్టియే శిస్తులు హెచ్చించాలి. భూవిభజననుబట్టి, పంటనుబట్టి శిస్తులు హెచ్చించకూడదు. తరువాత 1925 సం॥లో తంజావూరు మిరాశీదారుల ఆందోళనా ఫలితంగా, ధరల హెచ్చుదలపై కట్టబడు పన్నుకూడా, రూ 1కి 0-3-0 లకంటే మించి వుండరాదని తీర్మానింపబడ్డది.

ఈ అవకాశములను కలుగజేయడం రైతులయొక్క సుఖజీవనాన్ని ప్రోత్సహించుటకేనని ప్రభుత్వవాదన.

కాని, పూర్వపు సెటిల్‌మెంట్లలోవలె, భూముల విభజన, పంటల అభివృద్ధి, వ్యవసాయ ఖర్చులూ, ఆధారంగాతీసుకుంటే, ప్రభుత్వానికి శిస్తులుపెంచే అవకాశం కనబడదు. అందుచేత శిస్తులు పెంచడానికి వుపయోగపడేది ఒక్క పంటసరుకుల ధరలుమాత్రమే. అందుచేతనే యీ సవరణలు చేసిందని మనవాదన.

ఈ సమయంలో భూమిపన్నును, శాశ్వతముగా, శాసనబద్ధముగా, చేయాలని శాసనసభలోనూ, బయటనూ, ఆందోళన జరిగింది. కాని ఫలితం మాత్రం శూన్యం.

## 3వ సెటిల్ మెంటు.

హోల్డ్సువర్తుగారిచే జరుపబడిన, యీ సెటిల్‌మెంటులోవున్న ముఖ్యాంశాలు:-

(1) తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోనూ, కృష్ణాజిల్లాలోనూ, గల డెల్టాలలో పల్లానికి రు 1కి 0-3-0 లు హెచ్చుకట్టాలి.

(2) డెల్టాల మెట్టకు మొదటి 8 తరములకు రు 1కి 0-3-0 లున్నూ, మిగతా 6 తరములకూ, రు 1కి 0-2-0 లున్నూ, హెచ్చుచేయాలి.

(3) మెట్ట ప్రాంతాలలోని పల్లపు భూములకు యిప్పుడున్న రేటుకు రు 1కి 0-3-0 ల చొ॥న పెంచాలి.

(4) మెరక ప్రాంతాలలోని, మెరక భూములపై రు 1కి 0-2-0 ల చొ॥న హెచ్చించాలి.

(5) ఏటేరుక్రింద సాగుఅవుతున్న తోటభూములపై రు 1కి 0-2-0 ల చొ॥న పెంచాలి.

(6) మునిఏరుక్రింది భూములకు రు 1కి 0-2-0 లు పెంచాలి.

(7) డెల్టాలలో బాపతు పల్లంభూములపై నీటితీరువా రు 5 ల నుండి రు 6-4-0 లకు పెంచాలి.

(8) దివితాలూకాలో ఆయకట్టులో జేరిన మెరకభూములకు తరగతి విభజనజేసి, తరములు విధించాలి. నీటితీరువా య 1కి రు 5 ల నుండి 6 కు పెంచాలి.

ఈ సెటిల్ మెంటుకు వ్యతిరేకంగా రైతులలో తీవ్రఆందోళన బయలు దేరింది. ఆర్థికంగా కృంగిపోతున్నందువల్ల రైతులు ఈ అధికశిస్తులను భరించలేమని గగ్గోలుపెట్టారు. శాసనసభా సభ్యులలో చాలామంది రైతుల కోర్కెల్ని బలపరచారు.

రైతులు సిల్కు కండువాలను ఉపయోగిస్తున్నారనీ, మోటారులలో ప్రయాణం చేస్తున్నారనీ, విలాసవస్తువులకు డబ్బు ఖర్చు పెడుతున్నారనీ, పంటల వెలలు రెట్టింపు పెరిగినవనీ, అందుచేత యీ పెచ్చుశిస్తుల విధింపు న్యాయమేననీ, ప్రభుత్వం వాదించసాగింది.

కాని చివరకు ప్రజాందోళన యెక్కువగావడం, ఆ సమయంలోనే బొంబాయిరాష్ట్రంలో రీసెటిల్ మెంటు సెటిల్మెంటు వ్యతిరేకంగా, బార్డోలీ రైతుల సత్యాగ్రహం జరిగి దానిలో రైతులు జయమందుటవల్లనూ, ఆనాటి రాజకీయ పరిస్థితులవల్లనూ, ప్రభుత్వం కొంచెం దిగివచ్చింది. రీసెటిల్ మెంటు సూచనలను 1929 సం॥ వరకూ ఆపివుంచి కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలలోని రైతుల ఆర్థికపరిస్థితులనుగూర్చి విచారించుటకు 1928 సం॥ నవంబరు 23 తేదీన ఆరోగ్యస్వామి కమిటీని నియమించింది. కాని ఆకమిటీ యిచ్చిన రిపోర్టును అమలుజరుపలేదు. రైతుల ఆందోళనమాత్రం యధాప్రకారంగా సాగుతూనేవుంది. 1931 సం॥ సెప్టెంబరు 1 వ తేదీన, రీసెటిల్ మెంటు వ్యతిరేక దినం జరుపబడింది. కిసాన్ వాలంటీరుదళాలు ఏర్పడి పని చేశాయి.

1936 సం॥లో గుంటూరుజిల్లా కలెక్టరు, ఆజిల్లా రైతుల ఆర్థికపరిస్థితులను గురించి విచారణజేసి, రైతులపై ఎక్కువపన్నులు విధించవచ్చునని ప్రభుత్వానికి సూచించాడు.

నిజానికి 1932 సం॥ మొదలుకొని రైతుల ఆర్థికపరిస్థితి క్షీణించి పోయింది. రైతుపండించు పంటలకు ధరలుపడిపోయినవి. రాజకీయంగా దేశంలో అశాంతి ఏర్పడింది. ఆసమయంలో అధికారమందున్న జస్టిస్ పార్టీ మంత్రివర్గం సహితం శిస్తులను తగ్గించడానికి వప్పుకోక తప్పిందికాదు. అందుచేత రీసెటిల్ మెంటు వ్యవహారాలలో తగుసూచన నివ్వడానికి, ప్రభుత్వం మార్షుబాంక్సు కమిటీని నియమించింది.

## మార్షుబాంక్సు కమిటీ చేసిన సూచనలు.

(1) 1914 సం॥ దరిమిలా జరిగిన రీసెటిల్మెంట్సు అన్నీకూడా నిలుపుచేయాలని, కృష్ణా, గోదావరి డెల్టాలలోని నీటితీరువాలో రు 0-8-0 రెమిషన్ యివ్వవలసినదిగానూ,

(2) భూమిశిస్తులోనూ, నీటితీరువాలోనూ కూడా వకే 'బేసిక్ రేటు' వుండాలనీ,

(3) రాష్ట్రఆదాయం తగ్గిపోయినప్పుడు భూమిశిస్తుమీద కొంత % ఎక్కువ వసూలు చేసుకోవచ్చుననీ;

ఈ సూచనల ననుసరించి 1937 సం॥లో కాంగ్రెసు మంత్రివర్గం, 1914 సం॥ దరిమిలా జరిగిన రీసెటిల్మెంట్సును రద్దుచేస్తూ, నీటితీరువాలో కూడా రు 0-8-0 రెమిషన్ యిచ్చింది.

కాని ఇప్పుడుమళ్ళీ ప్రభుత్వం, నీటితీరువాలో తగ్గించిన రు 0-8-0లు మినహా, తక్కిన భూమిశిస్తు మినహాయింపులన్నీ 1353 ఫసలీలో రద్దుచేస్తామని ప్రకటించింది. దీనికి కారణం? "యుద్ధావసరాలకు డబ్బు కావాలని, ధాన్యపుధరలు 1922 సం॥ నాటి ధరలతో చేరుకున్నాయి గనుక, రైతులను శిస్తురెమిషన్ల ననుభవించనియడంలో అర్థంలేద"ని చెబుతోంది.

రైతుల ఆర్థిక సౌష్ఠవం ఇదివరలోకంటె యిప్పుడు ఎక్కువకాలేదని, జీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగినందువల్ల 100 కి 80 మంది రైతులు చాలా కష్టాలు పడుతున్నారనీ, అందుచేత యీ సౌకర్యాలను రద్దు చేయగూడదనీ మనం ఆందోళన చేయాలి.

## రైత్వారీ భూముల శిస్తువిధానంలో అనుసరించవలసిన మరి కొన్ని సూచనలు:

(1) మెరకభూములలో రెండవ పంటకు శిస్తు విధించకూడదు.

(2) ఎల్లప్పుడూ నీరు లభ్యమయ్యే భూములను రెండు పంటల భూములుగా రిజిష్టరుచెయ్యాలి. ఇటువంటివాటిలో మొదటి పంటకు విధించబడిన శిస్తులో రెండవపంటకు సాధారణంగా సగం విధించాలి. నీరు లేకపోతే రెమిషన్ యివ్వాలి.

(3) నీరు తోడుకుని సాగుచేస్తే య 1కి 0-8-0 లు తగ్గించవచ్చు.

(4) మొదటి, రెండవ పంటల శిస్తులను కలిపివేయవచ్చు. అలాంటి సందర్భాలలో రెండవపంటకు, మొదటిపంట శిస్తులో, 1వ తరగతి ఇరిగేషన్ క్రిందనయితే, $\frac{1}{2}$ న్నూ, 2వ తరగతి ఇరిగేషన్ క్రింద $\frac{1}{3}$ న్నూ, 3 తరగతి క్రింద $\frac{1}{4}$ న్నూ. 4 తరగతి క్రింద $\frac{1}{5}$ న్నూ, 5వ తరగతినుండి పైన ఎన్నివున్నా $\frac{1}{6}$ వంతున్నూ కలపాలి. ప్రికేరియస్ వెట్ అయితే యీ రేటులలో సగం విధించాలి.

(5) భూములన్నీ మెరక, పల్లం, మానవరి అను మూడుభాగాలుగా విభజింపబడాలి. మానవరి భూములంటే నీటి ఆధారంతో పెరిగే చెట్లుగల భూములు. సాధారణంగా యివి వర్షాధారంతో పెరుగుతూవుంటాయి. వీటికి మెరకకూ, పల్లంకూ వున్న మధ్యరేటు విధించాలి. మెరకను పల్లంగా గాని, పల్లాన్ని మెరకగాగాని, మానవరి భూముల్ని, మెరక లేక పల్లంగా గాని, మార్చడానికి కలెక్టరుకు అధికారమున్నది.

(6) దొరువుల (భావుల) క్రింద సాగయ్యేభూమిని మెరకక్రిందనే లెక్కకడతారు. ఒకే మోటక్రింద సాగుచేస్తే మెరకరేటున్నూ, రెండు మోటలతో సాగుచేస్తే, మెరకకూ పల్లానికీ మధ్యరేటుమీద $\frac{1}{4}$ లేక $\frac{1}{5}$ వంతు కలిపి, వసూలు చేయవచ్చు. రెండవపంటకు శిస్తులేదు. కాని పల్లంగా నిర్ణయించిన ఈనాంకు మాత్రం యీ మినహాయింపులు చెల్లవు. దొరువులనగా:—నదులు, వాగులు, జలాధారముల ప్రక్కన వూటవూరే గోతులు లేక భావులు.

(7) సర్వే చేయబడని జిల్లాలలో ఎక్కడైనా అదివరకు తేలిన భూమి మొత్తంలో పదోవంతుకు మించిగాని, తగ్గిగాని వున్నప్పుడుమాత్రమే భూమియొక్క ఎక్కువతక్కువలు (జాస్తికమ్మీలు) అంగీకరించబడతాయి.

(8) ధరలనుబట్టిగాని, భూముల తరగతులనుబట్టిగాని తరములు నిర్ణయించవచ్చు.

**మనంకోరే శిస్తు విధానం:**

1930 సం॥లో రైతాంగముయొక్క ఆర్థిక పరిస్థితినిబట్టి "శిస్తు" నిర్ణయం జరగాలని ఆందోళన చేయబడ్డది. కాని ఈనాడు మనం రైతు యొక్క వ్యవసాయ ఖర్చులకూ, జీవనానికీ సరిపోయేటంత ఫలసాయం వచ్చే భూమిమాత్రమే వున్నవారిపై "శిస్తు" అసలే వసూలుచేయకూడదనీ అంతకుమించిన ఆస్తులున్నవారిపై తరగతివారీగా శిస్తులు విధించాలనీ కోరుతున్నాం

**చదువవలసిన పుస్తకాలు:**

(1) నేటి భారతదేశం (2) ఆరోగ్యస్వామి కమిటీరిపోర్టు (3) బోర్డు స్టాండింగ్ ఆర్డర్సు (4) గోదావరి రైతులపక్షాన ప్రచురించబడిన "రీ సెటిల్ మెంటు" అనే కరపత్రం.

---

# గ్రామోద్యోగుల మాన్యువల్.

పరిపాలనా విధానం క్రిందినుంచి మీదివరకు కట్టుదిట్టంగా జరగాలనంటే గ్రామమునుంచి రాజువరకు పునాది వేయవలసిన అవసరముంది. ఆ పరిపాలనా పునాదియే గ్రామోద్యోగుల నిర్ణయం. గ్రామంలో పాలకులను సమర్థిస్తూ, వారి కార్యక్రమంలోని లోపాలను మంచివిగా ప్రచారం

చేస్తూ, ప్రజలలో ఐక్యత రానీయకుండా చూచుటకు యీ గ్రామోద్యోగులు అవసరం. ప్రతి ఒక్కరూ స్వాధీనపర్చుకున్న భూమి వివరం, దానిలో యే పంట వేసేది, దానివిలువ, దానికున్న యిరువులు. దానికైన యే పన్నులు విధించి ప్రభుత్వానికి అందజేయవచ్చు, ఎవరికెవరిని యేవిధంగా ప్రభుత్వ అనుచరులుగా స్వాధీనపర్చుకుంటే పరిపాలనా విధానం బీటలువారి దీనిలోని ప్రజాహింస ప్రజలకు తెలియకుండావుంటుందో దానికి తగిన సర్వయత్నాలను ఆయువుపట్టు యీ గ్రామోద్యోగుల నిర్ణయం.

యీ విధానం అదివరలో వుండినను దానిరూపాన్ని స్పష్టపర్చి దాని వుపయోగాలను ప్రభుత్వానికి రుజువుపరుస్తూ, యీ వుద్యోగులు ఏ కుటుంబాలలోనుంచి ఏర్పడాలో, వారిని వంశపారంపర్యా ప్రభుత్వపు దాసులుగా చేయుటకు యీనాములు యిచ్చుటెంత అవసరమో, వారి పాత్ర ఏవిధంగా నిర్వహింపబడాలో స్పష్టంగా చాణక్యుడు కాలంలో నిర్ణయించబడినది.

గ్రామ పెత్తందారీ కుటుంబంగావుండి, ఆనాటికి గ్రామస్థులందరి మీద నోరుగొట్టుకు బ్రతికే కుటుంబాలనుంచి మునసబులను, ఆనాటి వ్యవహారదక్షత కలిగిన కుటుంబాలనుంచి కరణాలను, మూకవరకంలో రక్షకుడుగా వుండతగిన వారినుంచి మొహతాదులను ఏరి, పెత్తందారును గ్రామానికి సర్వాధికారిగాను, అనుచరుడుగా మొహతాదును, గుమాస్తాగా కరణంను ఏర్పరచి వీరిలో కరణం, మొహతాదులకు యినాములిచ్చారు. వీరికి హంగుదారులుగావుండి, ప్రజలకు నిత్యావసర వృత్తులుగలిగిన పేలాలను ప్రభుత్వాధీనంలో వుండునట్లు చాకలి, మంగలి, మాదిగ, వడ్రంగి, కుమ్మరి మొదలైనవారికి యీనాములిచ్చారు.

గ్రామంయొక్క ఆయువు యావత్తు కరణంచేతులో రికార్డువల్ల ఇమిడి వుంటుంది. మునసబు అధికారరీత్యా మాత్రమేకాని, పీడనావిధానం ఆయనచేతులో వుండదు. పై విధానంలో కొలది మార్పులు జరుగుతూ

వచ్చినవి. ఈ ప్రభుత్వంలో జీతముల పద్ధతి ఏర్పరచేవరకూ కరణం, మొహతాదుల జీవనం కొంతవరకు గ్రామాలమీద ఆధారపడివుండేది. లవాజమ్మాలని, జమీందారీ గ్రామాలలో పుట్టిశలగలని, సైకడా విధానము వుండేది. గవర్నమెంటు గ్రామాలలో లవాజుంమాలు, సైకడా విధానాలుండేవి. అంటే, గ్రామ మొత్తం రివిన్యూలో నూటికి యింత కరణముకని. ఈ విధానం నైజాములో యింకనూ "సైకడా" పేరుతో అమలులోవుంది. కరణం (పట్వారీ) నూటికి 5-0-0 మునసబు (పోలీసుపటేలు) 2-8-0 మణేదారు (మాలీపటేలుకు) 2-8-0 చొ॥ వున్నాయి. జమీందారీలో, రైతులకు పండిన ధాన్యంలో పుట్టికి యింతఅనే నిర్ణయం.

ఇవి రానురాను మారి, వంశపారంపర్యా హక్కు వుంటూ జీతాలుగా మార్చారు.

| | | | |
|---|---|---|---|
| గవర్నమెంటులో — | కరణం | 15-0-0 | కొన్నిచోట్ల రూపాయి చొ॥ తక్కువవున్నవి. |
| | మునసబు | 12-0-0 | |
| | మొహతాదు | 7-8-0 | |
| జమీందారీ — | కరణం | 9-0-0 | దీనిలో కొన్ని గ్రామాలలో రూపాయి చొ॥ తక్కువవున్నవి. |
| | మునసబు | 7-0-0 | |
| | మొహతాదు | 6-0-0 | |

గ్రామోద్యోగులకు వంశపారంపర్యా హక్కువుండుటవల్ల, తరతరముల రికార్డూ వారిచేతులలో యిమిడిపోవుట, వారిని తీసివేయుటకు జిల్లా వుద్యోగులకు కూడా సంపూర్ణాధికారం లేకపోవుటచే, రానురాను వారిలోని నిరంకుశత్వం పెరిగిపోయింది. చట్టాలకు వ్యతిరేకంగా ప్రవర్తించుట ఆచారంక్రిందికి మారిపోయింది. వారి చిత్తవృత్తే చట్టం కాబోలుననుకునేస్థితి ప్రజలలో ఏర్పడిపోయింది. యిందువల్ల ప్రజలకు ప్రాణసంకటస్థితి ఏర్పడ్డది. కలెక్టరు ఆర్డరిచ్చిననూ, కరణం యిష్టంలేకపోతే నిరర్థకంగా పరిణమించుట మనకు అనుభవంలోని విషయం. వీరికి నిర్ణయించిన పరీక్షలుకూడా నామ

మాత్రమైనవే. అధికారులు కూడా వంశపారంపర్యా హక్కులుండుటవల్ల ఏమీ చేయలేరు. వీరిలో నిరక్షరకుక్షులుగూడా బయలుదేరుటకు అవకాశ మిస్తున్నది. ఈ విధానంలోని చెడును గ్రహించి మార్చుటకు- కాంగ్రెసు పాలనలో ప్రకాశంగారి ప్రయత్నంకూడా జరిగింది. దాని ప్రధాన నినాదంగా కూడా తీసుకోవలసిన అవసరంవుంది వీలునుబట్టి.

## గ్రామోద్యోగులు.

1. మునసఫ్, వీరినే ప్రాంతాలనుబట్టి పటేలు, నాయుడు, రెడ్డి, పెద్దకాపు, అని పిలుస్తూవుంటారు. పటేలు, రెడ్డి, నాయుడు, శబ్దాలు రాయలసీమలో కొన్ని ప్రదేశాలలో వాడుకలోవున్నవి. పటేలు నైజాం స్టేటంతా వాడుకలో వున్నది.

2. కరణం, లేక పట్వారీ అని మాత్రమే పిలువబడుతున్నారు. పట్వారీ నైజాములో మాత్రమే

3. వెట్టి (సహజంగా మాదిగకులసులుగా వుంటారు.)

4. మొహతాదు. వీరికే తలారి, మజ్కూరు, అనే పేరులుకూడా వున్నాయి. మజ్కూరు నైజాములో దాని సరిహద్దుప్రాంతాలలో 'తలారి' రాయలసీమ ప్రాంతాలలోను వుంది.

5. నీరుగంటి: యుతరజలాధారములలోని నీటిని జాగ్రత్తచేసి పంచే వారుగా వుంటారు.

## వీరి విధులు.

### గ్రామ మునసఫ్.

జిల్లాకు జిల్లాకలెక్టరు, ఎవిధమైన అధికారో, గ్రామానికి మునసబు అంతటి అధికారి. అనగా జిల్లాలోని అన్నిశాఖలలోని బాగోగులు, ప్రజల యొక్కల్లు పరిపాలనలోని లోట్లు, ప్రజలకు ప్రభుత్వమునకుగల సంబంధముకు

కలెక్టరెలా బాధ్యుడుగా పనిచేయాలో, ఆ బాధ్యతలు గ్రామసంబంధంగా మునసబుకున్నవి. గ్రామానికి సంబంధించిన సివిల్, క్రిమినల్, అధికారములనుకూడా కలిగివున్నారు. యీయన పరిపాలనకు సంబంధించిన వాటిలో ముఖ్యమైనవి బందెలదొడ్డి, జననమరణాలు, రహస్యరిపోర్టు (Confidential Report) ఆరోగ్యం, అంటువ్యాధులు, పశువైద్యం, నేరములు, సి. టి. యాక్టు, గ్రామకోర్టు, అగ్నిప్రమాదం, ఆకస్మికమరణం, పోలీసువారి సంబంధం, మొదలైన రికార్డులన్నీ వుంటవి. రెవిన్యూ వసూలు గవర్నమెంటు గ్రామములో పూర్తిగాను, జమీందార్లో యీనాములసంబంధం వుంటుంది. దానికి సంబంధించిన చిఠాలు. గ్రామంలో పశువులకు, మనుష్యులకుగల అనారోగ్యంను గురించి, దోపిడీలు, దొంగతనాలు, ఆకస్మిక మరణాలు, యితరవిధము లేమైనా వెంటనే పైఅధికార్లకు రిపోర్టులుచేస్తూ గ్రామమును కాపాడుతూ వుండాలి.

## జనన మరణాలు.

దీనికి కొన్ని గ్రామాలలో (కంపల్సరీ) నిర్బంధ విధానం అమలులో ఉంది. యీ విధానం మ్యునిసిపాల్టీలు, పంచాయతీబోర్డులు వున్నచోట వాటి ఆధీనంలో వుంటుంది. మ్యునిసిపాల్టీలలో ప్రత్యేక ఆఫీసుఉద్యోగి వుంటారు. పంచాయతి బోర్డులలో ఆ ఆఫీసులే. లేనిగ్రామములలో మునసబులు, వీరివద్దకు ప్రజలు, జననం 14 రోజులలోను, మరణం 3 రోజులలోను వెళ్ళి విధిగా చెప్పాలి. అలా చెప్పకపోతే రు 25 0-0 లు జరిమానా వరకు యీ నేరముకు విధించుట కధికారం వుంది. యీవిధానం 2000 జనాభా గలిగిన గ్రామాలలో వుండాలని ఏర్పాటువుంది. కాని కొన్ని తక్కువ జనాభా గలిగిన వూళ్ళలోకూడా వుంది. యీ సిఫార్సుచేయుట హెల్తు ఆఫీసరు డ్యూటీ. మిగతా గ్రామాలలో మొహతాదే గ్రామంలోని విషయాలు తెలుసుకొని రిజిష్టరులో వ్రాయించుతాడు. యీరిజిష్టరుల ప్రాముఖ్యత చాలావుంది. ఆస్తిపాస్తుల తగాదాలలో తదితర అవసరములకు పయో

నిర్ణయాలు, జననమరణ స్థళాలు, నిర్ణయించుకొనుటకు ధృవపత్రంగా పనికి వస్తవి. వీటినకళ్లు తాలూకా ఆఫీసులలో దొరుకుతవి. కొన్ని సంవత్సరముల వరకు మాత్రమే దొరుకును. (ఆవివరాలు తాలూకాలో తెలుసుకోవాలి.

వర్కర్లు.

ఏ ప్రాంతంలో పనిచేస్తామో ఆ ప్రాంత గ్రామాలలోని (Compu_lsary) నిర్బంధ విధానమున్న గ్రామాలు లేనివి, తెలుసుకొని ప్రజలలో విధిగావెళ్ళి చెప్పవలసిన బాధ్యతను తెలియపర్చి, యీకేసులకు లోనుగాకుండా చూడాలి. యీ అదునుగా మునసబు ప్రజలను బానిసలుగా వాడుకొనుటను మాన్పించి ప్రజలకు క్రమపద్ధతి నేర్పాలి.

బందెల దొడ్డి.

యీ దొడ్డి ప్రతిపూరా వుండవలసినదే. పైరు చెడిపోకుండా కాపాడుకొనుటలో ప్రధానమైనది. కాని దీనిమీద సర్వాధికారాలు మునసబు, మొహతాదుల చేతిలోవుండి దీనినుంచి వారికి ప్రతిఫలముండుటచేత ప్రజలను హింసించుటకు వారికి దాసులుగా చేసుకొనుటకు వీలున్నది. అందుకుగాను దానివిషయములను తెలుసుకొని ప్రజలకు తెలిపి క్రమపద్ధతిని నడపాలి.

దొడ్డికి పశువులకు సూర్యోదయం, సూర్యాస్తమయాలకు మధ్య కాలంలోనే తోలుకవచ్చి పెట్టాలికాని రాత్రికాలంలో పెట్టరాదు. దొడ్డికివచ్చే పశువులను అడ్డగించుట పనికిరాదు. తోలుకొచ్చే రైతును యిష్టపర్చుకొని మాత్రమే అపుచేసుకోవాలి కాని అడ్డగించుట చట్టరీత్యా నేరము. యిందుకు 50-0-0 వరకు జరిమానాకాని, 6 నెలలు శిక్షకాని వేయవచ్చు. రెండూ వేయవచ్చు. ఇది కేసు బలాబలంమీద ఆధారపడివుంది. దొడ్డిలోని గొడ్లను తోలుకువెళ్లే ప్రయత్నము ఎన్నడూ చేయరాదు. యిది ప్రబలమైన

నేరము. దొడ్డిలో పెట్టిన పశువులకు వివరంగా నిర్ణయింపబడిన ఫారము గల రశీదును యివ్వాలి. వదలించుకున్నవారికి కూడా డబ్బుకు రశీదుయివ్వాలి. యీ రెండుసార్లుకూడా వారి సంతకాలు డూప్లికేటుమీద చేయించుకోవాలి. ఇదిమాత్రం సాధారణంగా జరుగుటలేదు. మునసబు యిష్టానుసారం, దూడలు పెద్దవిగాను, పెద్దవి చిన్నవిగాను మారుతూవుంటవి. అడ్డురాకపోయినా బనాయించి కేసులు పెట్టుటకుకూడా వీళ్ళున్నవి.

వీరి కమీషను.

నెలకు రూపాయికిమించని బందె వసూళ్ళైతే తాలూకాకు యిరసాలు చేయకుండా మునసబుగారు తీసుకోవచ్చు. అంతకుమించిన దానిలో సగం భాగం మునసబుకు, రూపాయికి 0-2-0 మొహతాదుకు వస్తుంది. ఈమాదిరిగా మునసబుకు 20-0-0 లకు మించకుండాను, మొహతాదుకు 2-0-0 లకు మించకుండాను వున్నంతవరకే. అంతకుమించి ఎంత వసూలైనా, యీ మొత్తములే వారికివస్తవి. యిందును గురించి బందెలదొడ్డి విషయంలో చాలా ద్రోహం జరుగుతూవుంటుంది. దొడ్డిలో, నీళ్ళతొట్టి, చావడివుండాలి. దానిలోని పేడ, పబ్లిక్‌గా వేలంవేయాలి. యిదిమాత్రం ఎక్కడా జరుగదనేచెప్పాలి. రశీదులు యివ్వకపోవుటను గురించి కాని, పెద్ద, చిన్న విషయంలోగాని తగిన ఆధారాలతో తహస్సీలుదారుకు తెలియపర్చుకొని విచారణకు తేవాలి. దొడ్డిలో అజలేని పశువుల విషయంలో 7 రోజులైన తరువాత పోలీసుస్టేషనుకు రిపోర్టుద్వారా తెలియజేసి, 14 రోజులైన తరువాత వేలానికిపంపాలి. వేలం జరుగుక ముందుగాని, జరిగి పశువు స్థలంలో వుండగాగాని, అసలుదారువస్తే, అప్పటివరకు అయిన మేతఖర్చు, బందె, వేలం ఖర్చులు మొదలైనవియిస్తే పశువును వదలుతారు. (సహజంగా మేతవేయరు) లేక వేలంజరిగిన నెలలోగా తన పశువేనని రుజూపర్చుకుంటే ఖర్చులుపోను మిగతాసొమ్ము తాలూకా ఆఫీసులో తెచ్చుకోవచ్చు. దానికి

కావలసిన విధులతో రుజూపర్చుకోవాలి. దొడ్డికి ద్వారం వుంచి ఆసామీ తన పశువునుచూచి గుర్తించుకొనుటకు తగిన అవకాశం వుండి రాలి.

బందె.

గేదె, దున్న 0-12-0. ఆవు, ఎద్దు, గిత్త 0-6-0

దూడ 0-6-0. దూడ 0-3-0

గొర్రె, మేక, పంది 0-3-0.

హెల్తు.

గ్రామంలో అంటువ్యాధులుంటే వెంటనే హెల్తు డిపార్టుమెంటుకు రిపోర్టు వ్రాసి కావలసిన మందులు తెప్పించి వైద్య సహాయం జరుగునట్లు చూడాలి. ఆ సమయంలో అవుసర గ్రామ పారిశుధ్యంకు ఏర్పాట్లుచేయాలి. బావులలో మందులు కలుపుట వగైరా. పేడకుప్పలు, యితర మురుగులు తీయించాలి. యీ విధానం మామూలుగా చేయరు. అలాంటప్పుడు గ్రామ రైతుసంఘం వెంటనే చర్యతీసుకోవాలి. అంటువ్యాధివల్ల, మరణించిన వారు, తగిలినవారు, దాని పరిణామం వివరంగా తెలుపుతూ, హెల్తు డిపార్టుమెంటుకు, తహసీలుదారుకు రిపోర్టుచేసి రప్పించాలి.

టీకాలు.

వీటిని గురించి ప్రజలలో సద్భావం లేదు. యేదో బలవంతంగా చూస్తారు. యీభావం లేకుండా దాని లాభాన్నికూడా చెప్పి క్రమపద్ధతులలో నడచి దానివల్ల వచ్చే చిక్కులు రాకుండా కాపాడాలి. జనన రిజిష్టరునుబట్టి పిల్లలకు, టీకాల రిజిష్టరునుబట్టి యితరులకు ఎవరికి వేయవలసిన మునసబు లిస్టుయిస్తాడు. ఆ ప్రకారం వాక్సినేటరువేస్తాడు. పల్లెకు స్థలాలలోవుండి వేయాలిగాని ఒకే స్థలానికి అందరినీ రమ్మని నిర్బంధించరాదు. ఒకసారి వేయించుకుని, పాక్సినతరువాత పది సంవత్సరాలవరకు నిర్బంధం లేదు. అనారోగ్యంగా వున్నప్పుడు నిర్బంధించరాదు. అలా నిర్బంధంగా

పిల్లలను వేయాలంటే వ్యతిరేకించి మన కారణాలు వజూపర్చుకోవచ్చు. కారణంలేకుండా వ్యతిరేకిస్తే కేసులుపెట్టి జరిమానా విధింపజేయుటకు వీలున్నది. ఘోషా స్త్రీలను యింటికొచ్చే వేయాలి. యీ కేసుల విషయంలో మునసబు కలుగకపోతే వాక్సినేటరు ఏమీచేయలేడు. మేలు కీళ్ళను యితనే కారకుడు.

## న్యూసెన్సు కేసులు.

పల్లెలలో సహజంగా బజారులను మురుగునీరు వదలుట, స్నానాలు బజార్లలోచేయుట (వీధలు) పెంటకుప్పలు మురుగునీటితోవుండుట, బావుల ప్రక్క గోతులు పెట్టుట అలవాటు. వీటినుంచి వచ్చే వ్యాధులు, నష్టాలు పరిహారం చేయాలి. ఏమాత్రం వీలున్నా న్యూసెన్సు కేసులు వస్తాయి. వీటిలో ప్రధాన కారకుడు మునసబు. యీకేసులు పెట్టినప్పుడు, మేజిస్ట్రేటులుకూడా, నేరం ఒప్పుకోవలసినదిగాను [illegible] నమ్మించి డిఫెన్సులేకుండాచేసి, 1-0-0 లేక 0-8-0 లు జరిమానాలు వేస్తుంటారు. వీటిని అన్యాయమైనప్పుడు సమిష్టిగా విమర్శించి విచారణ జరిపించుమనే అలవాటుచేయాలి. విచారణలో సహజంగా నిలుపవు. మరొకసారి యీతంతు చేయుటను తగ్గిస్తారు.

## పశువ్యాధులు :

పల్లెలలో పశువైద్యం జరుపుచున్న డిపార్టుమెంటు సరైన ప్రచారంలో లేదు. దీని విషయంలో ప్రభుత్వసాయం ఇంతవరకు పొందుటలేదు. కొంతవరకు ఆ వైద్యం ఎలా ప్రయోజనకారో చెప్పాలి. అలాంటి వ్యాధుల సమయంలో మునసబుచేత రిపోర్టు చేయించాలి. ఆయన చేయక పోతే రైతువర్గాన్ని ఎన్నిగొడ్లకు; ఏవ్యాధి, ఎంతమందు కావాలి, ఎంత వ్యాపకంలోవుందీ తెలుపుతూ పశువైద్యశాఖకు, తహశీల్దారుకు వ్రాయాలి. వచ్చినతరువాత పెద్దకాపు యింటివద్దనో, మునసబు యింటి

వద్దనో వుండి వారి గొడ్లకు మాత్రం వేసి అయిపోయిందనే విధానం మాన్పించి పబ్లిక్ స్థలంలో వుండి దామాషాగా గ్రామ పశువులన్నిటికీ అందునట్లు చేయాలి.

## నేరములు :

గ్రామంలో దొంగతనం, దొమ్మీ, కొట్లు, తిట్లు, మొదలైనవి జరిగినప్పుడు రిపోర్టు చేయాలి. ఆస్తికాని, నేరస్థుడు కాని పరారీ అవుతుందనే నమ్మకం కలిగినప్పుడు దానిని తన స్వాధీనంలో వుంచుకుని పోలీసులకు అప్పచెప్పాలి. అలా మనం స్వాధీన పర్చాలి. ఎప్పుడో పోయినవాటికి, ఆధారంలేనివాటికి ప్రత్యేక కేసులు పెట్టుకోవలసినదే కాని మునసబు కలిగించుకోనడు.

## ఆకస్మిక మరణాలు :

అగ్నిప్రమాదంవల్లగాని, నీటిలోపడిగాని, మరణించినప్పుడు ఏ జ్యూరిస్‌డిక్షనులోనిదో ఆ జ్యూరిస్‌డిక్షను పోలీసుస్టేషనుకు వెంటనే రిపోర్టు పంపాలి. పోలీసువారు వచ్చేవరకు లేదా పంచాయితీ చేయవలసినదని పర్మిషనుయిచ్చుటకాని జరిగేవరకు మునసబు సర్వాధికారి. పంచాయితీకి సభ్యులుగా వుండుటలో (న్యాయమైన కేసుకు) ప్రజాహితపరులుగా వుండేవారినే వుంచుతూవుండాలి. వుండుటకు ఘుడిపించుట తప్పని తెలియపర్చాలి. పంచాయితీలో పంచాయితీదారులకు సర్వాధికారాలు వున్నవి. ఆ ఫారంలో వారి అభిప్రాయం వ్రాయవలసినచోట న్యాయం వ్రాస్తే పోలీసువారు ఏమీ చేయలేరు. కాని మామూలుగా ఎవరో కూర్చుంటారు. వారికి పోలీసువారి చిత్తానుసారం పరిస్థితులనుబట్టి వారభిప్రాయంకూడా వ్రాయించుతూ వుంటారు. దీనిలోని దురాగతాన్ని బాగా ప్రచారంచేసి పంచాయితీదారుల అన్యాయాల్ని ఎదుర్కోవచ్చు. అప్పటికే పెట్టే కేసులు బలహీన పడిపోతవి. శవాలను పోస్టుమార్టం కొరకు హాస్పటలుకు

పంపుతామని, అంత్యక్రియలను ప్రశ్నమనివ్వకుండా బెదిరించుమూలంచాలు పొందుతూ వుంటారు. భావిలో పడినప్పుడు ఏయుటకు ప్రయత్నించినా మరణించినప్పుడు శవాన్ని బయటికి తీయరాదు. నీటిపై వేలాడగట్టి వుంచాలి. (నీటి కానించి)

సి. టి. యాక్టు :

యీ చట్టం కొన్ని జాతులనే నేరస్థులక్రిందికి చేర్చి స్త్రీ పురుషులను బాధించే చట్టం. దీనిలో ఎరుకల, ఏనాది, దొమ్మర, లంబాడి జాతులున్నవి. వీరంతా యీ చట్టప్రకారం మునసబుకు ఎల్లప్పుడూ సేవ చేయవలసి వస్తున్నది. పరాయిగ్రామం వెళ్ళుటకు, మునసబు పాస్‌పోర్టు కావాలి. వారు ఏవూరువెళ్ళితే ఆగ్రామ మునసబుచేత అక్కడికి చేరినట్లు రిపోర్టు చేయించుకోవాలి. రాత్రిపూట ఎప్పుడుపిలిస్తే అప్పుడు హాజరు చెప్పాలి. పగలుకూడా స్వంతపనికి గ్రామంలో వున్నట్లు రుజూ చేసుకోవాలి. వీటిలో దేనికి లోపించినా 6 నెలల శిక్ష. అంతతో మంచివాడు కూడా కె. డి. ల లిస్టులో చేరుతాడు. యీ బాధతో వాళ్లు మునసబుకు, పోలీసులకు చాకిరిచేసి బతకాలి. లేకపోతే ఎ శిక్షకో వీలుంది. అప్పీలు లేదు. కావాలంటే ప్రజల సాక్ష్యం కావాలి. మేలు చేయాలంటే మునసబుకు కొంత వీలుంది. మునసబు పోలీసు కలవాలి. ప్రజలుకూడా వారి నడవడికను రుజూపరుస్తూ మహజర్లు పెట్టి కృషిజేస్తేకూడా ఫలితం వుంది.

ఎక్సైజు డిపార్టుమెంటు.

కల్లు, సారా, గంజాయి, నల్లమందు దుకాణాలు పాటలుపాడించుట పాటదారుల సితిగతులను నిర్ణయించుట కల్లు, సారా, దుకాణములకు స్థలం నిర్ణయించుట, యిజారాదారుకు మోతుబరీ సర్టిఫికెట్టు యిచ్చుట, మునసబుప్యాటీలు, యీ దుకాణాలు ఏవి రాత్రిపూట తెరువరాదు. రొక్కంగాక ఏవస్తువు తీసుకొని యివ్వరాదు. నిర్ణయింపబడిన మొత్తములు

గాక హెచ్చు యివ్వరాదు. సారాలో నీరుకలుపుట, కల్లు కలిసినవి వుంచుట పనికిరాదు. యివన్ని మునసబు ఎప్పుడైనా పట్టుకోవచ్చు. డిపార్టుమెంటుతో సహా మునసబుకూడా యీ వృత్తిపనులు చూస్తూవుంటారు.

వీటికి సంబంధించిన డబ్బు మునసబుద్వారాకూడా కట్టవచ్చు. ఇతర గవర్నమెంటుకు కట్టవలసిన టక్కావీ అప్పులుగాని, ఋణపరిష్కార చట్టపు అప్పు వాయిదాలుగాని మునసబుద్వారాకట్టి రశీదు పొందవచ్చు. పట్టానంబరు శిస్తుతెలిసివుంటే శిస్తు ఏ మునసబుకైనాకట్టి రశీదు పొందవచ్చును.

## గుంపులు.

బిచ్చలవిడిగా తిరిగే బుడబుక్కల, చెంచు, గుంపులుకాని లేక పూర్వముండే మరాఠీ గుంపులుగాని, యిప్పుడు కరువుప్రాంతాలనుంచి వచ్చేవారినిగాని, కట్టడిలోవుంచి వారివల్ల ప్రజలకు యిబ్బంది కలుగకుండా కాపాడి పంపాలి. అవుసరమైతే ప్రజల సహాయం, పోలీసు సహాయం పొందే అధికారంవుంది.

## సర్టిఫికెట్లు.

వాజ్యాలకు వకాల్తనామా, జామీనుదారుకు ఆస్తినిర్ధారం, గ్రామకాపురస్తుడని నిరూపించుటకు, బీదవిద్యార్థులకు, సాక్షులకాని, ముద్దాయికాని, కోర్టుకు హాజరుకాలేనపుడు మునసబు సర్టిఫికెట్ యిస్తే చెల్లుతుంది.

## రహదారులు.

వీటికి చట్టరీత్యా ఫారంవుంది. కాని నేడు అంతగా ఆచరణలోలేదు. గ్రామపెద్దలుకాని, అమ్మినవారుగాని యిస్తూవున్నారు. కాని దూరంవెళ్ళేటప్పుడు తినుబడిసరుకైనపుడు, పచ్చిపల్లలకు మునసబు ద్వారా తీసుకొనుట మంచిది.

## గ్రామ మునసబు కోర్టు.

ఈ కోర్టు పెట్టుకొనుటకు కొందరికిమాత్రమే అధికారమున్నది. వారు సబుకలెక్టరు పర్మిషనుతో కోర్టు నడుపుకోవచ్చు. వీరికి రూపాయిలోపు ఖరీదుగల చోరీ కేసులు విచారించుటకు 12 గంటలు తన కస్టడీలో నేరస్తుని శిక్షించుటకు అధికారమున్నది. 50-0-0 ల లోపు బాకీలుకూడా పరిష్కారం చేయవచ్చు. వీటి అప్పీలు హైకోర్టుకు తప్ప ఏకోర్టుకు లేదు. విచారించేటప్పుడు మాత్రం మరొకగ్రామ మునసబుకు ట్రాన్స్ఫరు కోరుకోవచ్చు. దీనిలో మునసబులకుకూడా కష్టాలుండుటచే ఆచరణలో తక్కువవున్నవి.

## పంచాయితీ కోర్టులు.

వీటిలో గ్రామాధికారులు సభ్యులుగా వుండవచ్చు. వీటిలో 5 గురకు తగ్గకుండా సభ్యులుండాలి. వీనికి గ్రామంలో నివసించు ప్రతివాడు ఓటరు. దీనిఎన్నికపై అధికారం తహసీల్దారుది. వీరు 50-0-0 లకు మించనివి విచారించే అధికారం వుంది. యివి ఒకవూరుకుగాని కొన్నిటికి కలిపిగాని వుండవచ్చు. దీనిమీద డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు అప్పీలు అధికారంవుంది. మరొక కోర్టుకు ట్రాన్స్ఫరుకూడా కోరవచ్చు.

## శిస్తు వసూలు.

కరణంయిచ్చిన లెక్కప్రకారం వసూలుచేసి దానిని జాగ్రత్తగా తాలూకాకు యిరసాలు చేయుట దాని వసూలు విషయంలో జప్తులుచేయుటకు అధికారం కలిగివున్నారు. జప్తులు, దుక్కిటెద్దును, విత్తనాలను చేయరాదు. అన్ని విధాలా ప్రయత్నించి ఆఖరుకిస్తీ ఆఖరులోకాని డిమాండు చేయరాదు. కాని మొదటికిస్తీ మొదటితేదీనుంచి అన్యాయాలుచేస్తూ వుంటారు. ప్రాసెస్సుఫీజు 11 వ తేదీ నుంచే అలజడిచేసి వసూలుచేస్తూ వుంటారు. అదికూడా చాలాభాగం చిఠాను జమకట్టరు. అది చట్టవ్యతిరేకమే. దానిమీద అప్పీలుచేసుకోవచ్చును. దీనిని జనవరి, ఫిబ్రవరి,

మార్చి కిస్తీలలో వసూలు చేస్తారు. కొన్ని ప్రాంతాలలో ఏప్రిలు కిస్తీ కూడా వసూలు చేస్తారు.

శిస్తు విభజన :

శిస్తు 1-6-0 కట్టవలసివుంటే ఆ 1-6-0/4 నాలుగు భాగాలు చేస్తే 0-5-6. మొదటకిస్తి 0-5-0, రెండవది 0-5-0, మూడవది 0-12-0 వసూలు చేస్తారు. పరిశీలనగా లెక్క చెప్పాలంటే కరణం చెప్పాలిసిందే. మునసబు తన యింటివద్ద వుండి వసూలుచేయరాదు. గ్రామ బహిర్గంగ స్థలంలోనే చేయాలి.

కరణం.

వీరికి చట్టరీత్యా గ్రామపెత్తనంగాని, సివిల్, క్రిమినల్ పవర్సు లేకపోయినప్పటికీ, దాదాపు గ్రామ గుమాస్తాగా చట్టరీత్యావున్నా గ్రామఆయువుపట్టు, ప్రతివానిని ఏదోవిధంగా చేపట్టి తన స్వాధీనములో వుంచుకొనుటకు సంబంధించిన రికార్డు చేతిలోసుండుటవల్ల దాదాపు ప్రతి గ్రామంలోను మునసబు నామమాత్రమై, గ్రామంలో కరణమే సర్వత్రా వ్యవహరించుతూవుంటాడు. సాధారణంగా రైతుల నేదోవిధంగా పీడించుచూ విపరీత లంచాలు తీసుకొనుట పరిపాటి అయింది, అందువల్ల ప్రతి చిన్న విషయంలోను శ్రద్ధగా తెలుసుకుని ఓపికగా వ్యవహరించినపుడే ఆతని ఆట కట్టించగలుగుతాము. అందుకు ప్రధానంగా గ్రామలెక్కలు తెలిసికొనుట, దస్తావేజులు, ఖరారునామాలు, క్రాలుఖుస్తులు, యితర పిటీషనులు, శుభలేఖలుకూడా వ్రాసి అతని ప్రాముఖ్యతను తొలగించాలి. కలిసివచ్చేచోట ఐక్యతతో పనిచేయాలి.

యీయనవద్ద అసామీభుక్తం వివరంగా, మాగాని పల్లం రేటు, శిస్తు, సెన్సు, ఎన్ని నంబర్లు లెటర్లతోసహా తెల్పు 10వ నంబరు. అడంగులు, దీనిలో గ్రామగుడికట్టు 1 మొదలు తుదినంబరువరకు భూమి నంబర్లు ఏసం

బడు ఎవరిదైనది. పోరంబోకలు, వాగులు, శిస్తు తెలుపునది ఫీల్డుబుక్కు, గ్రామంలోని అన్నిభూముల ఆకారాలు, వాటి సరైన కొలతలతో. సాగుబడి (అదరకం) ఏ రైతు, ఏభూమిలో, ఏ పైరు, ఎంత వేసినది తెలుపు రిజిష్టరు.

సర్వేరాళ్ళ రిజిష్టరు:—ఏ నంబరుకు ఎన్ని రాళ్ళున్నది తెలుపుతుంది. 6 వ నంబరు తీరువ జాస్తీకి నీటి ఏరువకు సంబంధించినది. దీనిలో ఏసంవత్సరం ఎంత అధనం మాగాని సాగుచేసినది తెలుపుతుంది. జమీందారీ గ్రామాలలో ఎ. రిజిష్టరు, సాముదాయకభూములు వివరంగా తెల్పునది. కిస్తీబంది. అందాజా డిమాండు. యీ రెండు దాదాపు ఒక మాదిరిగానే వుంటవి. కిస్తీకి నెలముందు, వసూలుచేయుటకు ఏపట్టాకు ఎంత ఎవరు యివ్వవలసినది కిస్తీలవారీగా వివరముగా వ్రాసి తాలూకాకు పంపాలి. అక్కడ ఆమోదించి పంపిన తరువాత మునసబుకు లిస్టుయిస్తారు. కిస్తీబందీకూడా కిస్తీల వారీగా రైతు యివ్వవలసినది తెలుపుతుంది —. ఆకరిమణాల రిజిష్టరు మొదలైన లెక్కలువుంటవి.

వీటిలో రైతుకు అవుసరమైనవుడు, "గ్రామోద్యోగుల స్వాధీనములో నున్న ఎ. బి. పర్మనెంటు రిజిష్టరులలోని నమోదులను గ్రామలెక్క నెం. 1, 2, 2ఎ, 6, 7, 10, 13, 14, 16 ర్లలోని నమోదులను, సర్వేస్థానములలోని నమోదులను, పొలపుకొలత పుస్తకములలోని నమోదులను అవి తనకు ఎంతవరకు సంబంధించునో లేదా తనకు బాధ్యతగలభూమికి ఎంతవరకు సంబంధించునో అంతవరకు వాటికి రుసుము చెల్లించే నక్కరలేకుండా తనిఖీ చేసుకొనుటకు లేదా వాటిని గూర్చి వ్రాసుకొనుటకు రైతులు అనుమతింపబడుదురు. గ్రామ లెక్క 1, 2, 2 ఎ, 6, 7, 13, 14, 16 వ విషయంలో యీ అనుమతి ప్రస్తుత ఫసలీకిని, దానిపూర్వపు ఫసలీకిని మితపరుపబడినది. (గ్రామోద్యోగుల మాన్యూయల్ 5 వ అధ్యాయంలో 16 వ సెక్షను 175 పేజీ.)

యీ పై విధంగానే చట్టరీత్యా అధికారమున్నా నేడు ఒక నంబరుకు రూపాయిలు యిస్తేనేగాని బయటికి వచ్చుటలేదు.

## సర్వే రాళ్ళు.

యివి మన భూములకు ఎక్కడున్నవో (జమీందారీలో యీనాములకు తప్ప) చూచుకుని వుండాలి. వాటిని బయటికి కనపబ్బుతూ కంపగాని కోరడి (కర్రి) గాని వేయాలి. పుట్టలు పెరిగితే త్రవ్వుతూవుండాలి. అలా చేయనపుడు నష్టపడుట తప్పదు. కరణం. ప్రతి సంవత్సరం యీ రాళ్ళను తనిఖీ చూస్తాడు. మనకు తెలియకుండా మన పొలాల దగ్గరకు వెళ్ళి చూస్తాడు. ఆయనకు రాయి కనపడకపోతే లేదా రాయి పోయినదని వ్రాస్తే వెతికినఫీజు, రాయి భూమికి చేరుటకు చార్జి, రాయిఖరీదు యిదంతా రైతులిచ్చుకోవాలి. పీకిపారేసినట్లు రుజూఅయితే శిక్షకు పాత్రులగుతారు. కనుక జాగ్రత్తగా వుండాలి.

## తీరువజాస్తి 6 వ నంబరు.

దీనిలో కరణం కొంటెతనం చెప్పశక్యం కానంత వుంటుంది. అనధికార సాగులు, గండిసాగులు, గవర్నమెంటు నీటితో సాగయ్యే జమీందారీ భూమి, మురుగుసాగులు, మొదలైనవన్ని దీనిక్రిందకొస్తాయి. ముఖ్యంగా డెల్టా గ్రామాలలో గండిసాగులు పెట్టినా పెట్టకపోయినా ఒక నంబరులో కొంత తడిస్తే అంతా తడిసిందని యీ మాదిరిగా వ్రాస్తారు. యిల్లాంటివాటిమీద పెనాల్టీలు పడుతూవుంటవి. (Single water rate) ఒక రెట్టు పడుటకు అనేక రెట్లు పడుతూవుంటవి దీనితో రైతు కరణం గారిని ఆశ్రయించుతాడు. యీ లెక్కలు ప్రధానమైనవనే కరణం గారి రిమార్కులు. తరువాత రెవిన్యూ యినస్పెక్టరు. తహస్సీలుదారు. దీనిని జాగ్రత్తగాచూచి తగువిధంగా ఎదుర్కోవాలి.

## నీటి దరఖాస్తు.

పైన చెప్పబడిన అనధికార సాగులు వగైరా వాటికి ముందుగా నీటి దరఖాస్తు పెట్టుకోవాలి. ప్రతి సం॥ మార్చి 31 లోగా పెట్టుకోవాలి. దీని మీద కరణం దస్కతు వుండాలి. ఆయన చెయ్యకపోతే ఆలాంటిదరఖాస్తులన్నీ తహస్సీలుదారువద్దకు తెచ్చి ఆయన ఎందుకు చేయనన్నది రిపోర్టు యివ్వాలి. అందుమీదట తహస్సీలుదారు విచారించి చేయించుతాడు. యీ దరఖాస్తులు పెట్టుటలో గడువుదాటితేగాని పెట్టకపోయినా రెట్టశిస్తు పడుతుంది. యీదరఖాస్తులు మంజూరుఅయి వచ్చేటప్పటికి ఆగస్టువరకూ పడుతున్నది. తరువాత కరణంగారు వారిష్టమొచ్చినప్పుడు పాట్టికియిస్తారు. అందువల్ల మనం యేతేదీన పంపినది నోటుచేసి, సకాలంలో రాకపోతే సాగుచేసిన తేదీ, తిరిగి వచ్చిన తేదీ రుజూచేయగలిగితే పెనాల్టీలు తప్పుకో గలుగుతాం. యీ విధానంలోని లోపాలు వాటినెలా ఎదుర్కోవాలో విధిగా చెప్పాలి.

## రెమిషన్లు.

భూములు రిమిషనుకోరే పరిస్థితికి వచ్చినప్పుడు నిలువుమీద వుండగానే కేసువారీ దరఖాస్తులు పెట్టుకోవాలి. అందుమీదట కరణం రిమార్కులు ప్రధానమైనవిగావుంటవి. తహస్సీలుదారు తనిఖీ సాధ్యమైనంత వరకు నిలువుపైరుమీదనే జరిగేటట్లు చూడాలి. కోసినతరువాత కుప్పలు తనిఖీవరకు ఆపాలి. యిందులో తొందరపడితే నష్టపడుతాము.

## జమాబందీ.

ప్రతిసంవత్సరం సంవత్సరంపొడుగునా జరిగినపని, ట్రాన్స్ఫరులు, రిమీషను, తీరువజాస్తీలు పరిశీలించుటకు జరుగుతుంది. రైతుసంఘాలు ఏ తాలూకా జమాబందీ ఎప్పుడో తెలుసుకోవాలి. వర్కరులందరూ వారి ప్రాంతాలలోని ట్రాన్స్ఫరులు, తీరువజాస్తీలు, రెమిషనులు, పేరుతబ్దీలు,

మొదలైన విషయములు పూర్తిగా వివరాలతో, స్టేటుమెంట్లు తీసుకొనుట, అర్జులు పెట్టుట చేయించి జమాబందీకి హాజరుకావాలి. తాలూకాలవారీగా ప్రెసిడెంటుగారు, కార్యదర్శిగారు, యీ తెచ్చిన వివరములు విపులంగా జమాబందీ ఆఫీసరుకు చెప్పగలగాలి. కరణం రిమార్కులలోని తప్పులు ఆధారములతో చూపగలగాలి. అప్పటికీ రెట్లు వేస్తే నెలరోజులలోగా జిల్లా కలెక్టరుకు అప్పీలు చేయాలి. జమాబందీ ఆఫీసరు కలెక్టరైనాసరే, జమాబందీ ఆర్డర్ల నకళ్లు తీసుకొని విడివిడిగా అప్పీలు చేయాలి. ఒకదానిమీద పదిమందిగా చేయరాదు. (బోర్డు స్టాండింగు, కలెక్టరుస్టాండింగు ఆర్డరులు తెలుసుకోవాలి)

అప్పీలులోగా పెనాల్టీ వసూలుపరిస్తే క్రమముకో స్టేఆర్డరు తెచ్చుకోవాలి. ఆ ఆర్డరులేకపోతే కట్టి రిఫండుకోరాలి గాని కట్టకపోవుట కూడదు.

## ఆక్రమణలు.

సాముదాయకభూములు ఆక్రమించుటలో గల పొరబాటును విపులంగా ప్రచారంచెయాలి. పెనాల్టీలు కడుతూవుంటే తనకే ఖాయపడుతుందనే అభిప్రాయంతో కొందరు కడుతూవుంటారు. యిదికూడా పొరపాటభిప్రాయం. విడగొట్టుటకు అధికారముంది. యిలాంటివి జరిగినపుడు కరణం బి. ఫారం బుక్కుచేస్తాడు. దీనిద్వారా విపరీత లంచాలు వసూలు చేయబడుతూ వుంటవి. వీటివిషయంలో ఏమాత్రం అశ్రద్ధ పనికిరాదు. రైతులలో ప్రబోధం చాలా అవుసరం.

## పట్టా ట్రాన్సుఫరులు.

రిజిష్ట్రారు ఆఫీసునుంచి యీ ఫారములు రాగానే కరణం ఆ ప్రకారం నమోదు చేయాలి. కాని కరణం ఫారంరాగానే రైతునుపిలిచి నీపేర లెక్కలలో వ్రాయాలి. ఏమన్నా! లేకపోతే ఏదోవంకపెట్టి త్రిప్పివేస్తా

నసుబ వంకలు పెట్టుట జరుగుతుంది. అందువ ముందుగానే మనం నంబరు లెటరు, హద్దులు క్రమంగా వ్రాసుకోవాలి. జమీందార్ గ్రామాలలో జమీందారుల ద్వారానే ట్రాన్స్ఫరులు జరగాలి అలా జరుగక వచ్చినవారి పేరుతో కూడా పట్టాలుండి అనేకేతుల యిబ్బంది పెడుతూ వుంటారు. (వీరి గురించి యస్టేట్సులాండు ఆక్టు ప్రారంభంలో వివరిస్తారు.)

## కరణం యిచ్చే సర్టిఫికేట్లు.

రెవిన్యూ రుణాలకు, టకావీ అప్పులకు, భూమితనఖా బ్యాంకు అప్పులకు, కో-ఆపరేటివ్ సొసైటీ ఆసి అప్పుల సెటిల్మెంటుకు, భూమి తనఖా బ్యాంకులకు మునసబు దస్కతు (జమీందార్ గ్రామమైతే జమీందార్ సర్టిఫికెటు శిస్తుబాకీ లేదని) కూడా వుండాలి. కరణం దస్కతు యీనం బంజర్ల భూములు సరైన విస్తీర్ణంతో భుక్తంగలిగివున్నాడని రుజూ చేయుటకు అక్కరవస్తవి. యిందులో దేనికైనా అతను దస్కతు చేయకపోతే సరైన ఆధారాలు సంపాదించుకుని తహసీల్దారు దగ్గర దాఖలుచేసి దస్కతులు చేయించుకోవచ్చును. వర్కరులు తగిన కారణాలు జాగ్రత్తగా సేకరించాలి.

## సర్వే.

సర్వే చేసేటప్పుడు భుక్తదారుకు తెలియపర్చి చేయాలి. భుక్తదారు చూపిన ప్రకారం సర్వే చేసి, తప్పుంటే తరువాత దానిని రుజూపర్చి తీసేయాలి. మెరకకు 10 సెంట్లు, మాగానికి 5 సెంట్లు హెచ్చు తగ్గులున్నా తగాదా లేదని నిరూపించాలి. సర్వేలో లేతే కమ్మీజాస్తీలు ఆ రైతుకే వుండాలి. సర్వేకి భుక్తదారు విధిగా వెళ్ళి తనభూమి సరిహద్దులు చూపించుకోవాలి. — యిది సెటిల్మెంటు అప్పుడు మాత్రమే వచ్చే సమస్య.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రలో వాడుకపదాలు:- | మాగాని, | మెరక | కృష్ణా, గుంటూరు |
| నైజాము, కర్నూలు ప్రాంతం | నంజ | పుంజ | ఉభయ గోదావరి |
| లోను వాడుకలో వున్నవి. | తరీ | ఖుష్కీ | ప్రాంతాలలో -. |

## గవర్నమెంటులో కూడా జాయింటు పట్టాలు.

వీటిని గ్రూపు విధానమంటున్నారు. గ్రూపువిధానంగానే అందాజా డిమాండులో వుండి, చిల్లరలు, హెచ్చుతగ్గులూ వసూలవుతూవుంటవి. కాని ఎవరిమీదనో ఒకరిమీద పట్టా రద్దూ కాగా వసూలగుచుండును గనుక, వాటి వల్ల ఉన్న చెడు మనకంతగా తెలుసుకొను అవకాశం లేకపోతున్నది. యిక జమీందారీ గ్రామాల యీనాముల విషయంలో యింకా ఎక్కువ చిక్కుగా వున్నది. యీనాములలో ఒక టైటిలు డీడ్ క్రింద చాలామంది భుక్తదారు లుంటారు. వారందరికి సరీగా విడదీయక కరణంగారి యిష్టానుసారం జరుగు తుంది. ఒకరికిలేకుండాకూడా చేయవచ్చు. అలా చాలా బాధలున్నవి. జమీం దారీలో పెంచి ఎప్పుడో సమ్మరీ దాఖలవుతుంది. దీనిలో ఎవరిదగ్గరో ఒక చోట ఆ మూడు కిస్తీలలో వసూలగుట మాత్రమే జరుగుతుంది.

## వర్కరులు చేయాల్సినది.

గ్రామోద్యోగులు, గ్రామంలోవుండేవారు. వారి అనుచరులు, బంధు వులూ వుంటారు, వారికండగా. అందుచేత వారుచేసే ప్రతి అన్యాయాన్ని గురించి ముందు ప్రజలందరికీ విరివిగా ప్రచారంచేసి అందరికీ తెలుపాలి. కరణంగారి దగ్గరకు పోకుండావుండేలాగున మనకు ఈ రైతుసంఘం అండగా నిలుస్తుందనే నమ్మకం గలిగించాలి. అందుకు ప్రధానమైనవి రైతుకు కావ లసిన ప్రతి కాగితం వ్రాయగలగాలి. కరణం తప్పులు వివరంగా చూప గలగాలి. ముఖ్యంగా దస్తావేజాలు, అన్నదమ్ముల భాగాలుపంచుట, తగా దాలుతీర్చుట చేయాలి. అందుకు ఉపాయాలేగాక సాధారణ అవుసరాలకు తగిన విషయాలు అన్నీ నేర్చుకోవాలి. అప్పుడే మనం రైతులకష్టాలు నివారించ గలుగుతాం.

---

# పుగాకు పైరు - చట్టాలు.

మనదేశంలో వుత్పత్తి అయ్యే వ్యాపార పంటల్లో పుగాకు ప్రధానమైనది. ప్రపంచ మొత్తంమీద వుత్పత్తయ్యే పుగాకులో నాల్గవవంతు మన భారతదేశం పండిస్తుంది. దీనిలో హెచ్చుభాగాన్ని బ్రిటిష్‌వారి ఐ. యల్. టిడి, కంపెనీ ఖరీదు చేస్తుంది. దేశంలో తయారయిన సరుకులో నూటికి 15 వంతులు మాత్రమే విదేశాలకు, ప్రధానంగా ఇంగ్లాండు మార్కెట్టుకు, చవకపారు చైనాకు ఎగుమతి చేయబడుతుంది. మిగతా పుగాకు మనదేశంలో విదేశ పెట్టుబడిలో నడుపబడే యంత్రాగారాలకు, కొద్ది పెట్టుబడిలో నడుపబడే స్వదేశ యంత్రాగారాలకు పోతుంది.

## పుగాకు వ్యాపారం.

మనదేశంనుండి జరిగే పుగాకువ్యాపారం మూడుమార్గాల జరుగుతూవుంది. ఒకటి ఐ. యల్. టిడి, మొదలగు విదేశ కంపెనీలద్వారా రెండు స్వదేశ కంపెనీలు పెద్ద వ్యాపారులద్వారా, మూడు యిప్పుడిప్పుడు రైతులే చొరవతీసుకొని విదేశముల కెగుమతిచేయుట ద్వారా జరుగుతోంది.

రైతాంగములో స్వయముగా పుగాకును ఇంగ్లాండు పంపుదామనే కోర్కెగల్గి రైతులే విదేశవ్యాపారము మొదలుపెట్టువరకు దేశీయ వ్యాపారులు దీనిని అరికట్టుటకు యత్నాలువేశారు. విదేశ వ్యాపారులతో రాయబారాలు నడిపి యెగుమతిచేయుటకు మంచి సరకును మాత్రమే సిఫారసు చేస్తామని వాగ్దానమిచ్చి ప్రధానంగా వ్యాపారులతోకూడిన సర్టిఫైయింగ్ కమిటి నొకదానిని గుంటూరులో సృష్టించారు. ప్రపంచ మార్కెట్టులో మనదేశ సరకుకు ప్రాముఖ్యత తగ్గకుండా చూడ్డానికిది అవుసరమని, ధర్మపన్నాలు మొదలెట్టారు. దీనిని రద్దుచేయవలసినదిగా రైతుసంఘాలు తీర్మానములు కూడ చేశాయి.

ఇక సరుకు తూకం వేసే సందర్భాలలో జరిగే దగాలు అనేకం. వ్యాపారులు తారం పేరుతో చెక్కకు 10 పౌనులుకూడ ఎనివేసిన రోజులున్నాయి. యిప్పటికి కూడ కొన్నిచోట్ల తీసివేస్తున్నారు. మార్కెటింగ్ సౌకర్యాలు దానికి సంబంధించిన చట్టాలులేవు. పొగాకు వ్యాపారం విషయంలో రైతు అననుకూలమైన పరిస్థితులలో నుండుటవల్ల రైతు తన సరుకును పెండెలుకట్టుకొని కంపెనీలకు తీసికొనివెళ్ళడం, కంపెనీ ప్యాకింగ్ సందర్భంలో సరకును చిందరవందర చేయడం; పేరెం పోయిన సరుకు గిట్టింపు కాదని గ్రేడింగ్ క్యూరింగ్ ఖర్చులకు డబ్బు అవసరమని వ్యాపారి అడిగిన ధరకు సరకును పోగొట్టి రావడం జరుగుతూంది. పొగాకు వ్యాపారం రైతుల కనుకూలంగా లేదనిచెప్పాలి.

## ఆంధ్రరాష్ట్రంలో మార్కెటింగ్ సౌకర్యాలు.

ఆంధ్రరాష్ట్రం పొగాకుపండించే ప్రదేశాలలో ప్రధానమైనది. గుంటూరుజిల్లా యిపుడిప్పుడు కృష్ణా, గోదావరి జిల్లాలు పొగాకును హెచ్చుగా పండిస్తున్నాయి. రైతుసంఘాలు పొగాకు రైతులకు మార్కెటింగ్ సౌకర్యాలు కలుగజేయవలసినదిగా ఆందోళనను చాలాకాలంనుండి సాగిస్తున్నాయి. దీని ఫలితంగా 1933 కమర్షియల్ క్రాపు మార్కెటింగ్ ఆక్టు ననుసరించి 1939 లో గుంటూరుజిల్లాలో బెజవాడ తాలూకా కలిపి పొగాకు మార్కెట్ కమిటీ నొకదానిని మద్రాసు ప్రభుత్వం నియమించింది. 1940లో గుంటూరుజిల్లా కమిటీని, బెజవాడ తాలూకా కమిటీని విభజించింది. ఈ కమిటీలు మార్కెట్టును క్రమబద్ధం (Regulate) చేయటానికని ఉద్దేశింపబడ్డాయి కాని ఈ కమిటీలకున్న అధికారాలు బహుస్వల్పం. రైతులను వ్యాపారులను తాము నిర్ణయించిన మార్కెటులలోనే వ్యాపారం జరుపుకోవాలని నిర్బంధించుటకుగాని, వ్యాపారులు బిగదీసుకొంటే లేక రైతుకు వ్యాపారి యిచ్చే ధరలు గిట్టుబాటు కాకపోతే రైతు సరకులు హామీగా నుంచుకొని రైతు కవసరమైతే వ్యవసాయానికి కర్చులకు, గ్రేడింగ్‌లకు

అప్పులనిచ్చుటకుగాని, సరకును విదేశాలకుపంపి రైతుకు ధర రాబట్టిపెట్టుటానికిగాని ఈ కమిటీల కధికారంలేదు. గుంటూరు కమిటీ పెండెకు మూడు పౌన్లకంటె ధారం తీసివేయరాదని నిర్ణయించినప్పటికీ పెండెలో పుగాకేగాక కోసవుండిగాబట్టి తమ యిష్టంవచ్చినంత తీసివేస్తాము వ్యాపారులు పేచీపెడితే రైతు ప్రతినిధులమనుకొనే వారికి మెజారిటీ వున్నప్పటికి కమిటీ మెదలకుండ కూర్చున్నది.

## పుగాకుపై మద్రాసు ప్రభుత్వపు పన్ను.

మార్కెట్ కమిటీలవల్ల ప్రయోజనము లేకపోయినప్పటికి కమిటీల పన్నులు మాత్రం భారంగానే వున్నాయి. పైగా మద్రాసు ప్రభుత్వం విధించిన పుగాకు వస్తువులపన్ను వ్యాపారఅమ్మకపు పన్నులవల్ల రైతులకూ, పుగాకునుపయోగించే బీదప్రజలకూ పరోక్షంగా పెద్దదెబ్బ తగుల్తుంది. వ్యాపారావకాశమును తీసికొని ఈ పన్నులను రైతులనుండి, యిటు పుగాకు వస్తువులనుకొనే బీదప్రజలనుండి గుంజుతున్నారు.

## కేంద్ర ప్రభుత్వ పన్నులు.

కేంద్రప్రభుత్వం దేశరక్షణ కవసరమైన యుద్ధబడ్జెటును పూర్తిచేయుటకు పుగాకుపైపన్ను విధిస్తూ పుగాకు ఎక్సైజుబిల్లును ప్రవేశపెట్టినది.

దేశానికివాటిల్లిన ఈ ఆపత్కాలంలో దేశరక్షణ కవసరమైన ధనాన్ని స్వీకరించే మార్గాన్ని యెవరూ ఆటంకాలుపెట్టరు. ఆటంకాలు పెట్టేవారికి నచ్చచెప్పవలసిన బాధ్యత ప్రజాసంస్థలపైవుంది. కాని యిందుకొరకై విధింపబడే పన్ను యిదివరకే జీవితం గడుపక కృశించిపోతున్న ప్రజాసామాన్యముపై పడకుండ చూడాలి. ముడిసరకులను చవుక ధరలకుకొని దానిలో తయారుచేయబడ్డ వస్తువులను విపరీత ధరలకమ్మి తీయులాభాలనుండి, ఈ పన్నును గుంజాలి. ఈవరకే రైతు పుగాకుమార్కెటు విషయంలో అనను

కూల పరిస్థితులలో నున్నాడు గాబట్టి ఈపన్ను పరోక్షంగాగాని ప్రత్యక్షంగాగాని రైతుపై పడకుండా చూడాలి. ఈపన్నుభారం వల్లనేగాక పరోక్షకారణాలవల్ల మనదేశీయ పరిశ్రమలు వ్యాపారం దెబ్బతినకుండా చూడాలి.

## ఈ చట్టంవల్ల నష్టాలు.

1. వుత్పత్తిదారైన రైతుకు:- కనీసధర నిర్ణయించక పోవుటచేత పన్ను భారము పరోక్షంగా రైతుపైబడుతుంది. విద్యావిహీనులైన రైతుకు దరఖాస్తులు పెట్టడం దినచర్యలు వ్రాయడం మొదలగు బాదరబందీ దెచ్చింది. కొటాలు రాష్ట్లలోని వుంచాలని వేర్ హౌసులైసెన్సు, క్యూరర్ లైసెన్సు పొందాలనీ యిందుకు స్టాంపుడ్యూటీ చెల్లించాలని యుండుటచేత రైతు ప్రత్యక్ష నష్టానికికూడా గురిఅవుచున్నాడు. యిక పెనాల్టీలకు అంతేలేదు.

2. పొగాకువస్తువుల నుపయోగించే బీదప్రజలకు: బీదరైతులు కూలీలు హెచ్చుమంది చవుకపొరుచుట్ట, బీడీ, సిగరెట్లు, నుపయోగించుతారు. యిదివరకే మనరాష్ట్రంలో మద్రాసుప్రభుత్వం విధించిన పొగాకువస్తువుల పన్ను వ్యాపారఅమ్మకపుపన్ను మార్కెటు కమిటిపన్నులతో బాధపడుతున్న బీదలకు యిది పెద్దదెబ్బ.

3. అధికార్లకు యిష్టంవచ్చిన పెనాల్టీలు వేయడానికి చివరకు రైతుకు స్వంత వుపయోగానికి అవుసరమైన పొగాకు నుంచుకోవడానికికూడ అధికారి దయమీద ఆధారపడవలసి వస్తుంది.

## పొగాకు ఎక్సైజుచట్టం - రైతుబాధ్యతలు.

కేంద్రప్రభుత్వం ఈచట్టాన్ని ఆధారంగా తీసికొని రూల్సుకూడా ప్రకటించింది. యిది చదివితే రైతుబాధ్యతలు స్పష్టంగా వుంటాయి. రెండవ రూలు ప్రకారం కవులుదారు ఎవరైనా పొగాకుపండించిన భూమికలవాడే వుత్పత్తిదారవుతాడు కాబట్టి పొగాకుపన్నుకు భూమికలవాడే బాధ్యుడు.

## పొగాకు పండించే వాని హోదాలో రైతు బాధ్యతలు.

1. 10 యకరములకు పైగా తోటవేయు రైతు టి. ఇ. 1 ఫారం మీద అందులో కోరబడ్డ విషయాలు తెలియజేస్తూ నాటువేయకముందే అధికారికి దరఖాస్తు వ్రాసియివ్వాలి. 10 యకరములకు లోపుగా తోటవేసే రైతు అందుకు అధికారి వచ్చినప్పుడు తెలియచేయాలి. (5వ రూలు)

2. 10 యకరములకు పైన పొగాకు వేసే రైతు అధికారి వుచితంగా యిచ్చే టి. ఇ. బి. 1 పుస్తకంలో ఈక్రింది విషయాలు యెక్కిస్తుండాలి. (11 వ రూలు) అధికారి కోరినపుడు చూడడానికి కాని అందులో కొంత యెత్తి వ్రాసుకొనుటకు గాని, లేక తిరిగి యివ్వమన్నచో యిచ్చివేయాలి. అందులో వ్రాయవలసిన విషయాలు. (ఎ) నారుమళ్లు పెట్టేనాడు గాని తోట వేసేనాడు గాని ఆ లేదీ చల్లిన విత్తనాలరకం లేక నారురకం యెంత భూమిలోనో, వివిధ రకాలువుంటే యేరకం క్రింద యెంత భూమి వ్రాయాలి. (బి) పొగాకుగాని, నారుగాని యితరులవద్దనుండి తెచ్చినపుడు లేక యితరులకిచ్చినపుడు, లేది, యెవరునుండి తెచ్చారో లేక యెవరు యిచ్చారో వారి చిరునామా, మొక్కలైతే యెన్ని, యేరకము; పొగాకైతే ఎంత, ఎరకమో వ్రాయాలి. (సి) ఆకు విరచుటకు 48 గంటలుముందు తాను ఒలుపు ప్రారంభింపదలచిన తేది. యెండించుటకు ఆకును తీసికొని వెళ్ళనెంచుకొన్న పలమూ వ్రాయాలి. (డి) క్యూరర్ (యెండించి బాగుచేయువాడు) పాకాపు పచ్చియాకును తీసికొని వెళ్లుటకు 48 గంటలముందు యే చిరునామా గలవారి పాకాపునకు యెప్పుడు తీసికొనివెళ్ళవలసినదీ వ్రాయాలి. (ఇ) ఆకును తీసికొనివెళ్ళిన తరువాత తీసికొనివెళ్లిన తేదీ, ఆకుబరువు అంచనా, వీలుంటే తూచి తెలుసుకున్న బరువు నమోదు చేయాలి. (యఫ్) యేటి మొక్కల నారు తప్ప యే యితర పొగాకు తలవద్దకు చేరినా యెవరినుండి చేరిందో వారి చిరునామా, యేరకం యెంతో పుస్తకంలో యెక్కించాలి. (జి) టి. ఇ. బి. పుస్తకంలో యేదైన నమోదుచేయునపుడు తేదీవేయాలి.

కొట్టివేతలు, తుడుపులు వుండరాదు. నమోదుచేసిన విషయాలలో అన్నిభాగాలు సత్యాలయి యుండాలి.

3. పుగాకు ఎండించి తూనికపూర్తి అయిన వారంరోజులలోగా ఎంత పొలంలో పండించింది. పొలముస్థితి ఎరకము ఎంత, టి. ఆర్. 1 ఫారంలో వ్రాసియివ్వాలి.

5. ఎండించి బాగుచేయువాని హోదాలో.— నూరు మణుగులకు 16 పుట్ల 228 4/7 పౌనులు పుగాకుపైగా యెండించి బాగుచేయదలచిన రైతు తాను క్యూరింగు గోడిండు నిల్వచేయుటకు యేయే స్థలముల నుపయోగింపదలచింది తెల్పుతూ టి. ఎ. 1 ఫారంపై 5 రూ విలువగల ఎక్సైజు రివిన్యూబిళ్ళను పోస్టాఫీసులోగాని ఫారంపై అతికించి అధికారి కందచేయాలి. నూరు మణుగులకు లోపల యెండించి బాగుచేయదలచిన రైతు అధికారి యిందుకు వచ్చినపుడు తెలియచేయాలి.

5. నూరు మణుగులకు పైగా క్యూరుచేయు రైతుకు అధికారివుచితంగా యిచ్చే టి. ఇ. బి. 1 పుస్తకంలో ఈ క్రింది విషయాలు నమోదుచేయాలి. (ఎ) తాను పండించునట్టిగాని లేక యితరులు పండించినట్టిగాని, పుగాకు క్యూరుచేయబడుటకు తన ఆవరణలోనికి చేరినప్పుడు పుగాకు స్థితి, పండించినవారి చిరునామా, పుగాకుబరువు తనకు చేరిననాడే పుస్తకంలో నమోదు చేయాలి. (బి) పుస్తకంలో ఏది నమోదుచేసినా తేదీ వేయాలి. తుడుపులు, దిద్దులు వుండరాదు. అన్ని విషయాలు సరిగా వుండాలి. (సి) ఏటి మొక్కల నారుతప్ప యేయితర పుగాకు తన ఆవరణకు చేరినా యెవరినుండి చేరిందో వారి చిరునామా, ఏరకం, ఎంత అనేది తన పుస్తకంలో ఎక్కించాలి.

6. 100 మణుగులకుపైన క్యూరింగు చేసేవారు క్యూరింగు పూర్తయిన వారంలోగా ఎంత పుగాకు తన ఆవరణలోకి వచ్చింది. ఎవరినుండి ఎంత

ముదలగు విషయాలు టి. ఆర్. 2 ఫారంలో పూర్తిచేసి అధికారికి యివ్వాలి.

7. పుగాకు ఎండి వస్తువు తయారుచేయుటకు అనువైన స్థితిలో నున్నప్పుడు సరకు బాగుచేసినవాడు పన్ను చెల్లించుటకు బాధ్యుడు. సరకు చేసినవాడు అధికారికి తెలిపి ఆయనకు సంతృప్తికరంగా వ్యాపార లైసెన్సు, ప్రైవేటుబాండెడ్ వేర్‌హౌస్ లైసెన్సు పొందినవారికి యీ సరుకు మార్చవరకు క్యూరర్ మీదనే యీ పన్నుబాధ్యత వుంటుంది. (9 వ రూలు) రెవిన్యూబోర్డు ప్రత్యేక పరిస్థితులలో పన్నును ప్రత్యేక ఆర్డరుద్వారా రద్దు చేయవచ్చును. (10-2 రూలు) రైతు తనయొక్క లేక తన పట్టుబీడుల యొక్క స్వంత వుపయోగమునకు పండించినాడని అధికారి సంతృప్తి పడినప్పుడు అధికారమినహాయించవచ్చును. (10-1 రూలు)

8. పుగాకు ఎండినతరువాత రైతు యీ నాలుగు మార్గాలలో ఒక మార్గాన్ని అవలంబించాలి.

(ఎ) పుగాకుపై పన్ను చెల్లించి వుంచుకొనుటకుగాని, అమ్మకొనుటగాని చేయదలచినప్పుడు దాపులోనున్న అధికారికి దరఖాస్తు పెట్టుకుంటె ఆయన తన సమక్షంలో పుగాకు తూచి టి. డి. 1 ఫారములో పన్ను ఎంతో నిర్ణయించి నాటినుండి 10 రోజులలోగా ట్రెజరీలో చెల్లించవలెనని వ్రాసి యిచ్చును. పన్ను చెల్లించి అధికారిని కోరితే టి. పి. 1 రహదారీ చీటిని రైతు కోరిన ప్రదేశమునకు యిస్తాడు. టి. డి. 1 ఫారం యిచ్చిన తరువాత పన్ను చెల్లించకపోతే రైతు స్వంతమునకు యుంచుకొనవలసిన పుగాకుపోగా అధికారి స్వాధీనపరచుకొనవచ్చు. రు 1000/- పెనాల్టీ విధించవచ్చు. (14 వ రూలు)

(బి) పబ్లిక్ బాండెడ్ వేర్‌హౌసుకు సరకును టి. పి. 3 ఫారంను తానుగాని, తన తరఫునగాని సంతకంచేసి ఫారంతో తెచ్చి వేర్‌హౌసు

యజమానికి యివ్వాలి. ఆయన తనయెదుట తూకం వేయించి, బాండు వెనుక భాగాన టి. సి. 3 ఫారం నెంబరు, తేదీ, పుగాకు తూకం, వివరం, గుర్తులు పెండెలు నెంబర్లు, విలువచేసేవారి చిరునామా, దాఖలయ్యే పన్ను నమోదు చేస్తారు. తరువాత రైతు పుగాకు తనకు చూపిస్తే బాండువెనుక వ్రాసిన వివరాలకు పుగాకును సరిజూచి టి. డబ్ల్యు. డబ్ల్యు 1 ఫారంలో ఒక వారంటు యిస్తాడు. (51 వ రూలు) రైతు నియమాలను పాటించకపోతే, అద్దె, పన్ను మొదలగు ఖర్చులు కోరినప్పుడు యివ్వకపోతే పన్నుకు రెట్టింపు పెనాల్టీ చెల్లించుతానని పి. డబ్ల్యు. బి. 3 ఫారంలో బాండువ్రాసి యివ్వాలి (52 వ రూలు) తన పుగాకును చూచుకోవాలంటే ఆఫీసు టైంలో ఎప్పుడైనా దరఖాస్తుపెట్టుకొని ఆఫీసరు సమక్షంలో వేర్ హౌసులోకి వెళ్ళి చూచుకో వచ్చును (54-1 రూలు) రైతు వెంటరావడానికి ప్రత్యేక వుద్యోగి నియమింపబడినప్పుడు ఖర్చులు యిచ్చుకోవాలి. ప్రతినెలా మొదటిలో లేక అధికారి డిమాండునోటీసు పంపిన వెంటనే కలెక్టరు నిర్ణయించిన అద్దె ఖర్చులు యిచ్చుకోవాలి. (56-1 రూలు) నోటీసు అందిన 10 రోజులలోగా చెల్లించకపోతే గెజెటులో ప్రకటించి అధికారి కోరినంత సరకు నేలం వేయ వచ్చు. సంవత్సరంలోగా ఆ పుగాకు కామందు పన్నుపోను మిగతా డబ్బు తిరిగి యివ్వమని అడిగితె యివ్వబడుతుంది. (56-4 రూలు) రెండు సంవత్స రముల తరువాత పుగాకు స్వంతదారు పన్ను, అద్దెలు, బాకీలు చెల్లించి పుగాకు తీసుకొనివెళ్ళాలి. (44 వ రూలు) పుగాకును ఒక వేర్ హౌసునుండి యింకొక వేర్ హౌసుకు మార్చవలసినప్పుడు టి. డబ్ల్యు. సి. 2 ఫారంమీద 24 గంటలముందు దరఖాస్తుపెట్టి అధికారికి యివ్వాలి. పన్నుచెల్లించి పుగాకును తీసుకొని వెళ్ళదలచినప్పుడు టి. డబ్ల్యు. సి. 1 ఫారంమీద 24 గంటల ముందు దరఖాస్తుపెట్టాలి. పుగాకు అవాంతరములవలన నాశనమైనా వేర్ హౌసు యజమాని బుద్ధిపూర్వకంగా చేశాడని రుజువుచేస్తే తప్ప నష్టం యివ్వబడదు (49 రూలు).

(సి) స్వంత బాండెడ్ వేర్‌హౌస్ స్టోరురూములో వుంచుకొనవచ్చు. టి. ఎ. 5. ఫారాలమీద లైసెన్సుకు దరఖాస్తు చేయాలి. పుగాకు వుంచేగది వైశాల్యాన్నిబట్టి (రు. 2, రు. 10, రు. 20) ఎక్సైజు రెవిన్యూ బిళ్ళలను దరఖాస్తుపై అంటించాలి. అధికారి కోరితే ఒకబాండుకూడా టి. డబ్ల్యు. బి. 2 ఫారంమీద వ్రాసియివ్వాలి. పుగాకుతయారైన మరు సంవత్సరం జూన్ 30 వరకు మాత్రమే స్వంత స్టోరురూములో వుంచుకొనవచ్చు. పుగాకు నాశనమైతే అధికారికి సరియైన కారణాలు చూపకపోతే నాశనమైన పుగాకుకు పన్ను చెల్లించాలి.

(డి) వ్యాపార లైసెన్సు ప్రైవేటు వేర్‌హౌస్ లైసెన్సు వున్న అధికారికి పుగాకు అమ్మవచ్చు. టి. పి. 2వ రహదారి చీటితో పుగాకును వ్యాపార వేర్‌హౌసుకు మార్చవచ్చును.

9. ఉత్పత్తిదారు క్యూరర్ ఆవరణముగాని, క్యూరర్ ప్రైవేటు బాండెడ్ వేర్ హౌసుకుగాని, పబ్లికు బాండెడ్ వేర్‌హౌసుకుగాని పుగాకును మార్చునప్పుడు టి. పి. 3 ఫారంపై తానుగాని, తన ప్రతినిధిగాని సంతకంపెట్టి వెంటబెట్టుకొని పుగాకు తీసుకొని వెళ్ళాలి. టి. పి. 3 ఫారముల పుస్తకం అధికారికి దరఖాస్తు చేస్తే వుచితంగా యివ్వబడుతుంది. (20-2 రూలు). ప్రతి ఫారానికి లెఖ్ఖచెప్పాలి. ఫారంపోతే అధికారికి సంతృప్తికరమైన కారణాలు చెప్పకపోతే రు 2000 లు జరిమానా. ఈ ఫారం జీవితంవ్రాసిన తేది మరునాటి సాయంత్రం 6 గం|| వరకు మాత్రమే. పడవమీదగాని, రైలుమీదగాని మార్చదలచినపుడు అధికారి సంతకంతో యిచ్చే టి. పి. 2 ఫారం దగ్గరవుంచుకోవాలి. 2 శేర్ల పుగాకు మాత్రం స్వంత వుపయోగానికి యెచ్చటికైనా తీసికొనిపోవచ్చును.

10. వేర్‌హౌసులో నిల్వయున్న పుగాకుమీద పన్ను తనమీద పడకుండా చేసుకొనదలచినప్పుడు అధికారి యెదుట తగలపెట్టైనా తగల

పెట్టాలి. లేకుంటే (వ్యవసాయ అవుసరములకు) ఎరువుగా ఉపయోగింపబడునని అధికారికి సంతృప్తికరమైన రుజువునిచ్చి వుపయోగించుకోవచ్చును. (69 వ రూలు)

11. పుగాకు నిల్వవుంచుకొన్నవారు లెక్కలు వేసుకొనుటకు అధికారికి సహాయము చేయాలి. సక్రమమైన కాటా, రాళ్ళు వుంచాలి.

12. కలెక్టరుగాని, కలెక్టరుచే నియమింపబడ్డవారుగాని పుగాకు వున్నదని అనుమానపడితే యే ప్రదేశమైనా, ఎప్పుడైనా సోదా చేయవచ్చు: అడ్డగించినా తప్పు సమాచారాన్ని యిచ్చినా రు 2000/-ల వరకు పెనాల్టీ విధించవచ్చును.

13 క్యూరర్ తయారుచేసినసరుకు తూకం తనిఖీ చేయుటకు కలెక్టరు ఎక్కడికి తీసుకరమ్మనిన అక్కడకి తీసుకొనిపోవాలి.

14. పొరపాటువల్ల చెల్లించిన ఏపన్నుకూడా 3 నెలలలోగా సరియైన కారణములు చూపించి తిరిగి యివ్వమని దరఖాస్తు పెట్టకపోతే తిరిగి యివ్వబడదు. విదేశములకు ఎగుమతిపై విధించినపన్ను రు 5/-లకు హెచ్చువుంటె తిరిగి యివ్వబడదు. (80 వ రూలు)

15. కలెక్టరు ఎంత పెనాల్టీనైనా వేయవచ్చు. ఎంతసరుకునైనా స్వాధీనం చేసుకొనవచ్చు. సెంట్రల్ రివిన్యూబోర్డు అధికారం పొందిన వుద్యోగులు రు 200/-లు పెనాల్టీ రు 500/-లు విలువగల సరకును స్వాధీనం చేసుకొనవచ్చును.

16. క్రింది అధికార్లమీద కలెక్టరుకు, కలెక్టరు నిర్ణయంమీద సెంట్రల్ రివిన్యూబోర్డుకు అపీలు చేయాలి.

## కనీస కోర్కెలు.

మన కనీసకోర్కెలే మనము బిల్లులో కోరే సవరణలు:

(1) రైతులు సరుకును బాండెడ్ వేర్ హౌసులలోనే పెట్టుకోవాలి అన్న నిబంధనను తొలగించాలి. "స్వంత యింటిలోగాని, మరొక రైతు ఇంటిలోగాని వుంచుకొని ఆఫీసరుకు తెలియబర్చవచ్చు. వేర్ హౌసులకు వర్తించు నిబంధనలు ఈ రైతుల యిండ్లకు సంబంధించవు" అని చేర్చాలి.

(2) పొగాకును పండించిన సం॥నకు మరుసటి సం॥ జూన్ 30వ తేదీకి పిమ్మట రైతు తనవద్ద ఉంచుకోగూడదన్న నిబంధనను తొలగించి, స్వంతయింటిలో ఎంతకాలమైననూ ఉంచుకోవచ్చునని చేర్చాలి. యెంత వున్నది, మార్చినపుడు అమ్మినపుడు యెంత, ఎచటికి మార్చినది, అమ్మినది చెపితేచాలు.

(3). చదువురాని రైతు అనేక రకాలైన లెక్కలనూ, రోజువారీ చర్యను ఉంచాలన్న నిబంధనను తొలగించి, పొగాకును పండించు ప్రతి రైతూ వుచితంగా యివ్వబడు లైసెన్సును తీసుకోవాలనియూ, పొగాకును పండించిన పిమ్మట తాళ్ళ మదింపునుబట్టి ఉజ్జాయింపుగా తెలియబరుస్తూ, ఎక్కడవుంచాడో తెలియబరిస్తే చాలును" అనీ చేర్చాలి.

(4) పన్నును చెల్లించుటకు ఆలస్యమైననూ, టి. పి. 3 ఫారాలకు సరిగా లెక్క చెప్పలేనప్పుడునూ, శిక్షలు, జరిమానాలు వేయబడుటను తీసివేయాలి.

(5) సరుకు తూకం తనిఖీకై రైతు ఆఫీసరువద్దకు సరుకు తీసుకొని వెళ్లుటగాక, ఆఫీసరే రైతువద్దకు వచ్చి తనిఖీ చేసుకొనునట్లు మార్చాలి.

(6) రైలు, పడవలద్వారా సరుకును ఒకచోటనుండి మరొకచోటికి తీసుకొనిపోవుటకు టి. పి. 3 ఫారాలు చాలునని మార్చాలి.

(7) పచ్చిపొగాకును ఎందుకొరకైననూ తూకం వేయకూడదు అని స్పష్టపర్చాలి.

(8) రైతు ఆధీనంలోలేని కారణాలవల్ల సరుకు నష్టమైనప్పుడు తప్పక పన్ను మినహాయించబడునని మార్చాలి.

(9) రైతు తూనికపు కాటాను రాళ్ళను ఉంచుకోవాలన్న రూలును తొలగించాలి.

(10) రైతులు స్వంతానికీ, కుటుంబంలోవారికీ, జీతగాళ్ళకూ అవుసరములకుగాను మనిషి 1కి సం॥నకు 3 మణుగుల వంతున పొగాకును పన్ను చెల్లించు నవుసరంలేకుండా ఉంచుకోవచ్చునని స్పష్టపర్చాలి. ఈవిధమైన స్వంత ఉపయోగానికై క్యూరర్ నుండి స్వంత పొగాకును, పన్నులేకుండా, కొనుక్కొనుటకుగాను రైతులకు పర్మిట్లుయివ్వాలి అని జేర్చాలి.

(11) రి డ్రయింగుకై రి డ్రయింగు యాంత్రములుండే వేర్ హౌవుసులోనికి పొగాకును తీసికొనివెళ్లుటకై రైతుకు అవకాశాన్ని కల్గజేయాలి.

(12) టి. పి. 3ల జీవితం విషయంలో సరుకును తీసికొనిపోవు దూరాన్నిబట్టి, సరుకు బరువునుబట్టి, సులువునుబట్టి రైతే వ్యవధిని నిర్ణయించుకొనునట్లు జేర్చాలి.

(13) ఎక్సైజుడ్యూటీ ఆక్టుయొక్క ఉద్దేశం ఎక్సైజు డ్యూటీని వసూలుచేయుటేగాన స్టాంపు డ్యూటీ చెల్లించవలెనను రూల్సును తొలిగించాలి.

(14) పొగాకుతో కలిసివుండే గుల్ల, చూర, ముక్క మొ॥ వాటి మొత్తాన్ని పన్నువేయబడు పొగాకు మొత్తంనుండి మినహాయించాలి.

(15) చుట్టలపై పన్నును పూర్తిగా రద్దుచేయాలి.

(16) పొగాకుయొక్క కనీసపు గరిష్ఠపు ధరలను నిర్ణయించాలి. 1943 ఫిబ్రవరి 15 నాటి ధరలను కనీసపు ధరలుగా నిర్ణయించాలి.

(17) ఉత్తమ, మధ్యమ, అధమ తరగతులుగా పొగాకును విభజించి, వాటి ధరలనుబట్టి పన్ను వేయాలి. ఆక్టులోని పన్ను రేట్లను ఉత్తమ తరగతిపై వేసి, ఆ దామాషా ప్రకారం మధ్యమ, అధమ తరగతులపై వేసే పన్ను రేట్లను తగ్గించాలి.

(18) మద్రాసు ప్రభుత్వానికి చెల్లబడు పొగాకు పన్నూ, కృష్ణ, గుంటూరు జిల్లాలలోని పొగాకు మార్కెటింగు బోర్డులకు చెల్లబడు లైసెన్సు ఫీజుల మొత్తానికీ, సరిపోవునట్లుగా ఇండియా ప్రభుత్వం మద్రాసు ప్రభుత్వానికి విరాళంగా యివ్వాలి. మద్రాసు ప్రభుత్వం పొగాకుపన్నునూ, మార్కెటింగు ఫీజులనూ రద్దుచేయాలి.

(19) విదేశీ మార్కెట్టులకు ఎగుమతి చేసికొనుటకు ఎలాంటి అభ్యంతరములూ వుండకూడదు.

(20) పొగాకు ఫ్యాక్టరీలను కొత్తగా స్థాపించుట కనుమతించాలి.

రైతు సేవకులకు సలహాలు.

(1) రైతులలో చదువుకొన్నవారు చాల తక్కువమంది. చదువుకొన్న కొద్దిమందీ చట్టాలను, రూల్సును అవగాహన చేసికోగలిగినవారు కారు. ఎక్కువమంది సంతకము చేయుట మాత్రమే నేర్చినవారు. రైతులలో యీ విద్యావిహీనతవల్ల చట్టంలోనున్న తతంగమంతా నడుపలేరు. కనుక మధ్య వ్యాపార్లూ, బ్రోకర్లూ, వీరిని మోసగించుటకు ఎక్కువ అవకాశం గలదు. ఇట్టిమోసం జరుగకుండా చూచుటకు రైతువర్కర్లే రైతులకు సహాయంచేయుటకు పూనుకోవాలి.

(2) రైతువర్కర్లు యీచట్టాన్ని, రూల్సును, చట్టంలోవున్న లోటుపాట్లను, సవరణలు, రైతులబాధ్యతలు, రైతుపెట్టవలసిన దరఖాస్తులు, వ్రాయవలసిన లెక్కలు యివన్ని తెలిసికొని, రైతులలో ప్రచారం చేయాలి.

(3) రైతుసంఘ కార్యాలయంపెట్టి అందులోనే రైతులకు దరఖాస్తులు వ్రాసిపెట్టుట లెక్కలు తయారుచేసిపెట్టుట చేస్తూ రైతులను స్వార్థపరుల చేతులలో పడకుండా చేయాలి.

(4) ఎ. పరిశ్రములపైన తోటవేసే రైతులకు టి. ఇ. ఫారాలు పూర్తిచేసి, స్వయంగా అధికారి కందించే ఏర్పాటు చేయాలి.

బి. క్యూర్ చేసే రైతుచేత నవంబరు నెలలో టి. ఎ. ఫారం పూర్తి చేసి రూ 5/-. రివిన్యూ ఎక్సైజుచీటీ అతికించి స్వయంగా అధికారికి అందించాలి.

(గమనిక:- పోస్టాఫీసులలో రివిన్యూఎక్సైజు షాపుకి బిళ్ళలను దరఖాస్తు అంటించిన వానిని తీసికోవటం బిళ్ళలు ఎక్కువ ధరలకు అమ్మటం జరుగుతోంది. వర్కర్లు యీవిషయం, పై అధికారుల దృష్టికి తీసికొనిరావడం ద్వారా, ప్రజాసమీకరణద్వారా, రైతులు స్వయంగా దరఖాస్తులను ఆఫీసులలోనే యిచ్చే ఏర్పాటుచేయుటద్వారా ఎదుర్కోవాలి. బిళ్ళలమీదనే సంతకాలుపెట్టించే ఏర్పాటుచేయుటద్వారా యీప్రమాదం కొంతవరకు తప్పుతుంది. అందుకొరకు ఆందోళన చేయాలి.)

(సి) పండించునట్టి, క్యూర్ చేయునట్టి రైతులకవసరమైన టి. ఇ. బి. పుస్తకమును గ్రామరైతుసంఘం పూర్తిచేసిపెట్టాలి.

(డి) టి. పి. ఫారాలు అధికారులివ్వకుండా బాధపెట్టినప్పుడు పై సంఘములకూ, అధికారులకు తెలిపి ఆందోళన సాగించాలి. అంతేగాక రైతులకవసరమైన దరఖాస్తులువ్రాసి, రైతులతో కలిసి అధికారులవద్దకు వెళ్ళి, అధికారి ప్రవర్తన సరిలేకపోతే నిష్కర్షగా ఎదుర్కోవాలి. పై అధికారులకు తెలపాలి. సభలుపెట్టి తీర్మానాలుచేసి పంపాలి. పైఅధికారి సమాధాన మివ్వకపోతే చివరి పై అధికారివరకు, అవసరమైతే సెంట్రలు

రివిన్యూబోర్డువరకు ఉత్తరప్రత్యుత్తరాలు నడపాలి. అధికారుల బాధలనుండి రైతులను కాపాడటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి.

అధికారులు.

ఈ శాఖలో సర్వాధికారం గవర్నరు జెనరల్ కలుగజేసికొన్న నంత వరకు సెంట్రల్ బోర్డు ఆఫ్ రివిన్యూది. ఈబోర్డుక్రింద రాష్ట్రమునకొక కలెక్టరున్నాడు. కొన్నిజిల్లాలను కలిపి అసిస్టెంటు కలెక్టరులున్నారు. అవసరమైన జిల్లాకొక సర్కిల్ యిన్స్పెక్టరున్నాడు. వీరిక్రింద సబ్ యిన్స్పెక్టర్లు పోలీసులు ఉన్నారు.

పారిభాషిక పదాలు:

టి. ఇ. (పండించేవారు మొదట పెట్టవలసిన అర్జీఫారం) టి. ఇ. బి. (పండించేవారికి, క్యూర్ చేసేవారికి లెక్క వ్రాయుటానికి యిచ్చేపుస్తకం టి. డి. (పన్నుల డిమాండు) టి. పి. 1 (పన్నుచెల్లించిన పొగాకుకు రహదారి చీటీ) టి. పి. 2 (పన్నుచెల్లించని పొగాకు రహదారి చీటీ) టి. పి. 3 (వేర్ హౌసుకు తీసికొనివెళ్ళే పొగాకు రహదారి చీటీ) టి. ఆర్. 1 పండించిన పొగాకును గురించి పంపేలెక్క) టి. ఆర్. 2 (క్యూర్ చేసిన పొగాకు లెక్క) టి. డబ్ల్యూ. బి2 (వేర్ హౌస్ కొరకు వ్యక్తి వ్రాసియివ్వవలసిన బాండు.) టి. డబ్ల్యు. సి (వేర్ హౌసునుండి పొగాకు తీసికొనివెళ్ళటానికి దరఖాస్తు) టి. డబ్ల్యు. సి2 (ఒక వేర్ హౌస్ నుండి యింకొక వేర్ హౌస్ కు మార్చటానికి దరఖాస్తు) టి. డబ్ల్యు. డబ్ల్యు1 (పొగాకు అందిందని వేర్ హౌస్ లోయిచ్చే పత్రం) టి. ఏ1 (క్యూర్ చేసికొనుటకు లైసెన్సు కొరకు పెట్టిన దరఖాస్తు) టి. ఎ5 (వేర్ హౌస్ లైసెన్సుకొరకు పెట్టిన దరఖాస్తు).

---

# ప్రభుత్వశాఖలు : వాటితో వ్యవహరించే విధానము.

మనదేశంలో రైతులు అనేక కష్టాలకు గురిఅవుతున్నారు. దేశానికి వెన్నెముకగావున్న రైతు, తిండికీ, గుడ్డకూ కూడా దేవులాడుకోవలసి వస్తోంది. పెట్టుబడిదారుల, జమీందారుల, సామ్రాజ్యవాదుల, దోపిడీలకు తట్టుకోలేక రైతుల పరిస్థితి రోజురోజూ అధ్వాన్నమవుతోంది. రైతుల కష్టాలను పోగొట్టి, వారిపరిస్థితిని బాగుచేయడాకి తగిన పద్ధతులను ప్రభుత్వమవలంబించుటలేదు. అందుచేత ఈ ప్రభుత్వంద్వారా రైతుల కష్టాలు తీరవనేభావం మనలో నాటుకుపోయింది. ఇపుడున్న ప్రభుత్వశాఖల ద్వారాను, చట్టాలద్వారాను, రైతులకు ఎంతవరకు మేలుచేయవచ్చునో, అంతవరకూ ఆ మేలును కలుగచేయుటకు ప్రయత్నించకుండా క్రొత్తచట్టాల కొరకూ, నూతన విధానాలకొరకూ ఆందోళన చేస్తున్నాం. ఇది చాలా పొరపాటు. రైతులను, వారిదైనందిన కార్యక్రమంలో ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించకుండా, సంఘాలలో సమీకరించి ముందుకు తీసుకుపోవడానికి సాధ్యపడదు. అందుచేత ఇపుడు మనకున్న అవకాశాలను పూర్తిగా వుపయోగించుకుంటూనే, క్రొత్తవాటికొరకు ఆందోళనచేయాలి. ముఖ్యంగా రివిన్యూ, వ్యవసాయం, పశువైద్యం, ఆరోగ్యం మొదలైన శాఖలద్వారా రైతుల కెంతమేలు కలుగజేయుటకు వీలవుతుందో తెలుసుకుని దానననుసరించి పనిచేయాలి. అలా పనిజేస్తూ రైతులందరినీ సంఘాలలో జేర్చి, వారికి రాజకీయచైతన్యాన్ని కలుగజేయాలి. అప్పుడుగాని స్వాతంత్ర్య సంపాదనా, రైతుల పూర్తి హక్కులను పొందడమూ జరుగదు. అందుచేత కిసాన్ వర్కర్లందరూ, ప్రభుత్వశాఖలను గురించీ, వాటితో వ్యవహరించే పద్ధతులను గురించీ తెలుసుకోవాలి.

రాష్ట్ర ప్రభుత్వం.

మన ప్రెసిడెన్సీ కంతకూ ప్రభుత్వం మద్రాసులోవుంది. దీనికి గవర్నరు పెద్ద. ఈయనకు "వీటో" అధికారంకూడావుంది. ఈయనక్రింద శాసనసభకు బాధ్యులైన మంత్రులు, వివిధశాఖలయొక్క పరిపాలనచూస్తూ వుంటారు. ఈ మంత్రివర్గాలు లేనప్పుడు "సలహాదార్లు" చూస్తుంటారు.

ప్రభుత్వ వ్యవహారాలను కొనసాగించడానికి ఒక ప్రధాన కార్య దర్శిన్నీ, వివిధశాఖలకూ ఇంకా 8 మంది కార్యదర్శులున్నూ వుంటారు. వీరిక్రింద ప్రతిశాఖకూ సహాయ కార్యదర్శులు మొదలైనవారుంటారు.

చట్టనిర్మాణం, సవరణలేక రద్దుచేసే విషయాలలో రాష్ట్రప్రభుత్వానికి పూర్తి అధికారముంది. కొన్నిచట్టాల విషయములో మాత్రం కేంద్ర ప్రభుత్వానికి లోబడి వుండాలి. 1. ఫైనాన్సు (ఆర్థికం) 2. విద్య 3. ఆరోగ్యం 4 స్థానిక స్వపరిపాలన 5. రెవిన్యూ 6. హోం 7. డెవలప్మెంట్ (అభివృద్ధి) 8. పబ్లిక్ వర్క్సు 9. న్యాయ, కార్యనిర్వాహక శాఖలూ 10. కార్మికశాఖ 11. ధర్మాదాయాలు 12. జైళ్లు, కోర్టులు మొదలైన శాఖలన్నీ మంత్రులక్రింద లేక సలహాదార్లక్రింద పనిచేస్తూ వుంటాయి.

రెవిన్యూ శాఖ.

రాష్ట్రానికంతకూ రెవిన్యూబోర్డు వుంది. జిల్లాకు కలెక్టరూ, డివిజన్కు డిప్యూటీ కలెక్టరూ, తాలూకాకు తహశ్శీలుదారూ, ఫిర్కాకు రెవిన్యూ ఇన్స్పెక్టరూ, గ్రామానికి మునసబూ, రెవిన్యూ అధికార్లు. వీరుగాక గ్రామాలలో మొహతాదూ, కరణాలు కూడావుంటారు. ఫిర్కాకు జూనియర్ ఇన్స్పెక్టర్లనూ, తాలూకాలలో డిప్యూటీ తహశ్శీలుదార్లనూ, డివిజన్లలో సబ్ కలెక్టర్లనూ, ఒక్కొక్కప్పుడు అసిస్టెంటు జిల్లాకలెక్టర్లనూ ఏర్పాటుచేయడం జరుగుతుంది.

వీరితో వ్యవహరించవలసిన పనులు.

(1) భూములను ఆయకట్టులో చేర్పించుకోవడానికీ, నీటి సదుపాయములు సరిగా పొందడానికీ, మైనరు, మేజరు జలాధారముల మరమ్మతులకూ జిల్లాకలెక్టరుకు పిటీషన్లు పెట్టుకోవాలి.

(2) ఎస్టేట్సు లాండు ఆక్టు ననుసరించి రైతులు పొందదగిన సమస్త హక్కులకూ డిప్యూటీ కలెక్టరు, జిల్లా కలెక్టరులతో వ్యవహరించాలి.

(3) ప్రభుత్వ బంజర్లూ, చెరువుపడకలూ సేద్యంలోకి తీసుకురావడానికి తహశీల్దారు మొదలు కలెక్టరువరకూ పిటీషన్లుపెట్టాలి.

(4) టక్కావీ లోన్సు పొందడానికి కరణం సర్టిఫికెట్ పొంది, దానితో కలిపి ఒక పిటీషన్ తహశీల్దారుకు పెట్టాలి.

(5) భూములయొక్క తరం మార్పుకూ, పల్లాన్ని మెరకగానూ, మెరకను పల్లంగానూ మార్పించుకోవడానికి కలెక్టర్లకే పిటీషన్లుపెట్టాలి.

(6) పెనాల్టీల రద్దుకూ, రిమిషన్లకూ, తహశీల్దారుకు, జమాబంది ఆఫీసరుకూ పిటీషన్లుపెట్టాలి. ఆపైన జిల్లా కలెక్టరుకు అప్పీలుచేయాలి.

(7) గ్రామసమిష్టి ఉపయోగంకొరకు మంచినీళ్ళ చెర్వులూ, బావులూ త్రవ్వించుకొనుటకు గ్రామోద్ధరణ (Rural uplift) ఫండ్సులోనుంచి డబ్బు యిప్పించవలసినదిగా జిల్లా కలెక్టరుకు పిటీషన్లు పెట్టుకోవాలి.

(8) రీసెటిల్మెంటు రేట్సు తగ్గించుకోవడానికీ, రిమిషన్ సౌకర్యాలు పొందడానికీ, నజరానా రద్దుకూ మద్రాసు ప్రభుత్వముకు పిటీషన్లుపెట్టి ఆందోళన చేయాలి

(9) కిరసనాయిల్, పంచదార, అగ్గిపెట్టెలు మొదలైనవాటికొరకు డిప్యూటీ కలెక్టర్లకూ, జిల్లాకలెక్టరుకూ పిటీషన్లుపెట్టాలి.

## వ్యవసాయ శాఖ.

ప్రతి తాలూకాకూ ఒక డిమాన్‌స్ట్రేటరు వుంటాడు. జిల్లాకంతకూ జిల్లా వ్యవసాయశాఖోద్యోగి (Agricultural officer) వుంటాడు. వీరిపైన డిప్యూటీ డైరెక్టర్లూ, వారిపైన డైరెక్టరూ వున్నారు.

ముఖ్యంగా ఎరువులూ, విత్తనాలూ, ఎటువంటివి ఏవిధంగా వుపయోగించుకోవాలో తెలుసుకోవడానికీ, తెగుళ్ళను పోగొట్టడానికీ, తోటలను చక్కగా పెంచడానికీ వీరిసలహాలు పొందడంచాలా అవుసరం. ఈశాఖద్వారా రైతులకు లక్షలకొలది రూపాయలను అప్పుగా యిప్పించవచ్చును. ఇందుకు గాను ఏర్పరచిన ప్రభుత్వ ఫారాలను పూర్తిజేసి డిమాన్‌స్ట్రేటర్లకు ఇవ్వాలి. జిల్లా వ్యవసాయ శాఖాధికారి ఆలోచ్నను శాంక్షన్‌జేసి ఎరువులుగాని, డబ్బుగాని (రు 50 లకు మించకుండా) అప్పుగాయిస్తారు. రెవిన్యూ డిపార్టుమెంటువారి అశ్రద్ధవల్లగాని, పి. డబ్ల్యు. డి వారి అశ్రద్ధవల్లగాని, పైరులు నష్టపడిపోతుంటే, జిల్లా వ్యవసాయ శాఖాధికారికి పిటీషన్లు పెట్టి వారి సహాయం పొందవచ్చును. కోళ్లనూ, కోడిగుడ్లనూ, కూరగాయల విత్తనాలనూ (మంచివాటిని) కూడా ఈశాఖ ద్వారా తెప్పించుకోవచ్చు. రైతులకు అవుసరమైతే ఇనుపనాగళ్లు, యితర వ్యవసాయ పనిముట్లూ (కొరముట్లు) కూడా వీరివద్ద దొరుకుతయి వీటిని అప్పుగాకూడా యిస్తారు. ఈ శాఖ ద్వారా రైతులకు చాలా లాభం చేకూర్చవచ్చు. అందుచేత వర్కర్లు తప్పకుండా ఈశాఖతో ఎక్కువ సంబంధాలు పెట్టుకోవాలి.

## పశువైద్య శాఖ.

జిల్లా పశువైద్య శాఖాధికారి రెండేసి జిల్లాలను చూస్తూవుంటారు. జిల్లా ప్రధాన కేంద్రాలలో వెటర్నరీసర్జన్ (Veternary Surgeon)లు వుంటారు. వీరికింద అసిస్టెంట్ సర్జన్‌లూ, టూరింగ్ (సంచార) సర్జన్లూ వుంటారు.

పశువుల జబ్బులను నివారించడానికి యీశాఖ చాలా వుపయోగ పడుతుంది. పశువులకు జబ్బులు వచ్చిన వెంటనే వర్కర్లు, గ్రామ మునసబు ద్వారాగాని, నేరుగాగాని వీరికి తెలియపర్చి, మందులు తెప్పించి వుపయోగ పరుచుకోవాలి. పశువుల కాళ్లు, కొమ్ములూ విరిగినా, ఎక్కడైనా దెబ్బతగిలినా, పశువుల హాస్పిటల్స్‌కు తీసుకుపోవాలి. గ్రామాలకు మంచి జాతి ఆబోతులనూ, దున్నలనూ వీరిద్వారా సంపాదించవచ్చు. పాలను వృద్ధిచేసే పద్ధతులూ, ఎక్కువ గుడ్లను సంపాదించే పద్ధతులూ, వీరి ద్వారా నేర్చుకోవచ్చును. రైతుల పశుసంపద క్షీణించిపోకుండా, కాపాడుకోవడానికీ, అభివృద్ధిపర్చుకోవడానికీ ఈశాఖవారి సహాయం చాలా అవసరం. ఈ శాఖవారి యాజమాన్యాన జరిగే పశు ప్రదర్శనాలలో పాల్గొని, వాటినుండి తగిన లాభం పొందుటకు ప్రయత్నించాలి.

## పారిశ్రామిక శాఖ, (ఇండస్ట్రియల్).

ఈశాఖకు సంబంధించిన సూపరువైజర్లు రెండేసి జిల్లాలకు వకొక్కరు వుంటారు. వీరిక్రింద మెకానికులు ప్రతి జిల్లాలోనూ ఇద్దరు లేక ముగ్గురు వుంటారు. నాలుగు లేక అయిదు జిల్లాలకు కలిసి ఒక అసిస్టెంటు ఇండస్ట్రియల్ ఇంజనీరు వుంటాడు.

వ్యవసాయక, పారిశ్రామిక మెషీనులు కొనుటకుగాని, వానిని స్థాపించుటకు గాని, అప్పుడప్పుడు పరీక్షించుటకు గాని వీరి సలహా, సహాయమూ పొందాలి. భావులలో గొట్టములుదింపు పనిముట్లు, నీటితోడు పంపులు, చెరుకు మిల్లులు, రాతి ప్రదేశములు పగులగొట్టే యంత్రములూ, మొదలగువానిని వీరివద్ద అద్దెకు తీసుకొని వుపయోగించుకోవచ్చును. ఆ సందర్భాలలో వారి సలహాకూడా పొందవచ్చు.

## సహకార (కో-ఆపరేటివ్) శాఖ.

రాష్ట్రానికంతకూ వక రిజిష్ట్రారు వున్నాడు. ఆయనక్రింద కొన్ని జిల్లాలకు కలిపి జాయింటు రిజిష్ట్రార్లున్నూ, ప్రతివక్క జిల్లాకూ, వక

డిప్యూటీ రిజిస్ట్రారున్నూ వున్నారు. వారికింద సబ్ డిప్యూటీ రిజిస్ట్రార్లూ, ఇన్స్పెక్టర్లూ మొదలైనవారున్నారు. భూమి తనఖా బ్యాంకులను కొన్ని జిల్లాలను కలిపి వక డిప్యూటీరిజిస్ట్రారువుండి ఆ బ్యాంకులను ప్రత్యేకంగా చూస్తూవుంటారు.

గ్రామ కో-ఆపరేటివ్ సంఘాలద్వారా కుటుంబాలకూ, వ్యవసాయానికీ కావలసిన అప్పులను చవుకవడ్డీలపై రైతులకు యిప్పించడానికి, సంఘాలను ఏర్పరచుకోడానికీ యీశాఖద్వారా పనిచేయాలి. అలాగేభూమి తనఖా, క్రియవిక్రియ సంఘాలకొరకుకూడా వీరిద్వారానే ప్రయత్నించాలి. కో-ఆపరేటివ్ స్టోర్సును స్థాపించే అధికారమంతా వీరికేచెందివున్నది. కాబట్టి రైతులకు తగిన ఆర్థికపరిస్థితి చేకూర్చడానికి, జీవితావసర వస్తువులను అందజేయడానికీ వర్కర్లు యీశాఖద్వారా పాటుపడాలి.

## పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు. (P. W. D.)

ఈ శాఖకు చీఫ్ ఇంజనీయర్ మద్రాసులో వుంటాడు. కొన్ని డివిజన్లను కలిపి వక్కొక్క సూపరెండెంటు ఇంజనీయరు వుంటాడు. ప్రతి డివిజన్‌కూ వక ఎగ్జిక్యూటివు ఇంజనీయరూ, వారికింద అసిస్టెంటు ఇంజనీయర్లూ, సబ్ డివిజనల్ ఆఫీసర్లూ, ఓవర్ సీయర్లూ, హెడ్ గుమాస్తాలూ, లస్కర్లూ, మొదలైన వారుంటారు.

భూములను ఆయకట్టులో చేర్చుకోవడానికీ, నీటివసరుల మరమ్మత్తులకూ, కొత్తవసరుల నిర్మాణానికీ, మురుగునీటిని పోగొట్టుకోవడానికీ, నీటి పారుదలకు సంబంధించిన ప్రతివిషయానికీ వీరిద్వారా పనిచేయాలి.

## పబ్లిక్ హెల్తు (ఆరోగ్యశాఖ)

ప్రతి జిల్లాకూ వక హెల్తుఆఫీసరు వుంటాడు. ఆయనకింద ప్రతి తాలూకాకు వక హెల్తు ఇన్స్పెక్టరు వుంటాడు. ప్రతి ఇన్స్పెక్టరు చేతక్రిందా ఇద్దరు వాక్సినేటర్లు పనిచేస్తూవుంటారు.

గ్రామాలలో కలరా, మశూచి మొదలైన వ్యాధులు వచ్చినప్పుడు వెంటనే యీశాఖవారివద్దకు వెళ్ళాలి. ఇన్‌స్పెక్టరూ, వాక్సినేటర్లూ వచ్చి టీకాలు వేసేటట్లు చూడాలి. మురుగుకాలువలలోనూ, భావులలోనూ మందులు కలిపించాలి. వ్యాధులు తగ్గడానికి ఏయేచర్యలు అవుసరమో అవన్నీ యీశాఖవారిద్వారా చేయించవచ్చును. పిచ్చికుక్కలు కరచినా వీరిద్వారా మందులు వేయించాలి. గ్రామాలలో పెంటకుప్పలు, మురుగు తూములూ, ప్రజారోగ్యానికి భంగకరంగా వున్నప్పుడు వీరు కేసులుకూడా పెడతారు. ఇన్‌స్పెక్టర్లు ఎప్పుడైనా అనవుసరంగా కేసులు బనాయించజూచినప్పుడు హెల్తుఆఫీసర్లకు పిటీషన్లుపెట్టాలి. కేసుపెట్టిన తరువాతనైతే కంటెస్టుచేయాలి.

## వైద్యశాఖ.

జిల్లాకు వక మెడికల్ ఆఫీసరు వుంటాడు. ఆయన జిల్లాబోర్డుల, ప్రభుత్వ, హాస్పిటల్సు నన్నింటినీ తనిఖీచేస్తుంటాడు. ఈ హాస్పిటల్సులో ప్రజలకు సరిగా మందులు యివ్వకపోతే, జిల్లా మెడికల్ ఆఫీసరుకు రిపోర్టు చేయాలి. మరీ పెద్దజబ్బులైతే జిల్లా ముఖ్యపట్టణాలలోవున్న ప్రభుత్వ హాస్పిటల్‌కుగాని, మద్రాసులోవున్న జనరల్ హాస్పిటల్‌కుగాని, పంపించాలి. పిచ్చిఎక్కిన వారికి నయంకాక పోషించేవారు లేకపోయినప్పుడు పిచ్చి హాస్పిటల్సుకు పంపాలి.

## లేబరు (కూలీ) డిపార్టుమెంటు.

జిల్లా కలెక్టరుకు లోబడి, ఆయనకు సహాయంగా వక జిల్లాలేబరు ఆఫీసరు పని జేస్తుంటాడు. ఆయనక్రింద లేబరు యిన్‌స్పెక్టర్లు, ఓవర్‌సీయర్లూ, వుంటారు. కార్యాలయాలు జిల్లాకేంద్రాలలో వుంటాయి.

మాల, మాదిగ మొదలైన కులాలవారికి ఈశాఖద్వారా మంచినీటి భావులు, చెరువులూ త్రవ్వించవచ్చు. ఇండ్లు కట్టుకోవడానికి స్థలములు యిప్పించవచ్చు. పిల్లల చదువుకుకూడా ఏర్పాట్లు చేయించవచ్చు.

**ధాన్యము కొనుగోలు ఆఫీసరు : (Grain Purchasing Officer)**

వీరు స్వయంగాగాని, వర్తకులద్వారా గాని ధాన్యాన్ని కొని కొరత ప్రాంతాలకు ఎగుమతి చేస్తుంటారు. నియమిత ధరలకు ధాన్యం దొరకనప్పుడు కమాండీరు చేయవచ్చు. అలా ధాన్యాన్ని కమాండీరు చేసేటప్పుడు అక్కడి ప్రజల అవసరాన్ని చూచి ఎక్కువవున్న ధాన్యాన్నే తీసుకుపోయేటట్లు మనం చూడాలి. ఈ ఆఫీసరు చర్యలమీద అప్పీలు చేయదలసివుంటే సివిల్ సప్లైస్ కమీషనర్, మద్రాసుకు చేయాలి.

**ధాన్యపు కంట్రోలు ఆఫీసరు : (Grain Controle Officer)**

వీరు ధాన్యంయొక్క యెగుమతి దిగుమతులను, ధరలను కంట్రోల్ చేస్తుంటారు. ధాన్యాన్ని ఎక్కడికైనా పంపించాలన్నా, లేక ఎక్కడి నుండైనా తెప్పించుకోవాలన్నా వీరివద్ద సర్టిఫికేట్ (Priority certificate) పొందాలి.

ఇవిగాక గ్రామోద్యోగులను గురించీ, పోగాకు, అటవీశాఖలను గురించీ ఆయా సబ్జెక్టులలో వివరంగా చెప్పబడినవి. పోలీస్, సివిల్, మొదలైన శాఖలతో వ్యవహరించవలసిన విధానాలు ఆయా సమస్యలనుబట్టి వుంటయి కాబట్టి ఎప్పటికప్పుడు లాయర్ల సలహాలుపొందుతూ వుండాలి.

పైన జెప్పబడిన విధంగా ప్రభుత్వశాఖల ద్వారా రైతులకు చాలా మేలు కలుగజేయవచ్చు. కాబట్టి వర్కర్లంతా యీ అవకాశాలను వుపయోగించుకొని రైతుల నందరినీ సంఘటిత పర్చడానికీ, రైతుల పరిస్థితులను సాధ్యమైనంతవరకు బాగుచేయడానికీ కృషిచేయాలి. కాని ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం గుర్తుపెట్టుకోవాలి. ఏ పనికైనా ప్రజా సమీకరణ లేకుండా కేవలం ఉద్యోగస్తుల చుట్టూ తిరిగినంతమాత్రాన పనులను సాధించలేము. కాబట్టి ప్రభుత్వ శాఖలద్వారా ప్రయత్నించడమూ, ప్రజలను సమీకరించడమూ రెండూకూడా చేస్తుండాలి.

---

# నిర్మాణ సమస్యలు.

## ప్రాథమిక రైతు సంఘము.

ప్రాథమిక సంఘమే ప్రజలలో ప్రత్యక్ష నాయకత్వం వహిస్తుంది. దైనందిన సమస్యలను తీసికొని, రైతులలో రైతులుగా మెలగితే నిజమైన రైతు వుద్యమాన్ని నిర్మించగలము. నేడు మనపైనున్న బాధ్యతలన్నియూ ప్రత్యక్షంగా ప్రజలకు నాయకత్వం వహించు ఈ ప్రాథమిక సంఘము నిర్మాణయుక్తంగా పనిచేసిననాడే పూర్తి చేయగల్గుతాము. ఈ సంఘము పని చేయనంతకాలము, పై సంఘములయొక్క స్థితి పునాదిలేని భవనము మాదిరిగా వుంటుంది. రైతు సంఘాలు ఒకదారి, రైతులు మరియొకదారిని పోవడం, రైతుసంఘాలు నిర్జీవమైన నామమాత్ర సంఘాలుగా వుండిపోవడం జరుగుతుంది.

మనం ఆంధ్రరాష్ట్రంలో దాదాపు రెండువేల గ్రామాలలో రైతు సంఘ సభ్యులను జేర్పించాము. ఇందులో 700 గ్రామాలలో అధ్యక్షు, కార్యదర్శుల ఎన్నిక జరిగింది. ఈ ఎన్నికలు జరిగిన గ్రామసంఘాలలో స్థానిక రైతుల దైనందిన సమస్యలు తీసికొని పనిచేయు సంఘాలు 150 గ్రామసంఘాలు కూడాలేవు. ఈ పనిచేసే సంఘాలలోకూడ చేసిన పని రిపోర్టు ద్వారా పైకమిటీకి పంపేసంఘాలు 100 మాత్రమే వుంటాయి. ప్రాథమిక సంఘాలు నామమాత్రంగా వుండబట్టి బలమైన రైతు వుద్యమాన్ని నిర్మించలేకపోయాము. అంటే ఆంధ్రరాష్ట్రంలో బొత్తిగా పని చేయుటలేదని అర్థంగాదు. రైతు సమస్యలను తీసికొని పనిచేస్తున్నాం. అది వ్యక్తులుగా చేస్తున్నాముగాని సంఘాలను కదలించుటలేదు. సంఘాల ద్వారా పనిచేయుటలేదు. కాబట్టి మనము ఈ ప్రాథమిక సంఘాన్ని చక్కని నిర్మాణ పద్ధతులతో పనిచేయించి, బలమైన రైతు వుద్యమాన్ని

నిర్మించి రైతు లందరకు నాయకత్వం వహించే సంఘాలుగా తీసుకోరావాలి.

## ప్రాథమిక సంఘము యెలా పనిచేయాలి ?

ఆఫీసు, అధ్యక్షుని లేక కార్యదర్శి గృహములోగాని లేక వర్కింగు కమిటీచే నిర్ణయింపబడిన యింటిలోగాని వుండాలి. (2) ప్రాథమిక సంఘము రెగ్యులరుగా 10 రోజుల కొకసారి సమావేశము కావాలి. ప్రత్యేకమైన సమస్యలున్నప్పుడు వెంటనే సమావేశముగావాలి. పై కమిటీనుండి అర్జంటు సర్క్యులరువస్తే కార్యదర్శి అవుసరమనుకుంటే సమావేశపర్చాలి. (3) జనరల్ బాడీ సమావేశాలు నెలకొకసారి సమావేశము కావాలి. (తాలూకా రైతు ప్రతినిధి వచ్చినప్పుడు సమావేశమవడం మంచిది) (4) పైనుండివచ్చిన సర్క్యులరును వెంటనే అమలు జరుపడానికి పూనుకోవాలి. (5) తాలూకా రైతు సంఘమునుండి అధ్యక్ష, కార్యదర్శులుగాని, ఆర్గనైజరుగాని వచ్చినప్పుడు ముందుగా రైతులలో ప్రచారముచేసి బహిరంగ సభ ఏర్పాటుచేయాలి.

## ప్రాథమిక సంఘ ఎజండా.

(1) రైతుసంఘ వ్యతిరేక ప్రచారం చేస్తున్నారా? దాన్ని ఎలా ఎదుర్కోవాలో చర్చించుకోవడం (2) గ్రామసమస్యలు (3) పైసంఘము నుండి వచ్చిన సర్క్యులర్లు, లెటర్లు (4) సభ్యులను ఎంతమందిని చేర్పించాం? (5) రైతుసంఘ నిధికి ధాన్యనిధి ఎంతవరకు వసూలుచేశాం. (6) రైతు కూడలి స్థలాలలో ఎన్నిచోట్ల రైతు సమస్యలను గురించి చెప్పింది. పేపరు చదివి వినిపించింది. (7) పైసంఘమునకు పంపే రిపోర్టు.

ప్రాథమిక సంఘాలు 10 దినముల కొకసారి తాలూకా లేక జిల్లా రైతుసంఘానికి తాముచేసిన పనినిగూర్చి, తమను ఎదుర్కొన్న సమస్యలను గురించి రిపోర్టులు పంపుతూ సలహాలు తీసుకుంటూ వుండాలి. పైసంఘానికి

పంపవలసిన సభ్యత్వలిస్టులు, కోటాలు రెగ్యులరుగా పంపాలి. పైసంఘం ఏదైనా ఛోగట్టా కోరినప్పుడు సకాలంలో పంపుతూవుండాలి. గ్రామములలో రైతుల నిత్యజీవితానికి సంబంధించిన సమస్యలన్నింటిని నేడు ప్రాథమిక రైతుసంఘము తీసికొనవలసి యున్నది. కాని రైతుసంఘము ఆర్గనైజు చేయునాటికే యీ సమస్యలన్ని యెవరో గ్రామకరణమో, మునసబో లేక మరియొక స్వార్థపరుడో వ్యవహరిస్తూ వుంటాడు. మనము రైతుసంఘము పెట్టినంతమాత్రాన రైతులంతా మన సంఘాన్ని గుర్తించరు. రైతువర్కర్లు ఈ సమస్యల నన్నింటిని తెలిసికొని గ్రామ రైతుసంఘ యాజమాన్యమున పనిచేయాలి. అందుచే గ్రామాలలో పనిచేసే రైతువర్కరు సర్వే చేయుట, నోట్లువ్రాయుట, దస్తావేజులువ్రాయుట, పిటీషన్లువ్రాయుట, ప్రభుత్వ శాఖలతో వ్యవహరించుట నేర్చుకొనియుండాలి. రైతులు రైతుసంఘములు రాకపూర్వము స్వార్థపరుల చేతులలో వున్నారు. వారందరిని, వారిపనులన్నీ రైతుసంఘంపేరుతో నెరవేరుస్తూ (రైతులను) చైతన్యవంతులుగా చేయాలి.

రైతు వర్కరు ప్రతిచిన్న సమస్యను, (రైతులు రైతులమధ్య తగాదాగాని, రైతులు కూలీలమధ్య తగాదాగాని, గ్రామమంతటికి సంబంధించిన విషయముగాని) వ్యక్తిగతంగా చేయరాదు. సమస్యరాగానే కార్య నిర్వాహక వర్గమును సమావేశపరచాలి. ఆ సమస్యను ఆవర్కింగుకమిటీలో చర్చించి నిర్ణయాలు తీసికోవాలి. ఇంకా ముఖ్యమైన సమస్యయైనచో సాధారణ సభ్యుల నందరిని పిలవాలి. ఆనిర్ణయాన్ని రైతుసంఘనిర్ణయంగా అమలుజరపాలి. అధ్యక్షకార్యదర్శులు ప్రత్యేకంగా గ్రామరైతు సంఘ బాధ్యత ఎక్కువగా నిర్వహిస్తూ పనిచేయాలి. నీటిపారుదల సౌకర్యాల కొరకు, ఇతర ప్రభుత్వశాఖలతో వ్యవహరించుట గ్రామరైతు సంఘం పేరుతో జరిగినచో రైతుసంఘము రైతులకు నాయకత్వాన్ని వహించుతుంది. ఈనాడు రైతులదగ్గర వివిధరూపాలలో లంచాలుకాజేయు, స్వార్థపరులకు అధికారులకు అవకాశంలేకుండా పోతుంది. రైతుసంఘంద్వారా కృషి

సల్పుటవలన రైతులలో ఐక్యత, తమశక్తి తాము తెలిసికొనగలుగుట, తమ హక్కులకొరకు పోరాటశక్తి పెంపొందించుకొనుట జరుగుతుంది. స్థానికంగావున్న వ్యక్తిగత కక్షలలో రైతుసంఘము లీనమైపోకుండా, కక్షలులేకుండా చేయడానికి కృషిచేయాలి. వేరొకచోట వ్రాయబడిన రైతు సమస్యలన్నీ ప్రాథమిక రైతుసంఘము తీసికొని పనిచేయాలి. అప్పుడే నూటికి నూరురైతులను రైతుసంఘ నాయకత్వం క్రిందకు తీసికొని రాగలము.

## రైతుసంఘ సభ్యులను ఎలా చేర్పించాలి?

ప్రస్తుతం ప్రాథమిక సభ్యత్వాన్ని యేదో సంవత్సరానికొకసారి తద్దినము పెట్టినట్లు చేర్పించి మొక్కుతీర్చుకుంటున్నాము. చేర్పించేటప్పుడు సంఘ ఆశయాలను ప్రచారము చేయకుండా చేర్పిస్తున్నాము. సభ్యత్వరుసుముకూడా సరిగా వసూలుచేయుటలేదు. ప్రాథమిక సభ్యత్వమును సంవత్సరం పొడుగునా చేర్పించాలి. చేర్పించేటప్పుడు రైతుసంఘ ఆశయాలను, సంఘావశ్యకతను ప్రచారంచేసి రైతులను ఒప్పించి చేర్పించాలి. యే సమస్యను తీసికొని పనిచేస్తున్నా ఆసందర్భాలలో సభ్యులను చేర్పించాలి. ప్రతి ప్రచార, ఆందోళనా కార్యక్రమములోనూ, తరువాతకూడా చేర్పించాలి. రుసుము తప్పకుండా వసూలుచేయాలి. రైతుసంఘములో రైతుస్త్రీలనుకూడా చేర్పించాలి. ఈవిధంగాచేస్తే రైతులు సంఘావశ్యకతను గుర్తిస్తారు.

ఇప్పుడు మనం ప్రతిచోటా ప్రతిసంవత్సరం సభ్యులను జేర్పిస్తున్నాం. ప్రాథమిక సంఘాలు బలంగావున్నచోట్లకూడా సభ్యత్వాన్ని చేర్చడానికి, కొత్తసభ్యత్వ ఫారాలు వాడుతున్నాం. ఇందువల్ల సభ్యత్వ ఫారాలు ఎక్కువ కావలసిరావడం, వాటికొరకు రాష్ట్రసంఘానికి డబ్బు ఎక్కువ ఖర్చు కావడం జరుగుతోంది. అందువల్ల ఈఖర్చు తగ్గించుకోవడానికిగాను ప్రాథమిక సంఘాలు ఆఫీసులుపెట్టి పనిచేసేచోటనల్లా క్రిందటి సంవత్సరం

చేర్పించిన సభ్యులను తిరిగి చేర్పించవలసినప్పుడు పక జిస్టరు బుక్కులో పేర్లు వ్రాసి సభ్యత్వాన్ని పునరుద్ధరిస్తూ వుండాలి. అలాచేస్తే సభ్యత్వప్రచారాల అవసరం తగ్గుతుంది. డబ్బు కలిసివస్తుంది. పనికూడా తేలిక అవుతుంది.

## గ్రామ సంఘానికి వుండవలసిన రికార్డు.

(1) రైతులయొక్క లిస్టు, రైతుసంఘ సభ్యులుగా చేరడానికి అర్హతగలవారు ఎంతమందో తెలుపు పట్టిక. (2) రైతుసంఘ సాధారణ సభ్యుల లిస్టు వ్రాయుటకు ఒక పుస్తకము. (3) వార, దిన పత్రికల ఫైళ్లు. (4) తాలూకా ఆఫీసుకుపంపిన రిపోర్టులెటర్ల కాపీలఫైలు. (5) ప్రభుత్వ శాఖలతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరముల ఫైలు. (6) ప్రభుత్వ శాఖల నుండి వచ్చిన లెటర్ల ఫైలు. (7) ఎకౌంటు పుస్తకము. (8) తాలూకా జిల్లా సంఘాలనుండి వచ్చిన సర్క్యులరుల ఫైలు. (9) తాలూకా, జిల్లా మ్యాపులు, యితర మ్యాపులు. (10) గోడవార్తా పత్రిక పెట్టి రైతుల కుప యోగించు వార్తలు, వ్యాసాలు ప్రకటించాలి. (11) గ్రంథాలయ ముండాలి.

## గ్రామనాయకత్వము వహించడానికి తీసుకోవలసిన సమస్యలు

(1) సర్వే, నోట్లు, దస్తావేజులు, పిటిషన్లు వ్రాయుటకు గ్రామ రైతుసంఘమే పూనుకోవాలి. ఫీల్డుబుక్కు, అడంగులు సంపాదించి రైతు సంఘము తరఫునవుంచాలి. (2) గ్రామ కక్షలను మాన్పించడానికి ప్రయత్నము చేయాలి. రైతులలో వచ్చే గట్ల తగాదాలను పరిష్కరించాలి. (3) వ్యవసాయ కూలీల డిమాండ్లును, బలపరచాలి. రైతు, కూలీల సామరస్యాన్ని సాధించాలి. (4) సమస్యలను తీసికొని రైతు సేవ చేయుటద్వారా స్వార్థపరులను బట్టబయలుచేయాలి. (5) రైతుసంఘ సభ్యులను నిత్యము చేర్పించడము. ఆశయాలను ప్రచారము చేయడము. (6) పచ్చగడ్డిపాటలు, యితర వుమ్మడి ఆదాయాల విషయంలో తగాదాలురాకుండా గ్రామ

రైతుసంఘమే పరిష్కరించాలి. (7) బంజరు భూములు, శిస్తు రిమిషన్, పెన్షన్లు, ముంపునివారణ, జమాబంది వసూళ్ళ విషయంలో కలుగజేసికోవాలి. (8) గ్రామ పునరుద్ధరణ ఫండును (Rural uplift fund) వాడుకోవాలి. కలెక్టరుకు పిటిషను పంపి గ్రామ క్షేమముకోసం ఆ ఫండును వుపయోగించుకోవాలి. (9) మునసబు, కరణాల మోసాలను కనిపెట్టుట. గ్రామ మాన్యూయల్ చదవాలి. (10) ఆబోతులు, దున్నపోతులు, పశువృద్ధి విషయంలో జాగ్రత్త తీసికోవాలి. (11) నీటి అవసరాలు, సదుపాయాలు, కాల్వల మరమ్మతులు, క్రొత్తగ్రామముల విషయంలో శ్రద్ధవహించాలి. (12) వ్యవసాయశాఖ సహాయముతో రైతులకు వ్యవసాయ వ్యవహారములలో (పంటల తెగుళ్లు మొ॥) సలహాలివ్వాలి. (13) ధాన్యపు వసూలు, సంస్థఫండు (ఉమ్మడి ఫండునుండి) వసూలుచేయాలి. (14) విత్తనాలు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు రైతుల కిప్పించాలి. (15) హాస్పిటలు, శానిటరీ, నర్సుల సౌకర్యాలు కలిగించాలి. (16) చెరువుల మరమ్మతు, రహదారుల సౌకర్యాలకొరకు పాటుపడాలి. (17) పశువుల వ్యాధులు, అంటువ్యాధులు వచ్చినప్పుడు నివారణకు పాటుపడాలి. (18) పంచాయితీబోర్డులు, కోపరేటివ్ స్టోర్సు, చౌకడిపోలు రైతులకు వుపయోగించునట్లు చూడాలి. (19) అధికోత్పత్తి ప్రచారము, ఆహారకమిటీలు, ప్రజారక్షణదళాల ఏర్పాటుగావించాలి. (20) సాంఘిక వ్యవహారములలో (పెండ్లిండ్లు) సలహాలివ్వాలి. జంతువుల బలి జరుగకుండా చూడాలి. (24) గ్రామమునకు సంబంధించిన లెక్కలు. అనగా గ్రామజనాభా. ఏయే వర్గములో (ధనిక-మధ్య-బీద) ఎంతమంది? వ్యవసాయకూలీ లెంతమంది? గ్రామములోనున్న మెట్ట, మాగాణి ఎంత? ఎంత ఆహారము ఉత్పత్తి అవుతుంది? ఆ గ్రామానికి సరిపోగా మిగులుతుందా? తక్కువౌతుందా? మొ॥ లెక్కలు ఆఫీసులోవుండాలి. (26) పశువులను అమ్మవద్దని ప్రచారంచేయాలి.

తాలూకా సంఘము.

(1) గ్రామవారీగా సభ్యుల లిస్టులు. గ్రామ అధ్యక్ష, కార్యదర్శుల లిస్టులు, అడ్రస్సులు, క్రింది సంఘానికి పంపే సర్క్యులర్ల ఫైళ్ళు. (2) క్రింది సంఘమునుండి వచ్చే రిపోర్టుల ఫైళ్ళు, చిఠా, ఆవర్జా. పోస్టల్ ఎక్కౌంటు. (3) వోచర్సు ఫైలు గ్రామసంఘానికి యిచ్చిన లిస్టులో నున్నవి యీ సంఘానికికూడా వుండాలి.) (4) రైతు సమస్యలలో అనుభవము గలిగిన ఒకరు తాలూకా రైతుసంఘ ఆఫీసు శక్రటరీగావుండాలి. (5) ప్రతి సమస్యపై ప్రాథమిక సంఘాన్ని సకాలములో సలహాలతో ప్రత్యక్షంగా నడపాలి. సర్క్యులరు, కరపత్రాలద్వారా సామయిక సమస్యలపై నాయకత్వం వహించాలి. (6) తాలూకా ఆర్గనైజర్లు సరాసరి రైతులవరకు వెళ్ళి రైతు నాయకులుగా పెంపొందాలి. రైతు సమస్యల స్వభావాన్ని, ఆ సమస్యలపై రైతుల అభిప్రాయమును తెలిసికోవాలి. (7) తాలూకా అధికారుల దగ్గరకు, జిల్లా అధికారుల దగ్గరకు రైతులను రాయబారము తీసుకవెళ్ళాలి. (8) ప్రాథమిక సంఘాలు పనిచేసేటట్లు చూడాలి. ప్రాథమిక సంఘాన్ని, జనరల్ బాడీని సమావేశపర్చడం, స్థానిక సమస్యలను తెలిసికొని పరిష్కారమార్గాన్ని సూచించుతూ ఆచరణలో ఎలా పని చేయాలో స్పష్టమైన సలహాలిచ్చిరావాలి. (9) జిల్లా రైతుసంఘ కోటాలు సకాలములో పూర్తిచేయాలి. జిల్లా సంఘానికి ప్రజలలో జరిగిన పనిని గూర్చి రిపోర్టు 15 రోజుల కొకసారి. పొలిటికల్, ఆర్గనైజేషన్ రిపోర్టులు నెలకొకసారి పంపాలి. (10) వర్కింగుకమిటీ నెలకొకసారి, జనరల్ బాడీ రెండు మాసముల కొకసారి సమావేశం కావాలి. (11) ఆఫీసులో రెగ్యులరుగా పనిచేయాలి.

ఎజండా.

(1) సభ్యుల రిపోర్టులు, (2) పైసంఘం పంపిన సర్క్యులర్లు ఎంత వరకు అమలుజరిగినది (3) రైతుసంఘ విచ్ఛేదకులను గురించి (4) రైతుసంఘ

నిధి వసూలు (5) రైతుసంఘ సభ్యత్వ పెంపుదల (6) ఎన్ని గ్రామసంఘాలు స్థాపించబడినవి (7) ఎన్నిసంఘాలు పనిచేస్తున్నవి (8) ఎకౌంటు (9) పైకమిటీకి పంపిన రిపోర్టులు చదువుట (10) పైనుండివచ్చిన సర్క్యులర్లు చదువుట (11) ఆనాటి సమస్యలనుగురించి (12) బాధ్యతలనుగురించి (13) బంజరు భూములు, ఆహారసమస్యా పరిష్కారము (15) వ్యవసాయకూలీలు, రైతుల సామరస్యమును గురించి చర్చించాలి.

జిల్లా సంఘము.

(1) ఆఫీసు రెగ్యులర్‌గా ఒకపద్ధతిని పనిచేయుట, జిల్లానాయకులలో ఒకరు యెప్పుడు ఆఫీసులో వుండాలి. లేనిచో అనుభవముగలిగిన ఆఫీసు సెక్రటరీ వుండాలి. (2) తాలూకా సంఘములో వుంచే ఫైళ్ళన్ని వుంచుతూ, ప్రభుత్వ ప్రకటనలఫైలు, డిస్పాచింగు (ఆఫీసునుండి ప్రతి దినమూ వెళ్ళేలెటర్సు, వచ్చేలెటర్సు నోట్‌చేయు పుస్తకం) (3) జిల్లా నాయకులిచ్చు స్టేటుమెంట్ల కాపీలఫైలు, ఆఫీసులోవుండే వస్తువులలిస్టు వుంచాలి. కటింగ్సుఫైలు వుండాలి. (4) జిల్లానాయకత్వమంతా జిల్లా కేంద్రములోనే వుండాలి. వీరువెళ్ళేటప్పుడు ఆఫీసులో కార్యక్రమము యిచ్చి వెళ్ళాలి. (5) జిల్లారైతునాయకత్వం రైతువుద్యమము యేధోరణిలో నడుస్తోంది, జిల్లావ్యాపితంగావున్న లక్షణాలు యేమిటో ఈస్థాయి నుండి పైస్థాయికి వుద్యమాన్ని తీసుకవెళ్ళాలంటే యేమిచేయాలో అర్థం చేసికోగల రాజకీయ విజ్ఞానాన్ని కలిగివుండాలి. (6) ఆఫీసు భోగట్టాను తెలియజేసే విధిగా వుండాలి. మంచిలైబ్రరీ వుండాలి. (7) వెనుకబడియున్న ప్రాంతాలలో రైతు సంఘాలను స్థాపించడానికి ప్లానులు వేసికోవాలి. (8) ప్రతినెల బడ్జెటు తయారుచేసికొని, విరాళాలు రైతుజన సామాన్యము నుండి డబ్బు వసూలుచేయడానికి తాలూకాలకు సూచన లివ్వాలి. (9) తాలూకా సంఘాలకు యెప్పటికప్పుడు వివరములతో కూడిన కార్యక్రమాన్ని సర్క్యులర్లద్వారా అందజేయాలి. గెజెట్ తెప్పించాలి. (10) తాలూ

కాలనుండి రిపోర్టులు తెప్పించుకోవాలి. (11) వివిధ తాలూకాలలో పనిని సమీక్షచేస్తూ అప్పుడప్పుడు లెటర్లు పంపించాలి. (12) 10 రోజులు స్కూల్లు పెట్టి వర్కర్లకు శిక్షణ యివ్వాలి. (13) తాలూకా ఆఫీసులను చెక్ చేయాలి. (14) రాష్ట్రసంఘ కోటాలు సరిగాకట్టుట. రాష్ట్రసంఘానికి 15 రోజులకొకసారి ప్రజలలోని పనినిగూర్చి (మాస్) రిపోర్టు, నెలకొకసారి పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టులు పంపాలి. (15) నెలకొకసారి వర్కింగుకమిటీ రెండుమాసముల కొకసారి జనరల్ బాడి జరపాలి. (16) జిల్లానాయకులు తాలూకా జనరల్ బాడీకివెళ్ళి వారిని ఉత్సాహపరచాలి. వర్కింగు కమిటీ మీటింగులకు వెళ్లి నడపాలి. (17) ఆహారకమిటీలను ఆర్గనైజు చేయాలి. జమీందారుల వద్దకువెళ్ళి బంజరుభూములు యివ్వమని కోరాలి.

## జిల్లా రైతుసంఘం నిర్వహించడానికి ఎంతమంది కావాలి?

ఒకరు ఆహారసభ్యుడు ఇతడు ఆహారసమస్య విషయంలో యితర రాజకీయ పక్షాలతో ఆహార కమిటీ లేర్పరచడం, జమీందారులవద్దకు రాయబారం వెళ్ళడం చేయాలి. ఒకరు ఆఫీసులో వుండాలి. రెండుతాలూకా రైతుసంఘాలకు ఒకరు చొ||న ఆర్గనైజర్లు వుండాలి.

## ఆఫీసు.

ఆఫీసుఅంటే యేమిటి? వివిధప్రాంతాలలో జరిగిన పనిని సమన్వయ పరచి నాయకత్వము వహించి ప్రజాసంస్థలను, పార్టీను నడుపుకేంద్రము. ఈ అభిప్రాయముతో మనము ఆఫీసు నడిపినట్లయితే బలమైన ప్రజాసంఘాలను నిర్మించి నడుపగలము. కాని మనం యింతవరకు ఆఫీసులు నామమాత్రంగానే పెట్టుచున్నాము. మనము ఏ ఆఫీసును, పనిని సమన్వయపరచి నడుపుకేంద్రముగా నడపలేక పోతున్నాము. ఆఫీసులోవుండే కార్యదర్శిగాని, మేనేజరునుగాని సమస్యలు తెలిసి నడుపగల సమర్థుని నిర్ణయించి పెట్టుటలేదు. గుమాస్తాగా పనిచేసేవారిని పెట్టుచున్నాము. మనజిల్లా,

తాలూకా రైతుసంఘములు పైఆశయాన్ని ఆచరణలోనికి తీసుకరాగలిగినప్పుడే బలమైన రైతుఉద్యమాన్ని నిర్మించగలము. కాబట్టి ఆఫీసులు పని చేయవలసిన విధానాన్ని ఈ క్రింద సూచిస్తున్నాము.

(1) ఆఫీసులు ధర్మసత్రములుగా నుంచక నిర్ణీత కార్యక్రమం ప్రకారం పనిచేసే పద్ధతులు, ఆఫీసులోవుండే కామ్రేడ్స్ ఏర్పరచుకోవాలి. టైమ్‌టేబిల్ వేసికొని దానిప్రకారం అమలుజరపాలి. కాలక్షేపరాయుళ్లకు ఆఫీసుమధ్యలో బాతాఖానీ వేయడానికి అవకాశమిచ్చి పని పాడుచేసికోరాదు. ఆఫీసులో యిద్దరు కామ్రేడ్సువున్నప్పుడు పని విభజించుకొని అందులో ఒకరు వెలుపలినుండివచ్చే రైతులతోను, యితరులతోను వేరే గదిలో మాట్లాడడానికి సమయాన్ని నిర్ణయించుకోవాలి. రైతు, వ్యవసాయ కూలీ ఆఫీసులకు ఈనియమాన్ని ఆచరణలోపెట్టడం కొంత బాధమాట నిజమే. కాని రైతులు, వ్యవసాయకూలీ, ప్రజాసామాన్య మనస్తత్వానికి, అలవాట్లకు మనం బానిసలంగారాదు. వారికి మనంయెలా రాజకీయాలను వారిసమస్యలను నేర్పుతున్నామో అలాగే ప్రవర్తననుకూడా నేర్పాలి. అంతేగాని వారికి తోకలుగావుండి పోరాదు. (2) ప్రతిసమస్యపై సరియైన పంథాను నిర్ణయించి వివరాలతోకూడిన స్పష్టమైన కార్యక్రమాన్నియిస్తూ సకాలంలో సర్క్యులర్లుపంపాలి. (3) మూడుమాసముల కొకసారి పని సమీక్షచేస్తూ లెటర్లు క్రిందిసంఘాలకు పంపించాలి. (4) క్రిందిసంఘాల నుండి రిపోర్టులు తెప్పించుకోవాలి. ముఖ్యమైన రిపోర్టులున్నప్పుడు వూరి వూరికీ రిపోర్టుకూడా తీసికోవాలి. (5) సకాలంలో జవాబులు యివ్వడ మనేది ఆఫీసుయొక్క ప్రధాన ఆదర్శము. లేనిచో క్రిందిసంఘాలకు, ఆర్గనైజర్లకు చెడ్డ ఆదర్శాన్ని చూపినవాళ్ళము అవడమేగాక, సమస్యదాటి పోయినాక మనసలహాలు వెళ్లినా ఫలితం వుండదు. ఆఫీసుయొక్క వుద్దేశ్యాన్ని కోల్పోతాము. (6) ఆఫీసునుండి క్రిందిసంఘాలకు విమర్శలు, నిర్ణయాలు, సలహాలద్వారా వుత్సాహపరచి పనిచేయించాలి. (7) ఆఫీసు యేసంఘానికి చెందివుంటుందో, ఆఫీసులో ఆలక్షణాలు వుట్టిపడుతూ

వుండాలి. ఉదా:- రైతుసంఘ ఆఫీసులో పంటలకు సంబంధించిన పోస్టరులు, విత్తనాలు, వ్యాపులు, మొదలగునవి వుండాలి. (8) ఆఫీసులు పరిశుభ్రముగా వుండాలి. (9) ఆఫీసులు భోగట్టాకు నిలయంగా వుండాలి. రైతుసంఘ ఆఫీసువుంటే రైతులకు సంబంధించిన ప్రతి సమస్యమీద ఆఫీసులో భోగట్టా వుండాలి. (10) ఆఫీసు మేనేజరు ఆ సంఘసమస్యలు తెలిసినవారుగా వుండాలి పిటీషన్లు, మహజర్లు మొదలగునవి వ్రాయగలిగి వుండాలి.

## నివేదికలు.

ఒక వ్యక్తిని గురించిగాని, ఒక సంఘాన్ని గురించిగాని, ఒక పరిస్థితిని గురించిగాని, లేక యే విషయాన్ని గురించియైనా వ్రాతపూర్వకంగాగాని, ప్రత్యక్షంగాగాని నివేదించునది నివేదికయని పిలువబడుతుంది. ఈ నివేదిక ఒకపార్టీ లేక ఒక ప్రజాసంస్థ నిర్వహణలో అత్యుత్తమ పాత్ర వహిస్తుంది. ఈ నివేదికలు పంపుట, తెప్పించుకొనుట సరిగా జరుగకపోతే యే సంఘము కూడా సరిగా పనిచేయలేదు. ఈ నివేదికద్వారానే ఒక ప్రాంతములో అనుభవాలను, మరియొక ప్రాంతానికి అందజేయుట, మొత్తం పరిస్థితిని చూచికొని తరువాతచర్యను నిర్ణయించి వుద్యమాన్ని పైదశకు తీసుకవెళ్లడం జరుగుతుంది. దీనిద్వారా బలమైన వుద్యమాన్ని, నాయకత్వాన్ని నిర్మించగలుగుతాము. ఈ నివేదికలు పంపువారు, యిచ్చువారు రెండు ప్రధాన విషయములు గుర్తుపెట్టుకోవాలి. ఒకటి సకాలములో పంపుట సకాలములో పంపని రిపోర్టుకు విలువలేదు. పైకమిటీనుండి క్రింది కమిటీవారు సలహాలు పొందలేరు. పైకమిటీకి, ఈవిషయాన్ని అనుభవంగా తీసికొని మరియొకచోట ఏంచర్య తీసికోవాలో, మొత్తంమీద తీసుకరావలసిన మార్పుయేమిటో నిర్ణయించుకోడానికి అవకాశం వుండదు. అందుచే సకాలంలో పంపాలి. రెండవది నివేదిక పంపేటప్పుడు అతిశయోక్తులు, తగ్గింపులు లేకుండా సరియైన అంచనాతో నిజమైన విషయాలతో పంపించాలి. లేకపోతే సరియైన నిర్ణయాలు తీసుకోలేరు.

## ఓరల్ నివేదికలు.

సాధారణంగా పైకమిటీ ప్రతినిధి క్రింద సంఘాల సమావేశాలకు వెళ్ళినప్పుడు, క్రిందిసంఘ సభ్యులు, పైసంఘ సమావేశాలకు వెళ్ళినప్పుడు ప్రత్యక్షంగా యిచ్చేవి.

## నివేదికలు ఎన్నిరకాలు?

(1) ప్రజలలో జరిగిన పని నివేదిక. దీనిలో ఊరేగింపులు, సభలు, ప్రదర్శనాలు, రాయబారాలు, ప్రజాపోరాటములు, సమ్మెలు మొదలగు వాటిని గురించి వ్రాయాలి. (2) రాజకీయ నివేదిక: ఈ రిపోర్టులో రైతు సంఘ విచ్ఛేదకులు ఏంచేస్తున్నారు. వారి నినాదాలేమిటో, వారిస్థితి, బలము మనతోపోలిస్తే ఎంతో? వారిపై ప్రజాభిప్రాయమేమిటో? వారిని ఎలా ఎదుర్కొంటున్నారో, రైతు సంఘాలమొక యితర రాజకీయ గ్రూపుల వైఖరియేమిటో, మన నినాదాలు, కార్యక్రమము రైతులు ఎలా స్వీకరిస్తున్నారో మొ॥గు విషయములుండాలి. (3) ఆర్గనైజేషనల్ నివేదిక. దీనిలో జిల్లా, తాలూకా రైతుసంఘాలు ఎలా పనిచేస్తున్నదీ, ప్రాథమిక సంఘము ఎలా పనిచేస్తున్నదీ నివేదికలు ప్రాథమిక సంఘమునుండి రాష్ట్ర సంఘమువరకు రెగ్యులరుగా వస్తూవుండాలి. సంఘ సమావేశాలు, తీర్మానాలను గురించి దీనిలోవుండాలి. సర్క్యులర్లను కమిటీలు అమలుపరుస్తున్నదీ సభ్యత్వ మొత్తం చేర్పించిందీ, క్రొత్తసంఘాలెన్ని పెట్టింది, ఎంతడబ్బు వసూలైనది, అకౌంటు మొ॥వి వ్రాయాలి.

## జనరల్‌గా నివేదికలు యెలా వుండాలి.

మొదటిపేరాలోనే మొత్తం నివేదికలోని సారాంశాన్ని ప్రధాన విషయాలను వ్రాయాలి. రెండవపేరాలో జరిగిన యేర్పాట్లు, యెలా ఆర్గనైజుచేసిందీ వ్రాయాలి. మూడవ పేరాలో జరిగినది జరిగినట్లువ్రాయాలి. ప్రజాభిప్రాయాలుకూడా వ్రాయాలి, 4 ఫలితాలు, 5 లోపాలు, 6 గుణ

పాతాలు. ఈవిధంగా వ్రాయాలి. ప్రతి నివేదిక ఎక్కువ విషయాలను తెలిపేదిగా (Facts & figures) వుండాలి.

సర్క్యులరు.

ఒకసంఘము లేక పార్టీ తన నిర్ణయాలను, సూచనలను అధీనసంఘాలకు సర్క్యులరు రూపములో పంపుతుంది. ఒక సర్క్యులరు ఒకే విషయముపై వుండాలి.

సూచన,—మొదటి పేరాలో ఆసమస్య ప్రాధాన్యత అంటే సర్క్యులరు వుద్దేశ్యము వ్రాయాలి. రెండవ పేరాలో జనరల్ ప్లాను. మూడవ పేరాలో స్పష్టమైన సూచనలు. 4 నినాదాలు, 5 హెచ్చరికలు, గమనికలు వ్రాయాలి.

కరపత్రాలు.

మనము ఒక ప్రజాసమస్యపై ఆందోళనచేసే సందర్భములో కరపత్రాలు వేయించుతాము. ఆ సమయంలో వచ్చిన ఆ సమస్యపై వెంటనే ప్రజలను కర్తవ్యోన్ముఖులను చేయడానికి కరపత్రాలు వుపకరిస్తాయి. ఆ కరపత్రం ఆ అవుసర సమస్యపైనే వ్రాయబడాలి. ఇతర విషయాలు చేర్చరాదు. ప్రజాభాషలో సూటిగా ప్రజా హృదయాలలో నాటుకుపోయేటట్లు వుండాలి. ఆ కరపత్రములో కేవలము ప్రభుత్వదూషణే ప్రధానంగా వుండి (కొత్త చిక్కులు తెచ్చేదిగా వుండరాదు. అది చదువగానే తక్షణ చర్య స్ఫురించాలి.)

సూచన.

కరపత్రాలు పాత్రములుగా కాఫీహోటళ్ళలో వేయరాదు. అవి ప్రజలకు పంచబడేటన్న మిఠాయిపొట్లాలకు వినియోగింపబడుతాయి. కరపత్రాలన్ని ప్లానువేసికొని ప్రజలందరికి అందేటట్లు చూడాలి.

## బహిరంగ సభలు.

ప్రజావ్యాపితంగా ఒక విషయాన్ని ఆందోళన ప్రచారము చేయాలనుకున్న సందర్భంలో బహిరంగసభలు పెడతాము. ఈ సభ ఫలితంగా ఆ విషయంలో కొంత పరిజ్ఞానము సంపాదించుట, దానిపై వారు చేయవలసిన కార్యమును తెలిసికొనుట జరగాలి. కాని మనంపెట్టే సభలు ఏదో పై కమిటీ సర్క్యులరు పంపించిందిగాబట్టి ఆ బాధ్యత నెరవేర్చుకోడానికి మాత్రమే, జరుపుతున్నాముగాని సభ ఫలితాలు ఎలావుండాలనే విషయము ఆలోచించుటలేదు. మన సభయొక్క ఫలితాలెప్పుడు మనం సభకు ముందు చేసే ఏర్పాటులమీద ఆధారపడి వుంటుంది.

## సభలు ఎలా జరపాలి?

(1) సభను ఏ వుద్దేశ్యముతో జరుపుతున్నామో కరపత్రాలద్వారా, గొట్టాలద్వారా తెలియజేయాలి. వీటిద్వారా సమయము, విషయము, స్థలము, వుపన్యాసకులెవరో తెలియజేయాలి. (2) మీటింగు సలములో ముందుగానే జండా, ప్లాటుఫారము, లైటు ఏర్పాటుజేసి ఒక వాలంటీరు అక్కడవుండాలి. (3) మీటింగుకు ముందు వూరేగింపు ఆర్గనైజు చేయాలి. ఈ వూరేగింపులో ముగ్గురతో కూడిన పంక్తులలో నిలబెట్టాలి. నినాదములు ఏమియివ్వాలో, ఎవరుయివ్వాలో ముందుగానే నిర్ణయించుకోవాలి. 3,4 గురు కామేడ్స్ ప్రజలందరిని మీటింగుకు రావాలని చెప్పడానికి వూరేగింపుకు వెనుకనేవుండాలి. (జండాలు, నినాదాలు వ్రాసిన అట్టలు, తయారుచేసికోవాలి). (4ఎ) మీటింగుకు ప్రకటించిన టైముకు ప్రారంభించాలి. (4బి) వుపన్యాసకులకు స్థానిక పరిస్థితులు చెప్పాలి. లేనిచో ప్రజలు వెళ్ళిపోవడం, ప్రజలకు చెడ్డ అలవాట్లు నేర్పడం జరుగుతుంది. (5) మీటింగులో మన వాలంటీర్లు, వర్కర్లు ప్రజలమధ్య కూర్చోవాలి. వారి అభిప్రాయాలను నోట్ చేసుకోవాలి. (6) మీటింగు అనంతరము వర్కర్లు సమావేశమై మీటింగుపై సమీక్ష చేసికోవాలి. గుణపాఠములను నేర్చుకోవాలి. (7) వూరే

గింపు సందర్భములలో, మీటింగు సందర్భములలో మీటింగు ఫలితంగా వచ్చిన ఉత్సాహవంతులను సంబంధంలో నుంచుకొని వారిని అభివృద్ధి చేయాలి.

మహాసభలు.

ప్రతి ప్రజా సంఘముయొక్క సాంవత్సరిక సభను, మహాసభగా జరుపుతాము. దీనిలో రెండు భాగాలు. ఒకటి ప్రతినిధి మహాసభ. రెండవది బహిరంగ మహాసభ. ఈ మహాసభ మనము ఏ ఉద్దేశ్యముతో జరుపుతాము? గత సంవత్సరము జరిగిన పని సమీక్ష చేసికొనుట, ముందు కర్తవ్యాలను నిర్ణయించుకొనుట, ప్రజలలో ఈ మహాసభద్వారా చైతన్యమును కలుగజేసి అక్కడ తీసికున్న నిర్ణయాలకు ప్రజామోదమును పొందుట. ఈ మహాసభ జరిగిననాడేగాదు ప్రజలలో ప్రచారము జరుగునది, ఆ మహాసభను గురించి తర్వాత కూడా ప్రచారం జరుగుతుంది. ఉత్సాహవంతులైన ప్రజా పుత్రులతో సంబంధం కలుగుతుంది. అందుచే మహాసభవలన ఐక్యమములో ప్రజాసంస్థ చరిత్రలో ఒక నూతనదశ ప్రారంభమవుతుంది. ప్రజా వ్యతిరేక లను ప్రజలలో స్థానములేకుండా చేయగలము. సంఘముపుష్టి చెందడం, నిర్మాణాత్మకంగా బలపడడము జరుగుతుంది.

ఇప్పుడు చేసే లోపాలు.

(1) సరియైన ప్రచారము ప్రజలలో లేకపోవుట (2) సభ్యులను చేర్పించకపోవుట, మిలిటెంట్సును దృష్టిలో పెట్టుకొని అభివృద్ధి చేయక పోవుట, ప్రజాసమీకరణ లేదు. (3) ప్రతినిధులసభ, బహిరంగసభ టైము విచక్షణలేక ప్రతినిధిసభను త్వరగా ముగించుట. (4) ఉపన్యాసములలో ఎవరు ఏవిషయమై మాట్లాడాలో ముందుగా నిర్ణయించనందువలన ఆహ్వాన సంఘాధ్యక్షుడు, అధ్యక్షుడు, ప్రారంభకుడు, పతాకోత్సవము చేసేవారు అందరూ రాజకీయాలు చెబుతూ ఒకేవిధంగా మాట్లాడి ప్రజలలో విసుగు కలిగించడం జరుగుతోంది.

మహాసభ ఎలా జరగాలి.

మహాసభ జరుగు ప్రాంతములో తాలూకా, జిల్లా, రాష్ట్ర ప్రచారం చేయడానికి ముందుగానే కొన్ని దళాలను ఏర్పరచాలి. కొంత మంది భోజన ఏర్పాట్లు, పెండాలు నిర్మించటం, ప్రచురణ మొ॥ పనులు విభజించుకొని నిర్మాణయుక్తంగా పని చేయాలి. ప్రచారక దళాలు: మహాసభనుగురించి అందుజరిగే కార్యక్రమాన్నిగురించి ప్రచారంచేయుటం, ధనసేకరణ, రైతుసంఘసభ్యులను చేర్పించటం, ఈ సందర్భములో వచ్చిన వుత్సాహవంతులతో సంబంధం పెట్టుకోవటం, మొ॥ పనులు చెయ్యాలి. కొత్తగా సంబంధంలోకి వచ్చిన వుత్సాహవంతులను మహాసభకు ప్రజలను తీసుకొనివచ్చు బాధ్యత అప్పగించాలి.

ప్రతినిధులసభ మహాసభ జరిగే కాలానికి ఒకరోజుగాని, పూటగాని ముందుగానే పూర్తయ్యేటట్లు నిర్ణయించుకోవాలి. మహాసభకు వారం రోజులు ముందుగానే వాలంటీర్లను రప్పించి శిక్షణయివ్వాలి.

ప్రతినిధుల సభలో ఎజండా.

(1) సెక్రిటరీ రిపోర్టు, (2) ప్రజాసంఘ నిర్మాణానికి సంబంధించిన తీర్మానము, (3) ఆనాటి సమస్యలపై తీర్మానములు (ఈ తీర్మానములు స్పష్టమైన కార్యక్రమాన్ని సూచించునవిగా వుండాలి.) (4) డెలిగేట్సు తమ ప్రాంతాలలో అనుభవాలను తెలియజేయుచు వారికున్న సందేహాలను నివృత్తి చేసికోడానికి అందరితో ఊరికే రిపోర్టులు యిప్పించాలి. రాబోవు సంవత్సరానికి బాధ్యతలు, కోటాలు తీసికోవాలి. (5) సాంవత్సరిక బడ్జెటును తయారుజేసి దానిని వసూలుచేసే విధానమునుగూర్చి కూడా చర్చించుకోవాలి.

ప్రతినిధుల సభలో చేసిన నిర్ణయాల నాధారంగా చేసికొని మహాసభలో వుపన్యాసాలుండాలి. ప్రజలందరిని శాంతంగా కూర్చుండబెట్టి

వుపన్యాసము విసేటట్లుచేయు బాధ్యత శిక్షణబొందిన వాలంటీర్లది. ఈ మహాసభపై రిపోర్టులు తయారుచేయడానికి, ప్రజాభిప్రాయములు, వర్కర్ల అభిప్రాయములు, వ్యతిరేకుల పోకడలు తెలిసికోడానికి ముందుగానే కొంతమందిని నియమించాలి. మహాసభ జరిగిన ప్రాంతాలలో ప్రజలలో వచ్చిన చైతన్యాన్ని, పరిచయంలోనికి వచ్చిన వుత్సాహవంతుల్ని అభివృద్ధి చేయడానికి వెంటనే అర్గనైజర్సునువేసి శ్రద్ధగా పనిచేయించాలి. లేనిచో మహాసభ జరిపిన ఫలితాలు వ్యర్థమవుతాయి. మహాసభానంతరము ఆ సభకు ఇతర జమా ఖర్చులు పత్రికలలో ప్రకటించాలి. ఈ సభానంతరము సంఘం తరఫున ఈ సభ సాధించిన విజయాలు, చేసినలోపాలు సమీక్ష చేస్తూ లెటరు ఒకటి అధీనసంఘాలకు పంపాలి.

---

# ఇరిగేషన్. (Irrigation)

ఆక్టు పుట్టుక.

మనరాష్ట్రంలో 1854 సం॥ ప్రాంతాలలో, విపరీతమైన కరువు వచ్చింది. 1855 సం॥లో కరువు సంఘాలు ఏర్పడి విచారణలుచేసి, కరువు రాకుండా చేయడానికి పంటలు ఎక్కువపండే మార్గాలు వెదుకవలెనని, అందుకుగాను నీటివసరులు విరివిగా ఏర్పరచాలని, సూచనలు చేశాయి. ఆ కాలంలోనే కృష్ణా, గోదావరీనదులకు ఆనకట్టలూ, డెల్టాలకు పంటకాలువలూ, ఏర్పడ్డవి. వాటికితోడు రాష్ట్రమంతటా అనేక మేజరు, మైనరు జలాధారములు నిర్మించడమూ, వాటిక్రింద సాగుచేయబడే భూముల పై నీటి పన్ను వసూలుచేయడమూ అవుసరమైనది. అందుకుగాను మద్రాసు ప్రభుత్వము 1865 సం॥లో, మద్రాసు ఇరిగేషన్ సెస్సుఆక్టును అమలులోకి తెచ్చింది. తరువాత అది 1900 సం॥లో కొంత సవరించబడ్డది.

ఆక్టుయొక్క ముఖ్యాధికారాలు.

(1) ఇరిగేషన్ కొరకు నీటిని ప్రభుత్వం సప్లయిచేసినా లేక రైతులే ఉపయోగించుకున్నా,

(2) ప్రభుత్వానికి సంబంధించినట్టిగానీ, లేక నిర్మింపబడినట్టిగాని, నదులు, చెరువులు, వాగులు, కాలువలు మొదలైనవాటినుండి నీరుసప్లయి చేయబడినప్పుడుగానీ, లేక వాడుకున్నప్పుడుగానీ,

(3) పైనచెప్పబడిన నదులు, వాగులు, చెరువులు, కాలువలు వగైరాలనుండి రిజర్వాయర్లలోనికి నీటిని రప్పించి ఆనీటిని ఇరిగేషన్‌కు ఉపయోగించినప్పుడుగానీ, నీటితీరువా (Water cess) విధించవచ్చును.

(4) ఇరిగేషన్ అయిపోయి పంటపండిన తరువాతగాని, నీటిశిస్తు వసూలు చేయరాదు.

(5) జమీందారులు లేక ఈనాందారులు మొదలైనవారితో ఏయే భూములకు ప్రభుత్వం నీరు యివ్వడానికి ఒప్పుకొనియున్నదో ఆభూముల (మామూలుపల్లములు) ఇరిగేషన్‌కు తీరువా వసూలు చేయబడదు. కాని ఆభూములకు నిర్ణయింపబడిన కాలువలనుండే నీరు తీసుకోవాలి. తప్పుడు దారులవెంట నీరు తీసుకుంటే తీరువా వసూలు చేయబడుతుంది.

(6) నీటిశిస్తును భూమిమీద ప్రథమచార్జీగా వసూలు చేయవచ్చును.

(7) రైత్వారీ భూములకు భూమిశిస్తుతోబాటు నీటితీరువాకూడా వసూలు చేయబడుతుంది.

డెల్టా ప్రాంతాల భూములు, ఆథరైజ్డ్, అనాథరైజ్డ్ అను రెండు విధాలుగా వుంటాయి. ఆథరైజ్డ్ లాండ్సు అనగా, ఆయకట్టులో చేర్చుకోబడిన భూములు, అనాథరైజ్డ్ ల్యాండ్సు అనగా ఆయకట్టులో చేర్చుకోబడని భూములు. ఆథరైజ్డ్ ల్యాండ్సులో

(1) గ్యారంటీడ్ వెట్ (2) నాన్ గ్యారంటీడ్ వెట్ (3) ప్రికేరియస్ వెట్ అనే మూడురకాల పల్లంభూములున్నాయి. గారంటీడ్ వెట్ కు, దైవిక రాజకీయములవల్ల ఎట్టి అవాంతరములూ కలుగకుండావుంటే ప్రతి సం||మూ, ఆగస్టు 15వ తేదీలోగా సాగుకు నీరును తప్పనిసరిగా యివ్వాలి. నాన్ గారంటీడ్ వెట్ కు ఆ నియమంలేదు. ప్రికేరియస్ వెట్ ను అవసరమైనప్పుడు అధికారులు ఆయకట్టులోనుండి తొలగించవచ్చును. పై జెప్పబడిన తరగతులే కాకుండా, పితప పంటల (short crop) ప్రాంతమనీ, దీర్ఘ పంటల (long crop) ప్రాంతమని రెండువిధాల ప్రాంతాలున్నాయి. పితప పంటల ప్రాంతానికి ప్రతి సం||మూ నవంబరు నెల 10వ తేదీతో నీరు కట్టివేస్తారు. దీర్ఘ పంటలకు డిశెంబరు నెల 15వ తేదీవరకూ నీరు వదులుతారు. టెంపరరీ ఆయకట్టుకు తాత్కాలికంగా మాత్రమే నీరు యివ్వబడుతుంది. శెలవులేని సాగులకు నీటిసప్లయి విషయంలో ఏ హామీ లేదు.

రెండు పంటల భూములకు:-

మాగాణి భూములలో రెండవ (పల్లపు) పంట పండించుకోవాలంటే ముందుగా పర్మిషన్ పొందాలి, లేదా రెండుపంటలు పండించుకునే భూములుగా నిర్ణయింపబడైనా వుండాలి. అట్టి భూములలో రెండవ పంటకు, మొదటి పంటపై వసూలుచేసే ఏరువాలో, సగంమాత్రమే వసూలు చేయబడుతుంది. మూడు పంటలు పండించినా రెండు పంటలకే శిస్తు వసూలు చేయాలి.

ఒక్క పంటపండే భూములకు:-

సాధారణతీరువా మాత్రం వసూలుచేస్తారు. మొదటి పంటకాలంలో నీరు పెట్టుకోక రెండవ పంటకాలంలో పెట్టుకుంటామంటే ఒప్పుకోరు. పితప పైరుల ప్రాంతానికి పితప పైరులనే ఊడ్చాలి. మొదటి పంటకోసిన

తరువాత పిలకదొడిగి, ఆ పిలకే పంటపండితే ప్రత్యేకంగా శిస్తు వసూలు చేయరు. మినుము, పెసర, లేక జనుమువగైరా మెరక పంటలను రెండవ పంటగా పండించుచున్నంటే ఎట్టి శిస్తూ వసూలుచేయకూడదు. నారు (ఆకు) మళ్ళకు ప్రత్యేక శిస్తు వసూలుచేయకూడదు. నీరు పెట్టుతున్నప్పటికీ పశు గ్రాసములకు (పిల్లిపెసర వగైరాలకు) తీరువా వసూలుచేయరు. చవుడు చంపుకోవడానికి, జీలుగవగైరా పచ్చిఆకు ఎరువు పెంచుకోవడానికి, నీటిని వుపయోగించుచున్నా, ప్రత్యేకంగా ఏమీ వసూలుచేయరు.

తోట భూములకు.

చెరుకువగైరా తోటలువేసి, వేసిన ఫసలీలోనే కోత కోసివేస్తే మామూలు తీరువాకు 1½ రెట్లు వసూలుచేయబడుతుంది. వేసిన ఫసలీలో కోయక మరుసటి ఫసలీలో కోస్తే రెండుసంవత్సరములూ మామూలు తీరువాయే వసూలుచేస్తారు. మొదటి సంవత్సరములోగాని, రెండవ సంవత్సరములోగాని, తోటకుముందుగాని, వెనుకగాని ఏదైనా పల్లపుపంట పండిస్తే ఆ పంటకు మామూలు రేటున్నూ, తోటకు 1½ రెట్లున్నూ వసూలుచేస్తారు. తోటవున్న రెండు సంవత్సరములలోనూ, తోటకు ముందూ, వెనుకా రెండుపల్లపు పంటలను పండిస్తే, వకపంటకు మామూలు రేటున్నూ, తక్కిన రెండు పంటలకూ రెండేసిరెట్లున్నూ వసూలుచేస్తారు.

మెరక భూములకు.

ఆయకట్టులోలేని మెరకభూములు పెర్కొలేషన్ వల్లగాని, మురుగు ద్వారాగాని, ప్రక్కభూములనుంచిగాని, లేక వాటిద్వారాగాని, నీటిని ఉపయోగించుకొని సాగుచేసినప్పుడు వాటరురేటు వసూలుచేయవచ్చును. కాని ఆనీటివల్ల సాగుచేయబడిన భూములలో మామూలుపంటకంటె ఎక్కువపంట పండి, ఆనీటియొక్క ఫలితాన్ని రైతులు పొందినప్పుడే వాటర్ రేటు వసూలు చేయాలి. ఫలితంలేకపోతే వసూలు చేయకూడదు. మెరకభూములు సాగు

చేసినప్పుడు భూమిశిస్తుతోపాటు నీటితీరువాగూడా విధించబడుతుంది. పంటలతోపోసిగాని, గూడలువేసిగాని సాగుచేసినప్పుడు తరువాయి మొత్తంలో 4 వ వంతు తగ్గించవచ్చును. ఈతగ్గింపు ప్రభుత్వజలాధారములనుండి నీరు పారుదల కానప్పుడు మాత్రమే చేయబడుతుంది. ఈసౌకర్యం కృష్ణా, గోదావరి డెల్టాలకూ, లంకలకూ, దివిపంపింగ్ స్కీముకూ, కర్నూలు - కడప కాలువ క్రింది భూములకూ, నెల్లూరుజిల్లాలోని మోపాడు రిజర్వాయరుక్రిందా, గోదావరిజిల్లాలోని పోలవరం ఐలెండు ప్రాజెక్టుక్రింది భూములకూ, కర్నూలులో వెంకటాపురం, సిద్ధాపురం చెర్వులక్రింది భూములకూ, గుంటూరు జిల్లాలో భావనాసి చెర్వుక్రింది భూములకూ వర్తించదు. ఇం గాక నీటిశిస్తు విధానంలో ప్రత్యేకపద్ధతులున్నట్టి వైజాగ్ జిల్లాలోని నాగావళిప్రాజెక్టుకూ, కర్నూలు, కడపజిల్లాలలోనూ, అనంతపురం జిల్లాలో కదిరితాలూకాలోనూ, చిత్తూరుజిల్లాలో మదనపల్లి, వాయిల్పాడు - తాలూకాలలోనూ, నెల్లూరు జిల్లా కంతటికిని యీ సౌకర్యం వర్తించదు.

మెరకభూములపై వాటరురేటు విధించవలసి వచ్చినప్పుడు డిప్యూటీ తహశీలుదారునుండి జిల్లాకలెక్టరువరకూ వారి యిష్టంవచ్చిన రేటు విధించడానికి అధికారం కలిగివున్నారు. ఒకనెంబరులో కొంతభాగాన్నే సాగుచేసినప్పుడు సాగుచేయబడిన భూమికి మాత్రమే వాటరురేటు వసూలు చేయాలి.

## నీరు వాడుకునే హక్కు.

ప్రభుత్వానికి సంబంధించినట్టిగాని, లేక ప్రభుత్వం నిర్మించినట్టిగాని, జలాధారములనుండి, నీరు వాడుకునేటప్పుడు, శాశ్వతంగానైనా, లేక తాత్కాలికంగానైనా, అందుకు సంబంధించిన అధికారులనుండి, పర్మిషన్ పొందివుండాలి. పర్మిషన్ లేకుండా నీరువాడుకుంటే అపరాధపురేటు విధించబడుతుంది. రిజర్వు అడవులలోనుండి వచ్చే నీరు వాడుకోదలచినప్పుడు ముందుగా కలెక్టరు అనుమతిపొందాలి. కలెక్టరు ఫారెస్టు కన్సర్వేటరుతో

సలహాచేసి పర్మిషన్ యివ్వాలి. ఒక రైతుయొక్క స్వంత భూములగానే, ఒక ఊట జాలుపుట్టినప్పుడు, ఆజాలును అడ్డుకోకుండా ఆరైతు, ఆభూమికి, వాటరురేటు యివ్వకుండానే, నీటిని ఉపయోగించుకోవచ్చు.

## జలాధారములపై అధికారం.

జలాధారములలో మేజరు, మైనరు అనే రెండురకాల జలాధారాలు వుంటవి. మైనరు జలాధారమనగా య 200 లలోపు ఆయకట్టు కలిగినవి. అంతకుమించినవి మేజరు జలాధారాలు: మైనరు జలాధారములమీద సర్వాధికారం నీటి పంపకముతో సహా, రివిన్యూ డిపార్టుమెంటుది. మేజరు జలాధారములమీద, రక్షణ, నీటిపంపకము, ఆయకట్టును నిర్ణయించుట మొ॥ అధికారాలు పి. డబ్ల్యు. డి వారివి. నిర్మాణముకూ, మరమ్మతులకూ, డబ్బు శాంక్షన్ చేయడానికీ, నీరు వృధాగాపోకుండా ఉపయోగింపబడేటట్లు చేయడానికి అధికారం రివిన్యూ డిపార్టుమెంటుది.

## మరమ్మతులు.

మైనరు జలాధారములకు, మరమ్మతులకుగాను కలెక్టరు, రు 2500 ల వరకు ఖర్చుపెట్టవచ్చును. అంతకుమించిన ఖర్చుకు రివిన్యూబోర్డుకు మాత్రమే అధికారముంది. మేజరు జలాధారములకు పి. డబ్ల్యు. డి వారు తయారుచేసిన బడ్జెటుననుసరించి కలెక్టరు, రు 5,000 ల వరకూ శాంక్షన్ చేయవచ్చును. అంతకుమించిన మొత్తాన్ని శాంక్షన్ చేయుటకు అధికారము రివిన్యూబోర్డుది. మైనరు జలాధారములలో, చెరువులు వగైరాలకు కుడి మరమ్మతులు చేయవలసిన బాధ్యత రైతులది. ఆ మరమ్మతు చేసినందుకు, రివిన్యూ ఉద్యోగులకు యిష్టమైతే రైతులకు కొంత ప్రతిఫలం ఇవ్వవచ్చును. కుడి మరమ్మతనగా? వరవలలో పూడిక తీసుకోవడం, గాలివాన సమయాలలో కట్టలు తెగిపోకుండా కాపాడడం మొ॥నవి.

ప్రమాద సమయాలలో, అనగా గాలివాన, వరదలు, మొదలైన వాటివల్ల, ఇరిగేషన్ సప్లయిమార్గాలు దెబ్బతిని, ఆయకట్టుకే నష్టంవచే

పరిస్థితులలో కలెక్టరు ఎంత మొత్తాన్నైనా అవసరానికి ఖర్చుపెట్టవచ్చును. కాని ఆఖర్చు పి. డబ్ల్యు. డి వారి ద్వారా పెట్టబడాలి.

## కాలువలు.

కెనాల్స్, ఛానెల్స్, స్లూయిస్, అనే కాలువలన్నీ పి. డబ్ల్యు. డి వారి యాజమాన్యంక్రింద వుంటయి. వాటి మరమ్మతులు కూడా వారి ద్వారానే జరుగుతయి. పంట కాలువలమీద అజమాయిషీ రివిన్యూ ఇన్స్పెక్టర్లూ, తహశీల్దార్లూ చూస్తుంటారు. కాని బోదెలతో వారికి సంబంధంలేదు. నీరు సరిగా, సరియైనమార్గాలలో, సరఫరా అయ్యేటట్లు చూడవలసిన బాధ్యత రెవిన్యూ డిపార్టుమెంటుది.

## సాగుబడి.

సామాన్యంగా పెద్ద కాలువలలోకి నీరువచ్చిన వారంరోజులలో పంట కాలువలకు నీరు వదులుతారు. అప్పటినుండి జులై నెల ఆఖరులోగా ఆయకట్టులోని భూములు సాగుకాకపోతే, సబ్ డివిజనల్ ఆఫీసరుగా, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకూ తెలియపర్చాలి. సాగునిలచిపోయిన భూములకు నీరు వచ్చే ఏర్పాట్లు వారు వెంటనే చేస్తారు. వకవేళ ఆగస్టు 15వ తేదీవరకూ కూడా నీరు రాకపోతే, జిల్లాకలెక్టరుకూ, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకూ పిటీషన్లు పెట్టాలి. గారంటీడ్ లాండ్సు అయితే కాలువలకు గండ్లుపెట్టి అయినా సాగుచేయిస్తారు. అలా సాగుచేయించకపోయినప్పుడు, పి. డబ్ల్యు. డి. వారి అశ్రద్ధే అందుకు కారణమైనప్పుడు మనము నష్టపరిహారం కోరవచ్చును. ఏసందర్భములోనూకూడా గండ్లుపెట్టిగాని, తప్పుడు మార్గాలద్వారాగాని సాగుచేయకూడదు అలాచేస్తే పెనాల్టీలు విధించబడతయి.

## పెనాల్టీలు.

శలవు (పర్మిషన్) లేని సాగులపైనా, పుంతలు డొంకలువగైరాలు ఆక్రమించి సాగుచేసినప్పుడూ, తప్పుడు మార్గాల (Wrong Sources)

ద్వారా సాగు చేసినప్పుడూ, కాలువలను గండ్లుకొట్టి సాగుచేసినా పెనాల్టీలు విధించబడతాయి. భూముల్ని తనిఖీచేసి ఈ విషయాలను రిపోర్టుచేసేది గ్రామ కరణం. రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకూడా తనిఖీచేస్తుంటాడు. కాలువలను గండ్లు పెట్టినప్పుడు పి. డబ్ల్యు. డి. ఓవర్‌సీయరు లేక అతనికింది గుమాస్తాలు కూడా రెవిన్యూడిపార్టుమెంటుకు రిపోర్టు చేస్తారు. పంటకాలువలపై వారు జాగ్రత్త తీసుకోరు. ఈ రిపోర్టులను ఆధారంగా తీసుకుని తహశీల్‌దారు రైతుకు నోటీసు పంపుతాడు. రైతునుండి సరియైన జవాబు రాకపోయినా లేక వచ్చినప్పుడు సంతృప్తికరంగా లేకపోయినా పెనాల్టీలు విధిస్తాడు. ఆ పెనాల్టీల పూర్తిరద్దుకుగాని, లేక తగ్గింపుకుగాని జమాబంది ఆఫీసరుకు అప్పీలుచేయాలి. అక్కడకూడా న్యాయంజరుగలేదనుకుంటే, జమాబంది జరిగిన నెలరోజులలోగా జిల్లాకలెక్టరుకు అప్పీలు చేసుకోవాలి. ఈ అప్పీలుకు రు 1-4-0 స్టాంపు అంటించాలి. జమాబంది ఆఫీసరుయొక్క ఆర్డరు నకళ్ళనుకూడా దాఖలుచేయాలి. పెనాల్టీలు తగ్గించడానికిగాని, లేకపూర్తిగా రద్దుచేయడానికిగానీ కలెక్టరుకు పూర్తి అధికారముంది.

## నీటి ఎద్దడి.

మనరాష్ట్రంలో సాధారణంగా ప్రతిజలాధారముకింద కూడా నీటి ఎద్దడి (Scarcity) కలుగుతోంది. దానికి కారణం? కొన్ని జలాధారములకు సకాలంలోనూ, సరిగానూ నీరు రాకపోవడం, కొన్ని జలాధారములకింద పరిమితిని మించిన ఆయకట్టు వుండడము. కృష్ణా, గోదావరి డెల్టాలలో పరిమితిని మించిన ఆయకట్టు వున్నది. వున్నఆయకట్టుకు సరిపడినంత నీరు కాలువలకు రావడంలేదు. ఉ॥ కృష్ణా ఈస్టరన్ డెల్టాకు 8200 క్యూసెక్సు నీరు రావలసివుంటే 7500 కు మించి రావడంలేదు. అందుచేత కృష్ణా డెల్టాలో నీటిఎద్దడి ఎక్కువగావుంటోంది. గోదావరి పశ్చిమడెల్టా ఇంతకంటె అధ్వాన్నంగా వుంది. గోదావరి తూర్పు, సెంట్రల్ డెల్టాలుమాత్రం కొంచెం నయం. ఈ కారణాలవల్ల కాలువల మొదటిలోనున్నవారు ఏదో

విధంగా నీరు సమృద్ధిగా వాడుకోవడం, కాలువల చివరిభూములకు నీరు వెళ్ళక సాగుబడి నిలచిపోవడం జరుగుతోంది. దీనిని తొలగించి పైనాక్రిందా కూడా సమంగా సాగయ్యేటట్లు చూడడానికి రీమోడలింగ్ స్కీములు, ప్రిపోర్షనేట్ డిశ్చార్జింగు పద్ధతులూ అమలు జరుపబడ్డాయి. ఈ స్కీముల వల్ల అదనంగా నీరు ఎక్కడినుండీ వచ్చేదిలేదు. వున్న నీటినే క్రిందిభూములకు పైభూములకు సప్లైతూవుంటే బాగా వర్షములు కురిసినప్పుడు మురుగునీటితో తక్కిన భూములన్నీ సాగై, తమబాధ తప్పిపోవడానికి ప్రభుత్వం ఈ పద్ధతులు అవలంబించింది. ఈ విషయంలో రైతులలోటుకూడా వుంది. సితపపంటల ప్రాంతానికి దీర్ఘపంటలువేయడం, గండ్లుబెట్టి సాగుచేస్తూ నీటిని వృథాచేయడం మొదలైనవి రైతుల లోట్లు.

## నీటిఎద్దడిని తొలగించే మార్గం.

ఎవరికివారు చిన్నతూములను పెద్దవిచేయమనీ, తమ కాలువలకు నీరు ఎక్కువ విడువమనీ, తూములు ఇంకా ఎక్కువ ఎత్తవలసిందనీ కోరి ప్రయోజనంలేదు. ఒకచోటికి ఎక్కువనీరు యిస్తే దానికి బదులు ఇంకొక చోట ఎక్కువభూమి పాడవుతుంది. అందుచేత ఆయాప్రాంతాల రైతులందరూ కలిసి జలాధారములను బాగా మరమ్మత్తు చేయవలసిందనీ; నీటి వనరులను సరిగా బాగుచేయాలనీ; కృష్ణానది ఆనకట్టపై షట్టర్సు ఇంకా రెండడుగులు పెంచి, ఏటితూములను పెద్దవిజేసి, కాలువలను సరిగా త్రవ్వించాలనీ; గోదావరి ఆనకట్ట లెవెలు పెంచి, కాలువలు సరిగా మరమ్మత్తుచేసి ఎక్కువనీటిని సప్లయి చేయాలనీ ఆందోళనచేయాలి. అలాగే ప్రతిచోటా కూడా సరియైన (Positive) కోర్కెల్ని పెట్టి, వాటికై కృషిచేయాలి. అలా చేస్తేనేగాని నీటిఎద్దడిని తొలగించడం సాధ్యంగాదు.

## రీమోడలింగ్ స్కీము.

ఈ స్కీమును ఆరంభంలో రైతు సంఘాలు వ్యతిరేకించినవి. అది పొరపాటు. ఈ స్కీము లేకపోతే కాలువ చివరిభూములు విపరీత నష్టాలకు

గురికావలసి వస్తుంది. కాబట్టి ఈస్కీము ఉంచుతూనే నీరు ఎక్కువగా సప్లయిచేసే ఏర్పాట్లు చేయాలని రైతుసంఘాలు ఆందోళన చేయాలి. ఈ స్కీములో రూల్ ప్రకారం 3 అంగుళాల తూములు ఎక్కడా (ప్రత్యేక అవుసరాలకొరకు ఏర్పరచబడినవితప్ప) వుండకూడదు. కాని 3 అంగుళాల తూములుకూడా కొన్నిచోట్ల వున్నాయి. వాటిని తొలగించుటకు కృషి చేయాలి.

## ప్రిపోర్షనేట్ డిశ్చార్జింగ్ పద్ధతి.

ఈ పద్ధతిని తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలలో వక జిల్లావారు వుంచాలంటే, వకజిల్లావారు తీసివేయాలని ఆందోళన చేస్తున్నారు. ఇది కూడా పొరపాటే. ఈ పద్ధతి వుండేటేగాని ఏటిసప్లయి సరిగా జరుగదు. అందుచేత ఆనకట్టపైన ఇసుకమీటలు తీసివేసి కాలువలు బాగుచేసి నీటిసరఫరా ఎక్కువచేయాలని ఆందోళన చేయాలి.

## మురుగు నీటి వసతులు.

కృష్ణా గోదావరి డెల్టాల రెండింటిలోకూడా మురుగునీటి వసతులు చాలా తక్కువ. అందువల్ల చాలభూములు, ముఖ్యంగా కొల్లేటిభూములు ఎంతో నష్టపడుతున్నాయి. ఒక్కొక్క సంవత్సరం పంటలు పూర్తిగాపోయి ప్రభుత్వం పూర్తి రెమీషన్ కూడా యివ్వవలసి వస్తోంది. అందువల్ల రైతులూ ప్రభుత్వమూ ఇద్దరూ నష్టపడుతున్నారు. కాబట్టి సరియైన మురుగునీటి వసతులు ఏర్పరచాలని, వీలైనచోట్ల మురుగునీటికిరింద కూడా సాగుచేయించాలని, రైతుసంఘాలు ఆందోళన చేయాలి.

## లంచాలు.

సాధారణంగా డెల్టా ఏరియాలో ప్రతి గ్రామమూకూడా సంవత్సరానికి కొంత మొత్తము చొ॥న ఓవర్సీయర్లకు, లస్కర్లకూ లంచాలు

యివ్వడం మామూలు. అదిగాక అవుసరాన్నిబట్టి ఎవరికివారే వ్యక్తిగతంగా ఓవర్‌సీయర్లకూ, కరణం, రివిన్యూ ఇన్‌స్పెక్టర్లకు కూడా లంచాలు యిస్తుంటారు. లంచాలు ఎందువల్ల యివ్వవలసివస్తోందో చూదాం.

(1) నీరుచాలక కాలువలకు గండ్లుకొట్టి సాగుజేసుకోవలసి వచ్చినప్పుడూ, (2) సాగుబడిలో పొలం ఒక కాలువ క్రింద చేర్చబడి, ఆకాలువనుండి నీరు తెచ్చుకోవడం సాధ్యంకాక, వేరొక కాలువక్రింద సాగుజేయవలసి వచ్చినప్పుడూ, (3) మురుగునీటిని పోగొట్టుకోవడానికి కాలువలు కట్టివేయించవలసి వచ్చినప్పుడూ, (4) భూములను ఆయకట్టులో చేర్పించుకోవడానికీ, (5) పెద్దతూములను సంపాదించుకోవడానికీ, (6) కాలువలు మార్పుచేయించుకోవడానికీ, (7) ఆక్రమణలు కమ్మి చేయించుకోవడానికీ రైతులు వ్యక్తిగత లంచాలు యిస్తారు. ఇవిగాక నీరు సరిగా వదలమనీ, కాలువగట్లపైకి పశువులను రానీయమనీ, యిబ్బందులుపెట్టి ఓవర్‌సీయరూ, లస్కరూ లంచాలు గ్రామ మొత్తాలుగా పుచ్చుకుంటారు. వీటినే మామూళ్ళంటారు.

### వీటిని అరికట్టే విధం.

(1) ఏయే కాలువలకు, స్లూయిస్‌కు ఎంతెంత నీరు వదలవలసివుంటుందో తెలుసుకొని అంతంత నీరు వదిలేటట్లు వర్కర్లు కృషిచేయాలి. (2) ఆయా తూముల క్రింద సాగుబడి దిగబడిపోయినప్పుడు, తూములను పెద్దవి చేయవలసినదిగా పి. డబ్ల్యు. డి వారికిన్నీ, కలెక్టరుకున్నూ పిటీషన్లుపెట్టించి, ఫలితాలను సాధించాలి. (3) మురుగునీటి వసతులు సరిగా ఏర్పాటు చేయించాలి. (4) ఓవర్‌సీయర్లు కాలువలు సరిగా వదలనప్పుడు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకూ, కలెక్టరుకూ తెలియపర్చాలి. అందుకు సంబంధించిన వివరములు, ఎవిడెన్సులు, రీడింగ్సు సాక్ష్యంకొరకు నోట్ చేసి వుంచాలి. (5) ఒక కాలువక్రింది భూములను వేరొక కాలువక్రింద చేర్చవలసి వచ్చినపుడు కలెక్టరుకూ, ఇంజనీరుకూ పిటీషన్లుపెట్టి తగిన కృషిచేస్తే తప్పక సాధించవచ్చు.

(6) రైతులమధ్య బాగాప్రచారంచేసి గట్లుపెట్టి సాగుజేసే పద్ధతినాపాలి. గండ్లు పెట్టకపోయినా పెట్టారని బనాయించినప్పుడు ముందు తహశీల్ దారుకు తెలియపర్చాలి. తరువాత జమాబంది ఆఫీసరుకూ, జిల్లాకలెక్టరుకూ అప్పీళ్లు చేయించడం ద్వారా ఎదుర్కోవాలి. (7) పితప పంటల ప్రాంతములో ఆ పంటలనే వేసేటట్లు రైతులందరిమధ్యా ఏవ్రింగా ప్రచారం చేయాలి. (8) రైతులంతా ఐకమత్యంతో నీటిని జాగ్రత్తగా వుపయోగించుకొనేటట్లు తీవ్రకృషి చేయాలి. (9) లంచాలు యివ్వవద్దని, తాత్కాలికంగా కష్టాలకైనా ఓర్చి, ఫలితాలుసాధించాలని రైతులమధ్య ప్రచారంచేయాలి. ఈవిధంగాచేస్తే మనం తప్పకుండా లంచాలను అరికట్టవచ్చు. పంటలు ఏప్రాంతములోనూ నష్టపడకుండా సాధ్యమైంతవరకు కాపాడవచ్చు.

ఇరిగేషన్ అడ్వైజరీబోర్డు.

ఈబోర్డులో 6 గురు సభ్యులుంటారు. అందులో జిల్లాకలెక్టరు 2 ని నియమిస్తాడు. జిల్లాబోర్డు 3 ని ఎన్నుకుంటుంది. రైతుసంఘాలు 1 ని ఎన్నుకుంటాయి. (ఇటీవలి ప్రభుత్వ ప్రకటనలో రైతు ప్రతినిధి విషయంలేదు. రైతుసంఘాల ప్రతినిధి వుండాలని ఆందోళనచేయాలి) ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు ఈ బోర్డుయొక్క సలహాలు అందుకుంటూ వుంటాడు. డిప్యూటీ కలెక్టర్లూ, జిల్లా వ్యవసాయశాఖాధికారీ దీనిలో ఎక్సఅఫిషియో మెంబర్లు.

ఈబోర్డు చేసేపని.

(1) నీటి పారుదలకు సంబంధించిన ప్రతివిషయాన్నీ చర్చించి సలహాలు యివ్వవచ్చును. (2) తోటలు వేయుటకు "జోన్సు" నిర్ణయించవచ్చును. (3) కాలువలపై రవాణా సౌకర్యాలనుగూర్చి చర్చించవచ్చు. (4) కాలువ కట్టలమీద P. W. D. పోరంబోకలలోనూ, కూరపాదులు, పచ్చి ఆకు ఎరువునిచ్చే చెట్లూ నాటించే ఏర్పాటులు చేయవచ్చు. (5) రెండవ పంటకు "జోన్సు" నిర్ణయించవచ్చు. (6) ముంపుగ్రామములకు శిస్తు

తగ్గింపులకై సిఫార్సు చేయవచ్చు. (7) పశుగ్రాసానికి నీరు పెట్టుటంటే శిస్తులేకుండా చేయవచ్చు.

ఈ విధంగా ఇరిగేషన్‌కు సంబంధించిన విషయాలను చర్చించి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకూ, జిల్లాకలెక్టరుకూ సలహాలిస్తుంది. పూర్తి ఫలితం కలుగకపోయినా కొంతవరకైనా ఈ బోర్డువల్ల లాభముంటుంది.

చెరువులు.

పాడుబడిన చెరువులుంటే రైతులు కలెక్టరు అనుమతితో బాగు చేయించి ఆడబ్బును ప్రభుత్వంనుండి తీసుకోవచ్చును. ఒక్కొక్కప్పుడు చెరువులు చెడిపోతే కలెక్టరు రైతులనే బాగుచేయించవలసినదిగా కోరవచ్చును. కాని దానికిఅయ్యే ఖర్చులు యిస్తారు. వరదలవల్ల కట్టలు తెగిపోయే పరిస్థితి కలిగితే గ్రామమునిసిఫ్ రైతులను పిలచి కట్టలను కాపాడుటకు పని చేయించవచ్చును. చెరువుయొక్క మామూలు కళింగలా (పొర్లు లేక చెర్వుకొమ్ము)ను తాత్కాలికంగా రివిన్యూఅధికారుల అనుమతితో 1 అంగుళం పెంచి నీటినిఎక్కువగా ఆపుచేసుకోవచ్చును. కాని అలానిల్వచేయడం చెరువుకు ముప్పు తెచ్చేదిగా పరిణమించరాదు. చెర్వులలోకివచ్చే నీటివనరుల (వాగుల)కు సంబంధించిన అధికారమంతా రివిన్యూ డిపార్టుమెంటుది. వాగులను అడ్డకట్టలుకట్టి చెరువుకు నీరుపెట్టుకోవాలన్నప్పుడు తహశీల్‌దారు పర్మిషన్ పొందాలి. క్రిందిచెరువులకు నీరు రాకపోతే తహశీల్‌దారు పైచెరువుదగ్గర వాగులకు వేసిన అడ్డకట్టలను తెగకొట్టించవచ్చు. మామూలుగా చెరువులకు నీరు వచ్చే వాగులవెంట ఎవరైనా క్రొత్తచెరువులు ఏర్పాటుచేయదలచుకొన్నప్పుడు కలెక్టరు పర్మిషన్ పొందాలి. అలా పర్మిషన్‌పొందకపోతే కలెక్టరు పైచెరువులను పూడ్పించవచ్చును. ఎవరైనా చెరువులు త్రవ్వించేటప్పుడుగాని, తరువాతగాని, వాటివల్ల రైల్వేలైనుకు దెబ్బతగిలే పరిస్థితి కలిగితే కలెక్టరు వాటివిషయంలో అవుసరచర్యలు తీసుకోవచ్చును. అవసరమైతే చెరువును పాడుచేయించవచ్చు. లేదా నీటిమట్టం తగ్గించవచ్చు. చెరు

వులకింకి సాగుకు నీరు ఫలానా తేదీనాటికి సప్లయిచేయాలనే నియమం లేదు. పండకపోతే రిమిషన్ యిస్తారు. 2 అణాల పంటకు తక్కువైతే పూర్తి రిమిషన్ యివ్వాలి. నీరులేక చెరువుఆధారం పల్లపుభూమిలో మెరక పంటలు పండించుకుంటే, తరం జాస్తిమాత్రం వసూలు చేస్తారు. పల్లపు రేటు వసూలుచేయరు. నీరులేక 4 సం॥లు వరుసగా పల్లపుపంటలు పండక పోయినప్పుడు ఆభూములను ఆయకట్టులోనుండి తొలగించి, మెరకహోద్దులో జేర్చుటకు కలెక్టరును కోరవచ్చును.

బావులు.

రైతు మెరకభూములలో ఒక బావిని స్వంతంగా త్రవ్వుకొని సేద్యం చేసుకొంటూంటే, దానిపైన నీటి శిస్తు విధించకూడదు. తరం మాత్రం మార్పుచేయవచ్చును. ఆయకట్టు భూములలో బావి త్రవ్వుకొని సాగుచేసుకుంటానంటే వప్పుకోరు. తీరువా వసూలుచేస్తారు. 1884 సం॥ ఆగస్టు 20 తేదీకి పూర్వం త్రవ్వబడి సాగుకు ఉపయోగపడుతోన్న భావులక్రింద పల్లానికి మాత్రం తీరువా వసూలుచేయబడదు.

నజరానా.

మెరక భూములను ఆయకట్టులో చేర్చుకున్నప్పుడు య 1 కి రు 25 లు వరకు నజరానా వసూలుచేస్తున్నారు. 1935 సం॥నుండీ ఈ నజరానాకు వ్యతిరేకంగా గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో తీవ్రఆందోళన జరుగుతోంది. నజరానా వసూలుచేయడమంటే, ఒకవిధంగా లంచం తీసికోవడమువంటిదని రైతుల వాదన. ప్రభుత్వం నజరానా వసూళ్ళను రద్దుచేయకుండా ఏ సంవత్సరానికాసంవత్సరం వాయిదాలు వేస్తోంది. అధికఆహారోత్పత్తి స్కీముననుసరించి ఆయకట్టులో చేర్చుకునే భూములకుమాత్రం నజరానా అక్కరలేదని ప్రకటించింది. ఈ నజరానాక్రింద వక్క కృష్ణా జిల్లాలోనే ఇంకా 19 లక్షల వరకు కట్టాలి. యుద్ధానంతరంవరకు ప్రభుత్వం వసూలు చేయదలచలేదు. కాని యుద్ధానంతరమైనా యీసమస్య రైతు సంఘాల నెదుర్కొంటుంది. అసలు ఈపద్ధతే రద్దుచేయాలని మనవాదన.

మనలోట్లు.

ఇరిగేషన్ వ్యవహారాలను పూర్తిగా తెలుసుకోకుండా మనం పని చేస్తున్నాం. అందువల్ల మనం పి. డబ్ల్యు. డి ముందు సరియైన (Positive) కోర్కెల్ని పెట్టలేకపోతున్నాం. ఒకే కాలువక్రింద కొత్త భూములను ఆయకట్టులో చేర్చుకోవలసినదిగానూ, పాత భూములకు నీరు సప్లయికావడం లేదనీకూడా, ఒకేసారి ఆందోళనచేస్తూంటాం. కాలువల మొదటిలోనున్న రైతులు రీమోడలింగ్ స్కీం అక్కరలేదంటే మనమూ అక్కరలేదన్నాం. ఇలాంటి లోట్లు చాలా చేస్తున్నాం. ఒక్కొక్క కాలువకు నీరు యెంత రావాలో, ఏతూము ఎంతఎత్తాలో తెలుసుకుని పనిచేయడంలేదు. వేసవికాలంలోనే కార్యక్రమాన్ని నిర్ణయించుకొని పితప పంటల ప్రాంతంలో పితప పైరులనే వేయవలసినదిగా రైతులలో ప్రచారంజేసి వేయించకపోవడంవలన, ఆ ప్రాంతంలో దీర్ఘ పంటలు వేయడం, దానికి నీరు అదనంగా యిప్పించడానికి కష్టపడవలసిరావడం, చివరకు దీర్ఘ పంటల ప్రాంతానికి నీరు తక్కువగావడం జరుగుతోంది. ఇదంతా మన ప్రాప్తకాలజ్ఞతవల్ల కలుగుతోంది. ఈలోట్లను తొలగించుకొనకపోతే మనం సరిగా పనిచేయంలేం.

వర్కర్లకు కొన్ని సలహాలు.

(1) ఇరిగేషన్ ప్రాంతాలలో పనిచేసే ప్రతి కామ్రేడ్కూడా ఎఫెసల్సు, రీడింగ్సు, నీటిపారుదల పద్ధతులు తెలుసుకుని వుండాలి.

(2) యే భూములకు యెన్ని క్యూసెక్సు నీరు కావలసివుంటుందో, డ్యూటీ యెంతో తెలుసుకోవాలి.

(3) భూములను ఆయకట్టులో చేర్పించటకూ, కాలువలు యిప్పించుటకూ, తూములు పెద్దవి చేయించుటకూ, కొత్త తూములు ఏర్పరచుటకూ, ఎవరెవరికి ఏవిధంగా పిటీషన్లుపెట్టాలో తెలుసుకోవాలి.

(4) ఆక్రమణలకు, గండిసాగులకు, సెలవులేని సాగులకు విధింప బడే పెనాల్టీలు, వాటిని ఎదుర్కోవలసిన విధానమూ, ఆ సందర్భంలో చేయవలసిన అప్పీళ్ళూ పూర్తిగా తెలుసుకొని పనిచేయాలి.

(5) ఓవర్‌సీయర్ల మామూళ్ళను అరికట్టి, నీటిపంపకం సరిగా జరుగునట్లు చూడాలి.

(6) మురుగునీటి వసతులకై రైతులతో సమిష్టి ఆందోళన చేయించాలి.

(7) జలాధారాల మరమ్మతులకూ, ఆనకట్టల పెంపుదలలకూ నిర్మాణాత్మకమైన సూచనలిస్తూ, ఆ సమస్యలపై రైతులనందరినీ ఐక్యపరచి ఆందోళన చేయించాలి.

(8) నీటిఎద్దడి సంభవించినప్పుడు రైతులలో రైతులే సర్దుకొని పంట నష్టం కాకుండా పని జరుపుకునేటట్లు చూడాలి.

(9) ఆహార అధికోత్పత్తికొరకు వీలైనచోట్ల రెండవపంటకు నీరు సప్లై చేయించడానికీ, చిన్నచిన్న వాగులక్రిందా, మురుగునీటి క్రిందా సేద్యం చేయించడానికీ కృషిచేయాలి.

(10) బుడమేరు, తమ్మిలేరు, అక్కిలేరు, దెందులూరు, కొల్లేరు మొదలైన స్కీములను వెంటనే పూర్తిజేసేటట్లు ప్రభుత్వాన్ని వత్తిడి చేయాలి.

ముగింపు.

పైనజెప్పిన విధంగా ఇరిగేషన్ సమస్యలను తెలుసుకుని పనిజేస్తే మనం రైతులకు ఎంతో సహాయం చేయవచ్చు. అధికపంటలను పండించవచ్చు. రైతుల నందరినీ సంఘాలలో చేర్పించి రైతు ఉద్యమాన్ని బలపర్చవచ్చు. కాబట్టి వర్కర్లంతా ఇరిగేషన్ వ్యవహారాలలో అనుభవం సంపాదించాలి.

# సహకార సంఘములు Co-operative Societies

## సహకార సంఘమనగా ఏమిటి?

(1) సభ్యులయొక్క ఆర్థిక పరిస్థితిని వృద్ధిచేసేదీ; (2) సమాన పద్ధతులమీద సాధారణ ఆర్థికావసరాలను తీర్చేదీ; (3) సమాన హక్కుల మీద ఆధారపడి వాలంటరీగా నడుపబడేదీ; (4) ఒకరకమైన వ్యాపారంతో కూడుకున్నదీ; (5) మితవ్యయమూ, పరస్పర సహాయమూ, స్వయం సహాయమూ, అనే సూత్రాలు పునాదిగా గలిగినట్టి సంస్థ.

## సంస్థయొక్క అవసరం.

మార్వాడీ, భూస్వామి మొదలైన వడ్డీవ్యాపారస్థుల, ధనికుల దోపిడి నుండి రైతులను, చేతి పనివారలను తప్పించి వారియొక్క ఆర్థిక పరిస్థితి బాగుచేయుటకు కో-ఆపరేటివ్ ఆక్టును ప్రవేశపెట్టినట్లు ప్రభుత్వం చెప్పుకుంటోంది.

కో-ఆపరేటివ్ సొసైటీలు స్థాపింపబడుటవల్ల ప్రజలకు చవుక వడ్డీలకు అప్పులు దొరకడానికీ, గ్రామాలలోని ధనిక పెత్తనదారుల చేతిక్రింద నలిగిపోకుండా, రైతులు తప్పించబడడానికీ అవకాశం దొరికింది.

కాని కో-ఆపరేటివ్ ఆక్టును ప్రవేశపెట్టడంలో గల ప్రభుత్వ ఉద్దేశ్యం రైతులు, చేతి పనివారలు మొదలైన ప్రజాసామాన్యము యొక్క ఆర్థిక పరిస్థితిని బాగుచేయడం కాదు. ఈ చట్టం ధనికుల ప్రయోజనాల కొరకు చేయబడింది. (1) వడ్డీ వ్యాపారస్థులయొక్క డబ్బుకు ప్రజల సమిష్టి బాధ్యతను సంపాదించడమూ, (2) ఖర్చులేకుండా ధనికుల డబ్బుకు వడ్డీ వ్యాపారం జరిగేటట్లు చూడడమూ; ఈచట్టం చేయడానికి కారణాలు.

అయినప్పటికీ, కో-ఆపరేటివ్ సొసైటీలద్వారా మనం తక్కువ వడ్డీలకు రైతులకు అప్పులు యిప్పించవచ్చు. గ్రామ సాహుకార్ల పలుకుబడి

నుండి తప్పించి రైతులను స్వతంత్రులనుగా చేయవచ్చు. జీవితావసర వస్తువులను ప్రజలకు అందజేయవచ్చు. సమిష్టి వ్యవసాయానికి అవసరమైన పెట్టుబడిని అప్పుగా సంపాదింపవచ్చు. వ్యవసాయ కూలీలు మొ॥న పేద ప్రజలను, నాముపద్ధతి మున్నగు దోపిడీలనుండి తప్పించవచ్చు.

కాబట్టి గ్రామ ఆర్థిక ప్రతిపత్తికి మూలాధారంగా ఉపయోగపడే యీ సొసైటీలలో చేరి మనం చొరవతో పనిచేయాలి. అందుకొరకు యీ చట్టాన్ని గురించి వివరంగా తెలుసుకోవడం అవసరం.

ఆక్టు పుట్టుక.

పైన చెప్పబడిన కారణాలవల్ల ఈ రాష్ట్రంలో కో ఆపరేటివ్ ఉద్యమాన్ని ప్రారంభించుటకుగాను, ఒక రిపోర్టును తయారు చేయవలసినదిగా, మద్రాసు గవర్నర్ లార్డు వెన్‌లాక్, 1892 సం॥లో సర్ ఫ్రెడరిక్ కొల్సన్ అనే ఆయనను నియమించాడు. ఆనికొల్సన్ యూరప్ ఖండంలోని విధానాలను గురించి చాలా పరిశోధనలుచేసి చివరకు 1895 సం॥లో ప్రథమ రిపోర్టున్నూ, 1897 సం॥లో రెండవ రిపోర్టున్నూ యిచ్చాడు. కాని అవి ఆచరణలోకి రాలేదు. ఆసమయంలోనే, పంజాబులోనూ, సంయుక్త రాష్ట్రాలలోనూ- ప్రాంతీయ సంఘాలు ఏర్పడి పనిచేయసాగాయి. అప్పటికి రాష్ట్ర ప్రభుత్వాల వత్తిడివల్ల కేంద్ర ప్రభుత్వం, సర్ యడ్వర్డు లా యాజమాన్యాన ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ 1901 సం॥లో ఒక చిత్తుబిల్లును తయారుచేయడం, దానిని ఆధారంగా జేసుకొని కేంద్ర ప్రభుత్వం, 1904 సం॥లో కో ఆపరేటివ్ ఆక్టును పాస్ చేయడం జరిగింది.

ఈ ఆక్టును ప్రవేశపెట్టిన కొలది సంవత్సరములకే తిరిగి సవరించవలసి వచ్చింది. ఉద్యమాన్ని బాగా వ్యాపింపజేయడానికి పనికివచ్చేటట్లు యీ చట్టాన్ని కేంద్ర ప్రభుత్వం 1912 సం॥లో సవరణచేసింది. యీ చట్టం ప్రకారం వివిధరకముల సొసైటీలను ఏర్పరచడానికి అవకాశం కలిగింది.

యూనియన్లు, సెంట్రల్ బ్యాంకులు, ప్రొవిన్షియల్ బ్యాంకులు, ప్రొవిన్షియల్ యూనియన్లు స్థాపింపబడ్డాయి.

పిమ్మట మాంటేగు - చెల్మ్సుఫర్డు సంస్కరణల ననుసరించి యీ సహకారోద్యమముపై అధికారం రాష్ట్రప్రభుత్వాలకు సంక్రమించింది. ఆ పిమ్మట సహకారోద్యమము బాగా వ్యాప్తిచెం నకొలదీ దానిలో చాలా లోట్లు బయటపడి, తిరిగీ చట్టాన్ని సవరించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అందువల్ల అవుసరమైన మార్పులను సూచించవలసిందంటూ 1927 సం॥ సెప్టెంబరులో, మద్రాసుప్రభుత్వం, "టవున్ హెండ్" కమిటీని ఏర్పరచింది. ఈ కమిటీయిచ్చిన రిపోర్టును ఆధారంగా జేసుకొని మద్రాసు ప్రభుత్వం, 1932 సం॥లో నూతన చట్టాన్ని పాస్ చేసింది. ఆచట్టమే ఇప్పుడు అమలులో వున్నచట్టం.

## ఈ చట్టంక్రింద రిజిష్టరు చేయబడే సంఘాలు.

ఈ చట్టముక్రింద ఒక సొసైటీని రిజిష్టరు చేయాలంటే అది యీ క్రింది రెండు ఉద్దేశ్యాలలో ఒకదానిని కలిగియుండాలి. (1) సహకార పద్ధతుల ననుసరించి మెంబరులకు ఆర్థిక లాభములను కలుగజేయవలయునను ఉద్దేశ్యము (2) అట్టిసంఘముయొక్క కార్యములకు సహాయ్యముచేయ నుద్దేశించుట.

ఈ రెండింటిలో ఏదో ఒకఉద్దేశ్యముకలిగి యుండని సొసైటీని రిజిష్టరు చేయరు. పదిమంది ఒకసంఘముగాజేరి వినోదకార్యముల కొరకో ఒక క్లబ్బును స్థాపించి రిజిష్టరు చేయమంటే చేయరు. అలాగే సహకారసూత్రము లేకుండా పదిమందిచేరి ఏవర్తకమో చేయుటకు వక కంపెనీని రిజిష్టరుచేయాలంటే చేయరు. ఈ ఆక్టుక్రింద రిజిష్టరుచేయబడే సంఘలకు సహకారము, ఆర్థికలాభము రెండూకూడా వుండాలి. ఇవిలేని సంఘాలు 1913 సం॥ (సెం 7) ఇండియా కంపెనీలఆక్టుక్రింద రిజిష్టరు చేసుకోవాలి. కో-ఆప

రేటివ్ ఆక్టుక్రింద రిజిష్టరు కాబడని ఏసంఘానికైనా, ఎవరైనా లోకల్ గవర్నమెంటుయొక్క అనుమతిలేకుండా "సహకార" అను పేరును ఉప యోగించరాదు. ఆవిలాసముతో వర్తకము చేయరాదు. దీనినిఉల్లంఘించితే రు 50 లు జరిమానా విధింపబడుతుంది. ఆపైన ఎన్నిరోజులు ఆ విలాసంతో వ్యాపారంచేస్తే అన్నిరోజులూ రోజు 1కి రు 5 లు జరిమానా విధిస్తారు. (54 సె॥)

పై సూత్రముల ననుసరించి ఈదిగువ సొసైటీలు కో-ఆపరేటివ్ ఆక్టు క్రింద రిజిష్టరు చేసుకోవచ్చును.

(1) గ్రామసహకార పరపతి సంఘాలు (2) కో-ఆపరేటివ్ స్టోర్సు (3) కో-ఆపరేటివు వీవర్సుసొసైటీలు (4) కో-ఆపరేటివ్ క్రాప్ లోన్ అండు సేల్సు సొసైటీలు (5) కో-ఆపరేటివ్ ఇన్సూరెన్సు (6) సహకార పాలసంఘాలు (7) సహకార వెన్నసంఘాలు (8) సహకార గృహనిర్మాణ సంఘాలు (9) సహకార వ్యవసాయసంఘాలు (10) సహకార పద్ధతులమీద ఆధారపడిన ఇతరవిధములైన సంఘాలు.

## లోకల్ కో-ఆపరేటివు యూనియన్లు.

గ్రామపరపతి సంఘాలు, వెన్న, పాల సంఘాలు, వీవర్సుసొసైటీలు మొదలైనవాటియొక్క పనిని తనిఖీచేస్తూ, వాటికి అప్పులను సిఫార్సుచేస్తూ వుంటాయి. ఇవి ప్రాంతీయంగా 20 నుండి 40 వరకూ సొసైటీలను కలిగి వుంటాయి. ప్రతిగ్రామసంఘాన్నుండీ వక ప్రతినిధి యీ యూనియన్ కు ఎన్నుకోబడతాడు. వారినుండి 7 గురు డైరక్టర్లు ఎన్నుకోబడి అందులో ఒక ప్రెసిడెంటునూ, శెక్రటరీని నియమించుకుని పనిచేస్తారు. ఈ యూనియన్ అప్పులు యివ్వడంగాని, వసూలు చేయడంగాని వుండదు. సంఘాలయొక్క పనిని తనిఖీచేయడం, సెంట్రల్ బాంకుకు రిపోర్టుచేయడంమాత్రం వీనిపని.

## సెంట్రల్ బ్యాంకు.

ఈ బ్యాంకు, ప్రావిన్షియల్ బ్యాంకునుండి అప్పులు తెచ్చి గ్రామ సంఘాలకు యిస్తుంది. అర్బన్ బ్యాంకులకూ, కో-ఆపరేటివ్ క్రాప్ లోన్ అండ్ సేల్స్ సొసైటీలకూ, కో-ఆపరేటివ్ స్టోర్సుకూ, కూడా సెంట్రల్ బ్యాంకే అప్పులిస్తుంది. వ్యక్తులవద్దనుండి డిపాజిట్లుగాకూడా డబ్బు పుచ్చుకుంటుంది. ప్రతి ప్రాథమిక సొసైటీ ఒక్కొక్క ప్రతినిధిని దీనికి ఎన్నుకుంటారు. వీరుగాక షేర్ హోల్డరులుకూడా ప్రతినిధులే. వీరంతాకలసి 15గురు డైరెక్టర్లను 3 సం॥ కొకపర్యాయం ఎన్నుకుంటారు. ఆ డైరెక్టర్లు ఒక ప్రెసిడెంటునూ, వైస్ ప్రెసిడెంటునూ, ఒకలోన్సు కమిటీని ఎన్నుకొని పని చేస్తుంటారు.

## ప్రావిన్షియల్ బ్యాంకు.

ఈ బ్యాంకు వ్యక్తులవద్దనుండి డిపాజిట్లు పుచ్చుకొని సెంట్రల్ బ్యాంకులకు అప్పులిస్తుంది. ఇంకా సహకారపద్ధతులమీద నడుపబడే పంచదార ఫాక్టరీలకు, ఇండస్ట్రియల్ వర్క్సుకూ కూడా పెట్టుబడి పెడుతుంది.

## ప్రావిన్షియల్ కో-ఆపరేటివ్ యూనియన్.

ఇది కో-ఆపరేటివ్ ఉద్యమానికి సంబంధించిన ప్రచారము, శిక్షణ చేస్తుంటుంది. సంస్థలలో పనిజేసేవారిని ఎడ్యుకేట్ చేయడంకూడా దీనిపని. దీనితరఫున "మద్రాసు కో-ఆపరేటివ్ జర్నల్" అను ఒక ఇంగ్లీషు పత్రిక ప్రచురించబడుతుంది. ఇంకా ఉద్యమానికి సంబంధించిన కరపత్రాలు మొదలైనవి ప్రచురించి ఉద్యమాన్ని సమన్వయ పరచడానికి పని చేస్తుంది. దీనిక్రింద ఆంధ్రసహకార సమ్మేళనము, తమిళనాడు కో-ఆపరేటివ్ ఫెడరేషన్ అను రెండు ఫెడరేషనులు తమతమ భాషలకు సంబంధించిన ప్రచారము చేస్తుంటయి.

## ట్రైనింగు ఇన్‌స్టిట్యూట్లు.

ఆంధ్ర రాష్ట్రానికి ఒకటి, తమిళనాడుకు ఒకటి రెండు ఇన్‌స్టిట్యూట్లున్నాయి. వీటిద్వారా స్కూళ్లుపెట్టి సూపర్‌వైజర్లకూ, ఇతరులకూ, బాంకింగు, బుక్‌కీపింగ్ మొదలైనవాటిలోకూడ శిక్షణ యిస్తారు. ఇవిగాక మద్రాసులో సెంట్రల్ కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూట్ వుంది. దీనిద్వారా కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు ఉద్యోగులకు తర్ఫీదు యివ్వబడుతుంది. దీని ఖర్చు ప్రభుత్వమే భరించుచుంటుంది.

## భూమి తనఖా బ్యాంకులు.

ఇవి 1934 సం॥ మద్రాసు కో-ఆపరేటివ్ లాండుమార్టుగేజిబ్యాంకుల ఆక్టు (నెం 10) ననుసరించి ఏర్పాటుచేయబడ్డాయి. రాష్ట్రానికంతకూ ఒక సెంట్రల్ లాండు మార్టుగేజిబ్యాంకు వుంటుంది. దీనికింద ఆయాప్రాంతాలకు లోకల్ లాండు మార్టుగేజిబ్యాంకులు వుంటాయి. వీటికి సెంట్రల్ లాండు మార్టుగేజిబాంకు డబ్బుయిస్తుంది. ఈ బాంకులనుండి రైతుల భూములను తనఖాపెట్టుకుని అప్పులు యిస్తారు. అప్పు పుచ్చుకున్నవారంతా ఆ బాంకుకు ప్రతినిధులే. వారే పాలకవర్గాన్ని ఎన్నుకుంటారు. ఆపాలకవర్గం పనిని నడుపుతుంది.

## కో ఆపరేటివ్ డిపార్టుమెంటు.

ఇది ప్రభుత్వశాఖ. ఈశాఖయొక్క తనిఖీకి సహకారోద్యమమంతా లోబడివుంటుంది. జిల్లాకు ఒక డిప్యూటీ రిజిస్ట్రారువుండి ఆ జిల్లాలోని సహకార సంఘాలన్నింటిని (భూమితనఖా బాంకులుతప్ప, వీటికి కొన్ని జిల్లాలకు కలిపి ఒక ప్రత్యేక డిప్యూటీ రిజిస్ట్రారువుంటాడు. ప్రావిన్షియల్ రిజిస్ట్రారు మాత్రం రెండింటికీ ఒక్కడే) పరిశీలిస్తూవుంటాడు.

## డిప్యూటీ రిజిస్ట్రారుకుగల ముఖ్యమైన అధికారాలు.

(1) సంఘములను, వాటి బైలాల మార్పులను రిజిష్టరుచేయుట లేక నిరాకరించుట (10 సె.) (2) సంఘముల బాధ్యతలలో మార్పునంగీకరించుట

లేక నిరాకరించుట (5 సె.) (3) రిజిష్టరు చేయబడినట్లు సర్టిఫికేట్ నిచ్చుట (11 సె.) (4) మీటింగులను సమావేశపరుపవలెను పంచాయితీలను, లేక డైరెక్టర్లను ఉత్తర్వుచేయుట, వారట్లు చేయనిచో స్వయముగా సమావేశ పరచుట (15 సె.) (5) బాకీదారుల ఆస్తులను జప్తుచేయుట (28 సె.) (6) సంఘముల లెక్కలను పరీక్షించుట (37 సె.) (7) సంఘముల స్థితిగతులను దర్యాప్తుజేయుట (38 సె.) (8) సంఘముల రికార్డులను తనిఖీచేయుట (39 సె.) (9) సంఘముయొక్క కమిటీని (పాలకవర్గాన్ని) తీసివేయుట, సంఘ వ్యాపారములను నిర్వహించుటకు తగినవారిని నియమించుట (43 సె) (10) సంఘమును ఎత్తివేయుట (44 సె.) (11) రిజిష్ట్రేషన్ను రద్దుచేయుట (45 సె.) (12) లిక్విడేటరును నియమించుట (47 సె.) (13) సర్ ఛార్జి చేయుట (49 సె.) (14) సంఘముకు రావలసిన సొమ్ములను బాకీదారుల ఆస్తులను జప్తుచేయుట (50 సె.) (15) సంఘ వ్యాపారములను సంబంధించిన తగవులను పరిష్కరించుటకు మధ్యవర్తుల నేర్పరచి, పరిష్కారం చేయుట (51 సె.)

## గ్రామ సహకార సంఘాన్ని స్థాపించేమార్గం.

ఏదైనా ఒక గ్రామానికి పరపతిసంఘం కావాలంటే ముందుగా లోకల్ కోఆపరేటివ్ యూనియన్కున్నూ, సెంట్రల్ బ్యాంకుకున్నూ. పిటీషన్లు పెట్టాలి. యూనియన్ సూపర్వైజర్ వచ్చి విచారించి యూనియన్కు సిఫార్సుచేస్తాడు. యూనియన్ దానిని అంగీకరించి సెంట్రల్ బాంకుకు పంపుతుంది. తరువాత సెంట్రల్ బాంకు సూపర్వైజరువచ్చి విచారించి రిపోర్టు బాంకుకు పంపుతాడు. బాంకు అంగీకరించి డిప్యూటీ రిజిస్ట్రారుకు సిఫార్సుచేస్తుంది. మళ్ళీ కోఆపరేటివ్ ఇన్స్పెక్టరు వచ్చి గ్రామస్థుల నందరిని సమావేశపరచి, పంచాయితీదారులను, అధ్యక్ష, కార్యదర్శులను ఏర్పరచి, సొసైటీని రిజిష్టరు చేయవలసినదిగా డిప్యూటీ రిజిస్ట్రారుకు సిఫారసు చేయాలి. ఆ పిమ్మట అతడు ఆసొసైటీని రిజిష్టరుచేస్తాడు.

తరువాత ఆ సొసైటీని లోకల్ యూనియన్‌కూ, సెంట్రల్ బ్యాంకుకూ అఫిలియేట్ చేసుకొని, అప్పులు తెచ్చుకుంటూ సంఘాన్ని నడుపుకోవాలి.

సాధారణంగా సంఘాన్ని ఏర్పరచడంలో మోసాలూ, ప్రతిబంధకాలూ జరుగుతూవుంటయి. గ్రామంలోని వడ్డీ వ్యాపారస్తులు, పెత్తందారులు సంఘం స్థాపించబడకుండా చూస్తారు. అందుకుగాను యూనియన్ డైరెక్టర్లనూ, బ్యాంకు డైరెక్టర్లనూ, కూడగట్టుకోవడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం విఫలమైతే ఆఖరుకు తమ అనుచరులను పెత్తనంలోకి తీసుకురావడానికి ప్రయత్నిస్తారు. యిన్‌స్పెక్టరులను ఆహ్వానించి తమ ఇండ్లవద్ద కూర్చోబెట్టి, తమ అనుచరులే పంచాయితీదార్లుగా ఎన్నుకోబడినట్లు వ్రాయించడానికి ప్రయత్నంచేస్తారు. ఇదీ విఫలమైతే సొసైటీ రిజిష్టరు చేయవద్దని, డిప్యూటీ రిజిష్ట్రారుకు ఆక్షేపణలు తెలిపి పేచీలుపెడతారు. ఈతంతులన్నీ నడుపుకోవడానికి యూనియన్లలోనూ, బ్యాంకులలోనూవుండే పార్టీ కక్షదారుల్ని వుపయోగించుకుంటారు.

వీటినన్నింటిని ఎదుర్కొని సరియైన ప్రజాప్రాతినిధ్యంతో సంఘము రిజిష్టరు కాబడేటట్లు వర్కర్లు కృషిచేయాలి. సొసైటీని యూనియన్ అధికార్లు ఆర్గనైజు చేయకపోతే, బ్యాంకుకూ, బ్యాంకు చేయకపోతే, డిప్యూటీ రిజిష్ట్రారుకూ పిటీషన్లుపెట్టి ఆందోళనచేయాలి. గ్రామంలోని ప్రజలందరికీ అందుకు సంబంధించిన విషయాలనుచెప్పి నిరోధకులను బట్టబయలుచేయాలి. ఆవిధంగా ప్రజలందరినీ కూడగట్టి ఆందోళనచేస్తే డిప్యూటీ రిజిష్ట్రారు తప్పకుండా రిజిష్టరుచేస్తాడు. అప్పటికీ డిప్యూటీ రిజిష్ట్రారు, సంఘాన్ని రిజిష్టరు చేయకపోతే, జిల్లా కలెక్టరుకూ, ప్రావిన్షియల్ రిజిష్ట్రారుకూ పిటీషన్లుపెట్టి ఆందోళనచేయాలి. గ్రామ పెత్తనదార్లు, తమ అనుచరులను పంచాయితీదార్లుగా వ్రాయించుటకుచేసే కుట్రలను జాగ్రత్తగా కనిపెట్టివుండి ఎదుర్కోవాలి. కుట్రజరిగితే వెంటనే డిప్యూటీ రిజిష్ట్రారుకు రిపోర్టుచేయాలి. లేకపోతే ఒకసారి సొసైటీగనుక అభివృద్ధి నిరోధకుల చేతిలోకిపోతే మళ్లీ

రావడం కష్టమవుతుంది. అందుచేత సొసైటీ ఆర్గనైజు చేయుబడేటప్పుడే, ప్రజా ప్రతినిధులు పంచాయితీదార్లుగా ఎన్నుకోబడేటట్లూ, చేరదలచిన ప్రతిరైతూ సొసైటీలో చేర్చుకోబడేటట్లూ చూడాలి.

## గ్రామ సహకార సంఘముయొక్క బైలాలు.

కో ఆపరేటివ్ ఆక్టుననుసరించి, డిప్యూటీ రిజిస్ట్రారు కొన్ని బైలాలను (ఉపవిధులను) ఏర్పరచి సొసైటీని రిజిష్టరుచేస్తారు. ఆ బైలాల ననుసరించి సొసైటీని నడుపుతుంటూ అవుసరమైనప్పుడు మార్చుకొని క్రొత్త బైలాలను రిజిష్టరు చేయించుకోవాలి.

## జనరల్ బాడీ అధికారాలు.

సంఘ మెంబర్లందరూ జనరల్ బాడీ మెంబర్లే. వీరి ముఖ్యాధికారాలు: (1) పంచాయితీదార్లను ఎన్నుకొనుట (2) అవుసరమైనప్పుడు వారిని తొలగించుట (3) బైలాలను సవరించుకొనుట లేక మార్చుకొనుట (రిజిస్ట్రారు అనుమతితో) (4) ఏ మెంబరునైనా సొసైటీనుండి తొలగించుట (5) పంచాయితీదారులకు వ్యతిరేకంగా వచ్చిన సభ్యుల ఆక్షేపణలనుగురించి విచారించుట (6) పంచాయతీదారులకు అప్పులను శాంక్షన్ చేయుట (7) ఆస్తి అప్పుల స్టేటుమెంటును అంగీకరించుట (8) యూనియన్‌కూ, బాంకుకూ ప్రతినిధులను ఎన్నుకొనుట (9) యూనియన్‌కూ, బాంకుకూ సొసైటీని అఫిలియేట్ చేయుట లేక డిసఫిలియేట్ చేయుట (10) రిజిస్ట్రారుయొక్క సాంవత్సరిక ఆడిట్ సర్టిఫికెట్‌ను పరిశీలించుట (బైలా 31)

## పంచాయతీ అధికారాలు.

పంచాయతీదార్లు తమలోనుండి అధ్యక్ష, కార్యదర్శులను ఎన్నుకొని మళ్లీ క్రొత్త ఎన్నికలు జరిగేవరకు, సంఘ వ్యవహారాలను నిర్వహించాలి. ఒక పంచాయితీదారు రాజీనామాయిస్తే జనరల్ బాడీయే ఆ స్థానానికి ఇంకొకరిని ఎన్నుకోవాలి. (బైలా 20)

వాయిదా మీరిపోయేటంతవరకూ అప్పులు చెల్లించకుండా వున్నవారు పంచాయతీదార్లుగాగాని, ప్రతినిధులుగాగాని వుండకూడదు. (బైలా 24)

సొసైటీలో ఎవరినైనా చేర్చుకోవడానికిగాని లేక తోసివేయడానికి గాని అధికారముంది. (బైలా 6)

ఆ సొసైటీలోని మెంబరు ఇంకో సొసైటీలో మెంబరుగావున్నా, లేక గ్రామంనుండి వెళ్లిపోయినా అతనిని సంఘమునుండి తొలగించవచ్చును. (బైలా 9)

సంఘ వ్యవహారాలు నడపడంకొరకు పంచాయితీ ఎప్పుడైనా జనరల్ బాడీని పిలువవచ్చును. లేదా 15 గురు సభ్యులుకోరిన 1 నెలలోగా పిలువాలి. లేదా యూనియన్‌గానీ, బాంకుగానీ, డిప్యూటీ రిజిస్ట్రారుగాని కోరినప్పుడు పిలువాలి. (బైలా 32)

జనరల్ బాడీని సమావేశపరుప దలచినప్పుడు టాంటాం ద్వారాగానీ కూడలి స్థలంలో నోటీసు అంటించడం ద్వారాగానీ, నోటీసులు అందజేయడం ద్వారాగాని సభ్యులను పిలువవచ్చు. ఏసభ్యుడూ సమావేశ విషయం తెలియలేదని ఆక్షేపించుటకు వీలులేదు. (బైలా 35)

అప్పులు.

సంఘ సభ్యులకుమాత్రమే అప్పులు యివ్వబడతాయి. ఏసభ్యుడూ కూడా తనకు అప్పు తప్పనిసరిగా యిచ్చితీరాలని నిర్బంధించుటకు వీలులేదు. (బైలా 38)

అప్పుకోరే మెంబర్లందరూ శెక్రిటరీకి అప్లికేషన్లుపెట్టాలి. (బై. 39)

ఈ క్రింది సూచించిన పనులకుమాత్రం అప్పులు యివ్వబడతాయి. (1) విత్తనాలకూ, ఎరువులకూ, ఇతర వ్యవసాయ ఖర్చులకూ (2) పశువులను కొనడానికీ, వాటికి మేత కొనడానికీ (3) బండ్లు కొనడానికీ (4)

శిస్తులు కట్టుటకేందుకూ (5) భూమిని అభివృద్ధి పర్చుకోవడానికీ, కొత్త భూమిని కొనడానికీ (6) ఇండ్లను కట్టుకోవడానికీ, మరమ్మతులూ, కొనుటకు (7) చేతి పనివారలకు పనిముట్లు కొనడానికీ, ముడిసరుకు కొనడానికీ (8) చిల్లర వ్యాపారానికీ (9) చిల్లరఋణముల తీర్మానం నిమిత్తమూ (10) జీవితావసర వస్తువులూ, ఆహారమూ, కొనడానికీ (11) పిల్లల చదువులకూ అప్పులు యిస్తారు. (బైలా 40)

సభ్యులు తీసుకున్న అప్పులు సరిగా వుపయోగింప బడుటలేదనితోస్తే పంచాయితీదారులు అప్పులను రద్దుచేసి, డబ్బు వెంటనే వసూలుచేయ వచ్చును. (బైలా 41)

### సొసైటీలకు డబ్బు అప్పు తేవడం.

సెంట్రల్ బాంకునుండి తేవచ్చు. సభ్యులనుండిగాని, ఇతరులనుండిగాని డిపాజిట్లు తీసుకోవచ్చు. డిపాజిట్లలో (1) ఫిక్సెడ్ (2) రికరింగ్ (3) సేవింగ్ (4) కరెంటు (5) హోమ్ సేఫ్ (6) చిట్ ఫండ్సు అనేవివుంటయి.

### గ్రామ సొసైటీలలో జరిగే అన్యాయాలు.

సాధారణంగా చాలా సొసైటీలు గ్రామపార్టీ కక్షదారుల చేతులలో వుంటయి. ఎవరిచేతిలోవుంటే వారు ఎదిరిపార్టీవారిని చేర్చుకోరు. వకవేళ జనరల్ బాడీలో ఎదిరిపార్టీవారే మెజారిటీవుంటే దొంగసమావేశాలు జరిపి తామే ఎన్నుకోబడినట్లు వ్రాస్తారు. లేదా సమావేశాలు జరుపకుండానే సమావేశం జరిగినట్లు తాము ఎన్నుకోబడినట్లూ వ్రాస్తారు. ఏ పదిహేను మందితోనో ఏదోవకవిధంగా సంతకాలు చేయిస్తారు. ఒక్కొక్కప్పుడు ఎదిరి పార్టీవారిని సొసైటీనుండి తొలగించివేస్తారు. లేదా వారికి అప్పులను యివ్వరు. ఇన్నివిధాలా బాధపెట్టి ఎదిరిపార్టీవారిని తమపార్టీలోకి మార్చుకోవడానికి ప్రయత్నిస్తారు. పార్టీని పోషించుకోవడానికి దొంగఅప్పులు యిస్తారు. ఏదోఒకపేరుపెట్టి సొసైటీడబ్బు వాడుకుంటారు. ఈవిధంగా

సొసైటీని తమ స్వంతబాంకుగా వుపయోగించుకొని తక్కిన ప్రజలపై పెత్తనం చలాయించజూస్తారు.

కాబట్టి గ్రామప్రజలందరినీ ఐక్యపరచి అట్టివారిచేతినుండి సొసైటీని తప్పించే ప్రయత్నంచేయాలి. రెండుపార్టీలున్నచోట ఏపార్టీకి చెందనివారి చేతిలో ఆసొసైటీని పెట్టాలి. అందరినీ సొసైటీలో చేర్చుకునేటట్లు అందరికీ అప్పులిచ్చేటట్లూ చూడాలి. పంచాయతీదార్లు కలిసిరాకపోతే డిప్యూటీ రిజిష్ట్రారుద్వారా వారిపై ఒత్తిడి తీసుకురావాలి. ఈవిషయంలో తీవ్రంగా కృషిచేసి సొసైటీలలోవుండే కుళ్లును తొలగించితేనేగాని, వాటివల్ల రైతులకు ఉపయోగం కలుగదు.

సొసైటీలలో మాదిరిగానే యూనియన్లలోనూ, బాంకులలోనూ, చివరకు ప్రావిన్షియల్ బాంకులోకూడా పార్టీలున్నాయి. అన్యాయాలుకూడా జరుగుతుంటాయి. కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు ఎల్లప్పుడూ, తమతాబేదారుల చేతులలో ఉద్యమాన్నంతటినీ పెట్టడానికీ, తద్వారా ప్రజలపై తాము పెత్తనం వహించడానికీ కృషిచేస్తుంది. అందుచేత అది లాయలిస్టుల[illegible]వున్న వారిని సపోర్టుచేస్తుంది. బాంకులలోవున్న పార్టీలు గ్రామాలవరకు పాకుతున్నాయి. ఒక్కొక్కప్పుడు కొట్లాటలు జరిగి రక్తపాతం జరగడం కోర్టులకెక్కడంకూడ జరుగుతోంది. ఈవిధంగా గ్రామఐక్యత భగ్నమై పార్టీకక్షలు పెరిగిపోతున్నాయి.

వీటిని అరికట్టాలంటే మనం ప్రాథమిక సొసైటీలనుండి యూనియన్లకూ, బ్యాంకులకూ, పార్టీలతో సంబంధంలేనివారినీ, ప్రభుత్వంలాయలిస్టులు కానివారిని ఎన్నుకునేటట్లు ప్రజలలో ప్రచారంచేయాలి. ప్రభుత్వ పాలసీని బట్టబయలుచేసి పార్టీలులేకుండా వుండేటట్లు చేయాలి. యూనియన్లలోనూ, బాంకులలోనూ వున్నపార్టీలకు రాజీచేసి, ప్రభుత్వ చర్యలను అరికట్టాలి. అలాచేయగలిగినప్పుడే మనం కో-ఆపరేటివ్ ఉద్యమంలోవున్న కుళ్ళును తొలగించి, ప్రజలకు కొంతవరకు మేలు చేయగలుగుతాం.

## కో ఆపరేటివ్ స్టోర్సు.

5 వేల జనాభా గలిగిన ఏ ప్రాంతములోనైనా, స్టోర్సు సొసైటీని ఏర్పరచవచ్చును. ఆ స్టోర్సు అమ్మే అమ్మకంనుండి వచ్చే లాభంతో అది పోషింపబడేటట్లుండాలి. స్టోర్సు కావాలన్నవారు సెంట్రల్ బాంకుకూ, డిప్యూటీ రిజిష్ట్రారుకూ పిటీషన్లు పెట్టాలి. స్టోర్సును ఆర్గనైజు చేయడానికి సెంట్రల్ బ్యాంకు సమ్మతిస్తే అది డిప్యూటీ రిజిష్ట్రారుకు సిఫార్సు చేస్తుంది. ఆపైన డిప్యూటీ రిజిష్ట్రారు విచారించి రిజిష్టరు చేస్తాడు. సాధారణంగా స్టోర్సు సొసైటీలను డిప్యూటీ రిజిష్ట్రార్లు రిజిష్టరు చేయడంలో అనేక ఆటంకాలు పెడుతున్నారు. ప్రజలను సమీకరించి ఒత్తిడి తెస్తేనేగాని రిజిష్టరు చేయడంలేదు. సొసైటీని రిజిష్టరు చేసిన తరువాత వెయ్యి రూపాయిలు సభ్యులు యిచ్చుకుంటే 4 వేలు సెంట్రల్ బాంకు యిస్తుంది. ఆ 5 వేలు కలిపి సరుకులు కొని అమ్ముతూవుండాలి. గ్రామ సహకార పరపతి సంఘం మాదిరిగానే దీనికీ పంచాయతీ ఎన్నిక, ప్రతినిధుల ఎన్నికా జరుగుతుంది.

ఈ స్టోర్సును స్థాపించడం ద్వారా మనం ప్రజలకు పంచదార కిరసనాయలూ, బట్టలూ, అగ్గిపెట్టెలు మొ॥ జీవితావసర వస్తువులను కంట్రోలు ధరలకు అందజేయవచ్చును. విపరీత లాభాలను వ్యాపారస్థులు గుంజకుండా ఆపుచేయవచ్చును. ఎరువులూ, విత్తనాలూ, వ్యవసాయదారులకు అందజేయవచ్చును. కాబట్టి మనం వీటిని స్థాపించుటకూ, పనిచేయించుటకూ, కృషి చేయాలి.

స్టోర్సు స్థాపింపబడగానే, వ్యాపారస్థులు దీనిని పడగొట్టడానికి కృషి చేస్తారు. తాత్కాలిక నష్టానికైనా సిద్ధపడి సరుకులను తగ్గించి అమ్ముతారు. ఆవిధంగా స్టోర్సులోకంటే తాము చవుకగా అమ్ముతున్నట్లు నటిస్తూ, ఆవిధంగా ప్రజలలో ప్రచారం చేస్తారు. ప్రజలకు సరుకులను అప్పుగా యిచ్చి స్టోర్సుకుపోకుండా తమవద్దకు వచ్చేటట్లు చేస్తారు. గ్రామాలలోని

వీరి చర్యలను పట్టణాలలోని పెద్ద వ్యాపారస్తులు అన్నివిధాలా సాయం చేస్తారు. గ్రామ పెత్తందార్లు కూడా ఒక్కొక్కచోట వీరి చర్యలకు తోడ్పడతారు.

వీటిని ఎదుర్కొని స్టోర్సును జయప్రదంగా నడుపడానికి వర్కర్లు చాలాచోట్ల సరియైనపంథా అవలంబించుటలేదు. వ్యాపారస్తుల కుట్రలను గూర్చి ప్రజలలో ప్రచారంచేయకుండా వారితో పేచీలకు దిగుతున్నారు. అలా పేచీలకు దిగితే మనం స్టోర్సును జయప్రదంగా నడుపలేము సరిగదా, ఆమార్గం చివరకు పార్టీ కక్షలకు దారితీస్తుంది.

కాబట్టి వర్కర్లు యీక్రింది పద్ధతు లవలంబించాలి.

(1) చిల్లర వర్తకులనందరినీ కూడగట్టి స్టోర్సులో వాటాలువేయించి వారికి స్టోర్సునుండి సరుకును సప్లైచేసి, ఆ సరుకును రు 100 కి రు 6 లు లాభము మించకుండా అమ్మునట్లు ఏర్పాటుచేయాలి. ఇలాచేస్తే స్టోర్సులో చిల్లరగా అమ్మే బాధ్యత, దానికంతకూ లెక్కలువ్రాసే బాధ్యతా తప్పు గుమాస్తాలనుకూడా తగ్గించవచ్చు.

(2) వ్యాపారస్థుల కుట్రలను ప్రజలలో బట్టబయలుచేసి, స్టోర్సు పెట్టడంవల్లనే వారు సరుకుల ఖరీదులు తగ్గించి అమ్ముతున్నారని, లేకపోతే విపరీత లాభాలు గుంజేవారనీ ప్రజలు గుర్తించేటట్లు చేయాలి.

(3) సమిష్టి బాధ్యతతో నడుపబడే వ్యాపారాన్ని పడగొట్టుటకు, వ్యక్తిగత వ్యాపారస్తులకు ఎలా అవకాశముంటుందో ప్రజలలో ప్రచారం చేసి; సమిష్టి వ్యాపార సంస్థలను ప్రజలే ఎలా పోషించుకోవాలో, ఎందుకు పోషించుకోవాలో? చెప్పి ప్రజలంతా స్టోర్సును నిలబెట్టడం తమ అందరి బాధ్యతగా గుర్తించేటట్లు చేయాలి.

(4) స్టోర్సునునడిపే బాధ్యత గుమాస్తాలపైనే పెట్టకుండా, వర్కర్లు బాధ్యత వహించాలి. అంటే వీరే గుమాస్తా పనులుచేస్తూ, కిసాన్ వర్కర్లను పాడుచేయకూడదు.

(5) రైతులకు కావలసిన వులవలు, ఎరువులూ, తవుడూ మొదలైనవి మొత్తాలుగా తెచ్చి అమ్మాలి. అలాంటివాటి అమ్మకం తేలిక. వాటిమీద వచ్చే ఆదాయంతో స్టోర్సు నడుస్తుంది.

(6) పెద్దపెద్ద ఖరీదు కలిగిన వస్తువులనే స్టోర్సులో పెట్టకూడదు. ప్రజల కందుబాటులోవుండే ఖరీదులుకలవీ, చింతపండు వగైరా సరుకులలో రెండవ రకముకూడా స్టోర్సులో ఉంచాలి.

ఇలాచేస్తే మనం జయప్రదంగా స్టోర్సును నడుపగలుగుతాం. అధిక లాభాలను అరికట్టి జీవితావసర వస్తువులను ఆహారవస్తువులకూ ప్రజలకు అందజేయగలుగుతాం.

## ఇతరవిధములైన సహకారసంఘాలు.

రైతుల ధాన్యాన్ని కుదువబెట్టి అప్పులు తెచ్చుకోవాలంటే క లోన్ సంఘాలనూ; అమ్మాలంటే సేల్సు సంఘాలనూ; సమిష్టి వ్య యానికి అప్పుకొరకు వ్యవసాయసంఘాలనూ; ఉపయోగించుకోవాలి. అదే విధంగా అవకాశమున్నంతవరకూ పాల సంఘాలను, వెన్న సంఘాలు, పశువుల ఇన్సూరెన్సు సంఘాలు మొదలైనవాటి నన్నిటిని వుపయోగించుకోవాలి.

## వర్కర్లకు కొన్ని సలహాలు.

(1) సహకార పరపతిసంఘాలులేక రైతులు ఎక్కువ వడ్డీలకు అప్పులు తెచ్చుకుంటూ అప్పు యిచ్చేవారికి ఊడిగము చేయవలసివస్తున్నచోట్ల వెంటనే పరపతిసంఘాలు స్థాపించుటకు కృషిచేయ్యాలి.

(2) సంఘాలు ఆర్గనైజు చేయబడేటప్పుడే సరియైన వ్యక్తులు ఎన్నుకోబడేటట్లు చూడాలి.

(3) సంఘాలువుండి పార్టీకక్షలు ఏర్పడ్డచోట్ల రెండు పార్టీలకూ రాజీ చేయుటకు ప్రయత్నించాలి.

(4) ఏ సందర్భములోనూ కూడా వర్కర్లు పార్టీ తగాదాలలో మునిగి, అన్యాయాలకు దోహదం చేయకూడదు.

(5) యూనియన్లకూ, బాంకుకూ, కోఆపరేటివ్ సెంట్రల్ స్టోర్సుకూ ప్రతినిధులను ఎన్నుకొనుటలో సరియైనవారినే ఎన్నుకొనేటట్లు ప్రజలలో ప్రచారం చేయాలి.

(6) డిపార్టుమెంటుయొక్క చర్యలను ప్రజలలో బట్టబయలుచేసి, వాటిని ఎదుర్కొనుటకుగాను, యూనియన్లలోనూ, బాంకులలోనూ గల పార్టీలు, రాజీపడవలసినదిగా ప్రజలే వత్తిడి తెచ్చేటట్లు చేయాలి.

(7) స్వార్థపరుల చేతులలోనుండి, ప్రజా సహకారంతో, సొసైటీని తప్పించి, మంచివారిచే నడుపబడేటట్లు చూడాలి.

(8) గ్రామ పెత్తందారులు తమ పార్టీలను పెంచుకోవడానికీ, రక్షించుకోవడానికీ, సహకార సంఘాలను ఉపయోగించుకోకుండాచేసి, వీలైనంతవరకూ ప్రజలకు వుపయోగపడేటట్లు చూడాలి.

(9) వ్యవసాయ కూలీలు మొదలైన బీదప్రజలకు వారి జీవితావసరములు గడుపుకొనుటకు కావలసిన అప్పులను సొసైటీలనుండి యిప్పించాలి.

(10) "కామన్ గుడ్ ఫండు" లాంటి నిధిని, దుర్వ్యయం చేయకుండా, ప్రజోపయోగకార్యాలకొరకు ఖర్చుపెట్టేటట్లు చూడాలి.

ఈ విధంగా పనిజేస్తే మనం కో-ఆపరేటివు సంస్థలద్వారా ప్రజలకు చాలా మేలు కలుగజేయవచ్చు. అధికవడ్డీని, లాభాలను అరికట్టవచ్చు. ప్రజలను గ్రామపెత్తందార్ల చేతులలో పడిపోకుండా కాపాడవచ్చు.

కాని కో-ఆపరేటివు సంస్థలద్వారానే ప్రజలయొక్క ఆర్థికప్రతిపత్తిని వృద్ధిపర్చగలమనుకోకూడదు. సహకారసంఘాలు ప్రజాసామాన్యానికంటె, పెట్టుబడిదారులకే ఎక్కువ వుపయోగకరంగా వున్నాయి. ప్రజలకెంత ఓటింగుహక్కున్నా, ఉద్యమమంతా వారిపెత్తనంక్రిందనే వుంది. ప్రజలు చొరవచేసి ఉద్యమాన్ని వారిచేతిక్రిందికి తెచ్చుకుంటే; వెంటనే ధనికులు వారిడబ్బును బాంకులలోనుండి తీసివేసి, ఉద్యమాన్నే దెబ్బగొట్టే అవకాశం వారిచేతులలోనే వుంది. అంతేగాకుండా సహకారసంఘాలద్వారా, పెట్టుబడిదారులు తమడబ్బుకు భద్రత, లాభమూ (వడ్డీ), సంపాదించడమే కాకుండా; షేర్ కాపిటల్సుద్వారా వచ్చే ప్రజలడబ్బునుకూడా తమస్వంత వ్యాపారానికి ఉపయోగించుకుంటున్నారు.

కాబట్టి సహకార సంఘాలద్వారానే రైతులను ఉద్ధరించగలమని అభిప్రాయపడకుండా, వీటిద్వారా ఎంతవరకు రైతులకు మేలుకలిగించడానికి అవకాశముంటుందో అంతవరకు వీటిని వుపయోగించుకుంటూ కృషిచేయాలి. ఆ కృషిద్వారా రైతుఉద్యమాన్ని బలపరచడానికి పాటుపడాలి.



స్వరాజ్య ప్రెస్, బెజవాడ.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B153 |
| పుస్తకం పేరు | రైతు సమస్యలు 01 |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 197 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | n/o |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |